Approved by the Government Text Book Committee
...nt St. George Gazette page 565 of 21-10-1913.

# RANI SAMYUKTA

(AN HISTORICAL NOVEL)

BY

**V. SUBBA RAO.**

...URTH EDITION

PRINTD AT CHANDRIKA PRESS, GUNTUR.

PUBLISHED BY

V. V. K. LAKSHMAJI RAO,

GUNTUR.

1915.

...ice Rs. 12.

THE SACRED MEMORY

OF

THE LATE

# Srimati Velala Lakshmi Narasamma Garu

MY KIND & BELOVED MOTHER

This Story of an Indian Princess is respectfully

DEDICATED.



శ్రీ

# రాణీసంయుక్త.

## మొదటి ప్రకరణము.

రమారమి యెనిమిదివందల సంవత్సరముల క్రిందట డిల్లీపట్టణమునకును గన్యాకుబ్జనగరమునకును నడుమనున్న యమునాగంగాప్రాంత కాంతార ప్రదేశంబు లొకనాఁటి సాయంకాలమునఁ జూపరులకపరిమితానందభయ దాయకములగు రంగస్థలములై యుండెను. మూర్ఖమతులగునో ఆర్యావర్తవాసులారా! మదోన్మత్తులై, సత్యవిద్యావిదూరులై, కుమతాచారములంబట్టునడి, నైకమత్యాభావమున మెలంగుచు, మాతృభూమియగు నార్యావర్తముపై సించుకైన నభిమానముంచక, పరస్పరద్వేషంబుల జనింపఁ జేసికొని దుష్కృత్యములఁ గావింప సమకట్టితిరి కావున నందఱకు బుద్ధివచ్చునటుల మీపై దాడి వెడలఁ బరరాజు నొకనిఁ బ్రోత్సాహపఱచెదనని కోపారుణితలోచనుండై యవనదేశమున కేగుచున్నాఁడోయన రవి పడమటిసముద్రమునఁ గ్రుంకుచుండెను. అట్టి సంధ్యాకాలమందు యమునానదికిఁ గొంచెముదూరములోనున్న మధురానగరమున కొకమైలుక్రిందుగా నదికొక ఫర్లాంగుయెడములోఁ గొన్ని బండ్లు నడిచిపోవుచుండెను. బండ్లన్నియు నెద్దులుమోయఁగలిగినన్ని సరకు బస్తాలతో నింపఁబడి, వర్షము వచ్చినను దడియకుండుటకై యరచేతిమందములగు పెద్దపెద్దమైనవు గుడ్డలతోఁ గప్పఁబడి త్రాళ్ళచే బిగింపఁబడియుండెను. ప్రతిబండియొక్క పైభాగమునఁ దుపాకులఁ ద్రాళ్ళయందుదోపి నడుమునఁ గట్టుకొని

యున్న బారుకత్తులు క్రిందికి వ్రేలాడుచుండ నిద్దఱిద్దఱుసిపాయిలు పడి యుండిరి. బండ్లవారంద ఱాసాయంకాలమున కుత్తుకనిండఁ ద్రాగిన సారాయిమైకమువలన నొడలుమఱచి తలలువ్రాల్చుకొని పోవనూగు లాడుచు మిట్టపల్లములుగానున్న నేలపై నడచుచుండుటచే బండ్లదరి పడినపుడెల్లఁ దామునుదరిపడిలేచి యెడ్లనదలించుచుఁ దోలుకొనిపోవు చుండిరి. పైభాగమునఁబడియున్న సిపాయిలుసహితము వారితోసమా నమగు నవస్థయందుండుటచే వారును దమకుమెలఁకువగలిగినపు డంత యు బండ్లవారల నదలించుచుండిరి. రౌతు మెత్తనివాఁడైన గుఱ్ఱ మొంటికాలితో నడచుననురీతి వారందఱు నట్టిస్థితియందుండ నెద్దులె ట్లునడచుచుండినదియుఁ జదువరులే యూహింపఁగలరు. బండివాఁడు కోలతో దెబ్బఁదీసినపుడెల్ల రెండుమూఁడడుగులు ముందుకులాగుచు మిట్టవచ్చినవెంటనే యాగిపోవుచుండెను. ఆగి పచ్చికమేతకాసపడి తమ యిష్టమువచ్చినట్లెల్ల లాగికొనిపోవుచుండెను. కావునఁ బండ్లన్నియు సిపాయిలేర్పఱచుకొన్న మార్గముఁదప్పి ఈవలావలఁజెదరి నిలచి యుండెను.

ఆతరుణమునఁ దూర్పుదిక్కున నించుకమబ్బుపట్టి చల్లనివాయు వులు వీవనారంభించెను. మేఘములు క్రమక్రమముగా వృద్ధియగుచు న్నకొలఁది గాలియుమిక్కుటమగుచుండెను. పరోపకారార్థముఘనులు సల్పు కార్యములకు విఘ్నములు సంభవించుచుంట ప్రస్తుతకాలమందుఁ గూడ సహజమైయున్నదిగదా! రానురాను గాలిప్రబలమై మహా సత్వములగు వృక్షముల నల్లలనాడించుచుఁ దనప్రకంపననామమును సార్థకఁ బఱచుకొనుచుండెను. అమితమగు నెండవేడిమివలనఁగాలి యనేకజంతుసంచారములచే ద్రస రేణువులుగమారిన భూభాగమం దలి ధూళియంతయు, ఝంఝానిలవశంబున నేలనంటవ్రాలి యూగు

లాడు తీగెలయొక్క రావిళ్ళమూలమునఁ బైకిలేచి ప్రబలముగుచున్న జలదసంఘమును మఱింతదట్టముఁ జేయుచుండెను. పండినేలరాలి మెండిపోయియున్న యాకులన్నియు గాలిచేఁగొట్టుకొనిపోవునపుడుఁ బుట్టు గలగలయనురొదలును, వెదుర్రుమాకు లొండొంటితోడ నొరసికొని యుఱ్ఱూతలూగుతఱిఁగలుగు కిఱ్ఱుమనురావములును, నతిదీర్ఘములై చువ్వలంబలెమింటినంటఁ బెరిగినవృక్షజాతులఁ జుమ్మనుశబ్దములును, బవనవేగమునకు నిలువంజాలక విఱిగి నేలంగూలు వివిధతరుశాఖా సమూహంబుల ఫెళఫెళారావములును, గాలితాకుడ వలన నత్యున్నతములుగలేచి నురుగులుగట్టఁ దీరములంగొట్టుకొను యమునా తరంగముల యార్భాటములును, యెండవేడిమివలనఁ దాపంబతిశయింపనుమ్మలికనొంది యాకస్మికముగ బొడమినట్టిమేఘములఁగాంచి యాహ్లాదమున గాలిచేఁ బింఛములువిఱియ నాడునెమలుల కేంకారములును, వర్షధారలకాశించి కాచుకొనియున్న చాతకపోతంబుల సంతోషారావములును, గమలాగారసంఘముల స్వచ్ఛందసంచారములసల్పు పరమహంసలమగు మేమువిషధరుండగు వీనింజూడనోపమని మలంగిపోవుచున్న వనమేఘోదయమునకు వెఱచి యమునయందలి శతపత్రంబుల నృత్యంబుఁజాలించి యాకసమునకెగయురాయంచలసందడులును, వనతలంబునెల్లెడలఁ బ్రతిధ్వనులుపుట్టబొబ్బలిడు శార్దూలాదిక్రూరమృగభయంకరధ్వానములును, దమతమనెలవులఁజేరంజను నానావిధపతంగకుల కలకలంబులును, నేకమై యరణ్యమంతయు నల్లకల్లోలమగుచుండెను. ఎవరుగాని తమలోఁదాము కలహించుకొని యైకమత్యవిహీనులై మెలఁగుటచే నట్టివారలెంత బలవంతులైనను దుదకు మొదలంటనాశనమగుదురని లోకమునకంతయు నెఱుకపఱచుచున్న వియోయనఁ గ్రిక్కిరిసి యొండొంటితోడఁ బెనవైచుకఁబోయిన వృక్షజాల

ములుతప్పఁ దక్కిన గొప్పగొప్పమహీరుహములు సహితము వాయువునకులోనై కూకటి వ్రేళ్ళతోఁగూడఁ బెల్లగిలి నేలఁగూలుచుండెను. పరులెంద ఱెన్నిగతుల నాటంకపఱచుచున్నను ఘనులు తాము పూనిన కార్యముల విడనాడకసల్పుచునేయుండి, యవితీరినవెంటనే యత్యుత్సాహమున నెరవేర్చి గెలుపుఁగొందురనురీతి, దుమ్మెగరిపోవునట్లు గాలివీచుచున్న సమయమందే చినుకులునునారంభమై గాలి యడగినతోడనే వర్షమెక్కువగాసాగెను. క్రమక్రమముగ వృద్ధియై సంవర్తకాలఘనాఘనముల చందంబున వాఁగులువాఱఁగురియఁగడఁగెను. మేఘుఁడు ధారాప్రవాహపూర్వకంబుగఁ గాళిందీకన్యకకు మౌక్తికముల సమర్పించుచున్నాఁడోయనఁ బలువిధములగు మల్లెలు జాజులతోడంగూడిన లతావితతులు వాఁగులవెంటఁ గొట్టుకొని పోయియమునయందుఁ జేరుచుండెను. ఆర్యావర్తమునకిఁక ముందురాఁబోవు దుర్దశలందలంచి పంచమహాభూతంబులు జాలింబడికాలువలుగట్టవిలపించుచున్నవియోయనధారలత్యంతములై జోరున వర్షము కురియుచుండెను.

అల్లెగడియలకొలఁది నాకసముచిల్లిపడినట్లుఁ, గడవలతోఁ గ్రుమ్మరించినగతి వానకురియుచుండ హాలారసపాన మత్తులై శరీరము తెఱుఁగక పడియున్న పైసిపాయిలును, బండ్లవారలును నగము తడిసిన పిదపఁ గలిగిన చలివలనఁ దెలివినొంది నలుదిక్కులఁబరికించు నప్పటికిదిశలగుపడనియంత దట్టముగ వర్షముకురియుచుండెను. అందున కాశ్చర్యమగ్నులై బండ్లనొక మహావృక్షముక్రింద నాపియందఱును వానియడుగు భాగమునకుఁ జేరిరి. అనంతరమించుక సేపున కావర్షసంరంభమడఁగి జల్లుపడుచుండ బయటికేతెంచిచూచి తాముదారితప్పి వేరొకచోట నుండుటఁ దెలిసికొనిరి. అందులకొకసిపాయి కోపోద్దీపితుఁడై తనలాఁతికట్టెఁ

జేఁబూనిబండ్లవారినందఱి జావఁదన్న మొదలుపెట్టెను. మఱికొందఱాసిపాయిని శాంతఁబఱచి యావలకుఁ గొంపోయి బండ్లుకట్టుఁడని యాజ్ఞాపింప వారలు "అయ్యా! నేఁడు వర్షముమిక్కుటముగ గురిసినందున నేలయంతయు నానియున్నది. కాన బండ్లు నడువఁజాలవు. మరల రేపునాలుగుగంటలకేఁదప్ప యిప్పుడుకట్టుటకు వలనుపడ" దనివిన్నవించుకొనిరి. అందులకు సిపాయిలును సమ్మతించి నాలుగుగంటలవేళ భోజనములు చేసికొనియే బయలుదేరిరి. కావున నారాత్రి యింతవర్షములో వేరొకచోటికిఁబోవ నేటికని యావృక్షముక్రిందనే మఱునాఁటివరకునుండ నిశ్చయించుకొనిరి. చలి యమితముగ నుండుటచే బండ్లవారలచేఁదడిసిన యెండుకట్టెలఁ దెప్పించి ప్రోవువేయించి తాము వెంటఁగొని తెచ్చినయాముదముబోసిమంటఁజేసిరి. ఆముదపుఁబ్రభావమున నాకట్టె లెగాదిగ మండుచుండ నందఱును దానిచుట్టుఁజేరి చలికాచుకొనసాగిరి. కొందఱువర్షముకురియుచుండ బండ్లయడుగునఁ గూరుచున్నపుడు మీఁదఁబడిన మంటిజల్లులఁగడుగుకొన దుస్తులఁదీసి లంగోటీలబిగించుకొని నదికేగ బయలువెడలిరి.



# రెండవ ప్రకరణము.

కొంతవడికటు లాసిపాయిలు నదిఁజేరి యందఱు నీదనేర్చియు న్న వారగుటవలనఁ దమయిష్టమువచ్చినట్లు నీళ్ళలోఁజెర్లాటమాడుకొ నసాగిరి. నాఁడుకృష్ణపక్ష పాడ్యమియగుటయునప్పటికి చంద్రమండల ము బాగుగప్రకాశింపుచు నెక్కివచ్చుచుండెను. వానసంపూర్ణముగ వెలిసి ధూళిలేక నిర్మలమైన వాయువులు వీచుచుండెను. నదీతీరమంత యు ఘోరమను గప్పలరొదలతోనిండియుండెను. ఇవి కాక క్రిమికీటక ములు కీచుమని శబ్దించుచుండెను. ఆకసమునందేభాగమునను నించుకై న మబ్బులేక ప్రకాశమానమై వెన్నెలకాయుచుండ నాసిపాయిలునది యందొండొరులపై నీరములఁజిమ్ముకొనుచుఁ గొట్టుకొనివచ్చుఁదుంగలు మొదలగువాని నెక్కనవెచుచు నింకను ననేకగతులవర్తించుచుండిరి. నీటఁబడివచ్చువానిఁ బట్టుకొనిబయటఁ బారవేయుచున్నతరి నొకనిచేతి కి వెంట్రుకలుదగులఁ జప్పుననుల్కిపడి మరలధైర్యముఁ దెచ్చుకొని ప రికింప మనుష్యునితల స్పష్టముగఁగన్పించెను. వాఁడును దానిఁబట్టుకొ ని యీడ్చుకొనివచ్చి తీరమునవైచియాసంగతిఁదక్కినవారల కెఱుకఁబ ఱుపనందఱు పరువెత్తుకొనివచ్చి యాశరీరముచుట్టుఁజేరి పరీక్షింపసాగిరి. అత్తరినీక్రిందిసంభాషణ ప్రారంభమయ్యెను.

ఒక మహమ్మదీయుఁడు.—అరె ! ఎవఁడురా వీఁడు? కాఫరువలె నున్నాఁడు.

ఇంకొకఁడు.—ఎవండైననేమి ? బ్రతికియున్నాడా?

మఱియొకఁడు.—ఏమో !

వేరొకఁడు.—నీకెక్కడ దొరకినాఁడు?

శరీరమును దెచ్చినవాఁడు.—అల్లదే! యావైపునఁ గొట్టుకొనిపోవు

చుండ మొదటచూచి నుండబొచ్చెయని పట్టుకొనఁబోవ వెం

ట్రుకలు చేతికిఁ దగిలినవి. తరువాతఁ దిన్నగఁబరిశీలింపమనిసి.

ఆసమయమున వేరొకఁడు శరీరమును సమీపించిపొట్టపైఁ గాలుపెట్టిద్రొక్క లోపలనున్న నీళ్లన్నియు రంధ్రములద్వారా జిమ్మనగొట్టములనుండి వచ్చునట్లు బయటికి తెంచెను. అంతఁగొంద ఱాకాయమును జలిగాచుకొనుచున్న నెగడినద్దకుఁగొంపోయి ప్రక్కనఁబరుండఁ బెట్టి తమశరీరములఁదుడిచికొని క్రొత్తవస్త్రులఁ దాల్చియందఱును దానిఁజూచుచుఁ జుట్టుఁ గూరుచుండియుండిరి. కొంతవడికా శరీరముకదలెను. దానింగాంచి యొకఁడు ,,అరేవీనిదెంత మొండిప్రాణము? ముండవాడింతనదిలోఁ బడికొట్టుకొనివచ్చియు బ్రతికినాఁడే.,,

అత్తరి నీసమూహమునకుఁ గొంచెము దూరమునందుండిన మఱియొకఁడు దగ్గఱకువచ్చి ,,ఏమి! ప్రాణమున్నదా?' యనియడుగనున్నదనివచించిరి. అంతనాసిపాయి

,,అట్లయినమరల నెత్తుఁడు. నీటఁబారవైచివత్తము." ,,చీ! దుర్మార్గుఁడా! ప్రాణినిఁగాపాడిన నెట్టిమోక్షసుఖములు కల్గునో తెలియవా?" అనితక్కినవారు వచించిరి. అప్పుడువారందఱకు నాయకుఁడుగానున్న వానికిని నాతురకకును ఈ క్రిందిసంభాషణజరిగెను.

సిపాయి.—ఇప్పుడెట్టిసౌఖ్యముకలిగినను,నీవార్తసుల్తానుగారికి తెలిసిన పిదప గలుగు సౌఖ్యము తరువాతనే!

నాయకు.—ఈసంగతి సుల్తానుగారికేల తెలియవలయు?

సిపా.—దొంగతనము దాగియుండునని తలఁచెదవా?

నాయ.—ఏడిచినావులే! సేనాపతికూడనామాట జవదాటఁడు. ఈ వార్తసుల్తానుగారి కేఱుకఁబఱపవలదంటే తెలుపనే తెలుపఁడు, ఇఁక నీవంటివారలుండినసరి.

సిపా.—నాఁబోటివారల మాటనటుండనిమ్ము. సుల్తానుగారి యాజ్ఞల

బాలింతువా? లేదా? కాఫర్ కంటఁబడినట్లైనఁ దత్క్షణము వాని జంపివేయుమనికదా వారియుత్తరువు.

నాయ.—నీయధిక ప్రసంగముఁ జాలించియావలకుపో!

సిపా.—సరియే. సమయమువచ్చినపుడు మాత్రము నేనుసహాయమునకు వచ్చువాఁడనుగాను.

నాయ.—పోరా! నీలాటిదివానాలు సహాయ మొనరించిన నెంత! యొనరింపకున్న నెంత!

అనవాఁడావలకు వెడలిపోయెను. కొంతసేపటికి నీటదొరకిన వాఁడు కనులుదెఱచిచట్టుపట్లనున్న వారినవలోకించుచు బొట్టఁజూపించి సైగఁజేయనదివారు గ్రహించి తమదగ్గరనున్న గోదుమపిండినిఁ దెచ్చి యానెగడిమీఁదనే జావగాఁగాచి వేడివేడి జావవానినోటఁ బోయ మ్రింగసాగెను. అట్లు వాఁడువలదనునంతవఱకుఁ బోసిపిదప గిన్నె నావల నిడి యొండొరులతోఁ ముచ్చటించుకొనుచుఁ గూరుచుండియుండిరి. జావకడుపులోఁబడిన కొంతసేపటికిశక్తివచ్చి యామనుజుఁడు బాగుగఁ గనులఁదెఱచి చెంతనున్న సిపాయిలఁగాంచి భయంపడసాగెను. అందులకు వారుభయపడవలదనివానితోఁజెప్పి నీవెవఁడవనియడిగిరి. అందుపై వాఁడదివఱకు దప్పించుకొని వచ్చినసిపాయిల వేషములును వీరి వేషములును నొకటిగఁగాన్పించినందున వారు వీరొకటియేయనితలఁచి తననిజవృత్తాంతము వెలిబఱచినచోఁ దనకిక్కడనే మృతికలుగునని యీ క్రిందిరీతిగఁ దనసంగతి వచింపసాగెను.

"అయ్యా! నేనుమధురానగరమున నొకగొల్లకాపరిని. నది యెండిపోయియుండు కాలమున దానిదాటి యావలిగట్టున ననుదినము నామందను మేపుకొనుచుందును. ఈదినమునను నట్లేగొల్లలఁదోలుకొనిపోయితిని. సాయంకాలమగు నప్పటికి మబ్బుపట్టి చినుకు

లారంభమయ్యెను. పెద్దవర్షము కాకమును పే కొంపఁజేరుకొనుట మంచిదని మందను నదిలోగుండ నడిపించుకొనుచు నింటికేగుచుంటిని. అత్తరిఁబ్రవాహమునకు నిలువలేక రెండుమూఁడుగొఱ్ఱెపిల్లలు నీటఁబడి కొట్టుకొనిపోవుచుండ వానిఁదక్కించుకొన నేనును నీటదుమికి యీదుకొనిపోవుచుండ నదివగకారంభించిన చినుకులు మిక్కుటమై యాకస్మికముగఁ బెద్దవర్షముకురిసెను. చీకటులును గ్రమ్మెను. ఆచీకటియందు గొఱ్ఱెలఁగన్గొనలేక విసిగి తుదకు తీరమునకీదసాగితిని. ఎంత యీదినను గార్యము లేకపోయెను. క్రమక్రమముగఁ బ్రవాహమధికమై నన్ను వెనుకకేనెట్టివేయుచుండెను. కొంత సేపటికినాయవయవములన్నియు బలహీనములైనందునఁ గదలింపఁజాలక మిన్నకుండవలసినవాఁడనైతిని. అనంతరమేమైనదియు నాకుఁదెలియదు. మరలఁ దెలివిగలిగి చూచునప్పటికి మీారగుపించితిరి. మీారలే నాప్రాణదాతలని తలఁచెదను,,.

అనివచించి తన యాలుబిడ్డలఁ దలఁపునకుఁ దెచ్చికొని కపటదుఃఖము నభినయింపసాగెను. అదిచూచియొకసిపాయి ,,అరే!దివానా! ఇంచుకసేపుక్రింద మేముపైకిఁదీయకపోయియుండిననీపాటికిమృతినొందియుందువే. అప్పుడీ భార్యాపుత్రులేమగుదురో!,, యనియడిగెను. అంతవాఁడు మరల ,,అయ్యా! బ్రతికియుండగనేకదా! యీచింతలన్నియు,'' ననిపల్కెను. అప్పుడింకొకఁడు ముందఱికివచ్చి తక్కినవారితో ,,అరే! వీఁడుగొఱ్ఱెలకాపరికదా! వీని నెట్లైన లోఁబఱచికొనియుంచుకొంటిమా మాంసము దొరకక చచ్చిపోవుచున్న మనకీదేశమునఁ గావలసినంత పలలము పుష్కలముగ లభింపఁగలదు,,. అన నందఱు నియ్యకొని గొఱ్ఱెలకాపరితో నిట్లుమాటలాడసాగిరి.

సిపా.—అరే! నీవుమావద్దనుండి రోజుకు మాకుఁగావలసినన్ని మేకలఁ దెచ్చియిచ్చెదవా?

కాపరి.—మీకుగొఱ్ఱెలతో నేమిపని? పాలకొఱకేకదా?

సిపా.—పాలెవరికిఁగావలయును? వాని మాంసముకొఱకు దినమున కిరువదినుప్పది గొఱ్ఱెలనిచ్చితివా యొక్కొక్కదానికి నాలుగైదు వరహాలవంతున నిచ్చెదము.

సిపాయిలట్లు వచించినవెంటనే జీవహింసయనినఁ గంటగించుకొనునట్టి యాయుత్తమబ్రాహ్మణుఁడు చింతాక్రాంతుఁడై "హా! పవిత్రవంతమగు నార్యావర్తమునకెంత గతిపట్టినది. ఇదివరకు జరుగుచున్న వామమార్గులయల్లరులకే పడలేకయుండ నిప్పుడీదుష్టులుఁగూడ ప్రాప్తించినారు. హా! నోరులేని మృగములఖండించి వాని పలలమునావీరలు దినఁగోరుట! ఇంతకన్నఁ దమగోఁగొండఱి నధించియేల భక్షించరాదు? ఇప్పుడు వీరివాక్యములకు సమ్మతింపకున్న నన్నిక్కడనే కడఁదేర్తురు. దైవమా! ఈకఠినాత్ముల హృదయముల వజ్రములతో నిర్మించితివా ఏమి? లేకున్న వీరలకిట్టి దుర్వాంఛయేలపొడమును? పూజనీయంబగునో యార్యావర్తమతల్లి! నీకైననువీరలపైఁ గినుకజనింపదా? సాధువులగుఁ బశువులు నీయెడఁగావించిన యపకారమింతైనఁ గలదా? ఒక్కపర్యాయముగ నీదుష్టులందఱిని నేలమ్రింగివేయవు?" అనియింతసేపు విచారించియప్పటి కల్లేయనిసిపాయిలతో నొప్పుకొనెను. అంత రాత్రి విస్తారము ప్రొద్దుపోవుటవలన శయనింపఁదలఁచి వారలువృక్షముక్రింద మైనపుగుడ్డలఁబఱపించి వానిపైఁబ్రక్కలవేయించి కాపరినినడుమఁబరుండఁబెట్టుకొని తాముచుట్టుఁబరుండి నిదురపోయిరి.

# మూఁడవ ప్రకరణము.



మధురా నగరమునకుఁ దూరుపుదిక్కున నాలుగైదుమైళ్లదూరములో నొక చిన్నపర్వతముకలదు. దానినెత్తమతివిశాలమై చదరముగ నుండుటవలన భక్తులుకొందఱు పెద్దదేవాలయ మొకదానినిగట్టించి యందుశివలింగమును స్థాపించియుండిరి. ఈగుడిచుట్టు సుమారు పదియడుగులయెత్తుగలిగి యొకమైలుచుట్టుకొలతగల ప్రాకారపుగోడయొకటియుండెను. సింహద్వారముపైఁ బెద్దగాలిగోపురముగలదు. కొండయడుగుననుండి పైవరకును సోపానములు గట్టఁబడి వానికిరుప్రక్కల దేవతాదర్శనార్థమెక్కు భక్తులకెండ తగులకుండునట్లు పలువిధముల గుఁజెట్లుపెంచఁ బడియుండెను. ఈవృక్షములపై నెల్లపుడు గుంపులు గుంపులుగ కోతులునసింపుచు వచ్చుపోవువారిచేతులయందలి వస్తువుల దామె నైవేద్యముఁ గొనుచుండును. మెట్లకు మొదట విఘ్నేశ్వర దేవాలయముకలదు. ఈక్రిందనున్న గుడికిని పైయాలయమునకును నడుమఁ గాళికాశక్తిగుడియొకటియుండెను. ప్రాకారముయొక్క లోపలిభాగమున వరుసగా విఘ్నేశ్వర, కాలభైరవ, వీరభద్ర, కామాక్షీమందిరములునుఁగలవు. ఇవిగాకగోడలకంటనిర్మింపఁబడిన చిన్నచిన్నగదులనేకములు బారులుదీరియుండెను. ఈశివాలయమంతయు ననగా గర్భగుడియంతయు నల్లనిరాళ్లచే నిర్మింపఁబడియున్నది. గర్భగుడియెదుట విశాలమగునొక గొప్పమంటపముగలదు. ఈ పెద్దమంటపమున కిరుపార్శ్వములఁజిన్నచిన్న మంటపములు రెండుకట్టఁబడియున్నవి. ఇందొకటి కళ్యాణమంటపము. పెద్దమంటపములో విగ్రహమున కెదురుగ సాధారణపుమానవుఁడు పరుండఁగలిగినంత విశాలమగుబొజ్జగల పెద్దనందియొకటియుండెను. ఇచటఁబ్రతిసంవత్సరము శివరాత్రినాఁడు గొప్ప

యుత్సవము జరుగుచుండును. ఆదినమున యాత్రాపరులు వేనవేలుగఁ జనుదెంచి స్వామిసేవఁ జేసికొని కానుక లర్పించిపోవుచుందురు. క్రింద నున్న వినాయకుని గుడిప్రక్కఁ దిప్పకంటుకొని కోనేరొకటియుండెను. ఈకోనేరతి యగాధమగులోతుగలదై పైనుండి నీటిమట్టమువరకును మెట్లనొప్పియున్నది. ఇందలినీటికిఁగ్రిమమగు వాడుక లేని కారణమునను, దగినంత సూర్యరశ్మితగులని హేతువునను బచ్చపడి యొకవిధమగు దుర్గంధమును వెలువరించుచుండును. అచ్చట ననారతము సేవఁజేయు చుండు భక్తులగు నర్చకులుకొందఱు ఆలింగమాగ స్త్యమహాముని స్థాపించినదనియు, నాపుష్కరిణి దేవనిర్మితమనియు, నందులోని నీరుదక్క వేరొండభిషే కార్థము శివుఁడంగీకరింపఁ డనియువచింపుచు నుత్సవమునకు వచ్చినయాత్రాపరులనందఱి నాపాడునీటయందే ముంచుచుందురు. మఱియు నాపుష్కరిణియందు మునిఁగిపోయిన గాశీవిశ్వేశ్వరుని గుడియందుఁ దేలుదురని ప్రతీతియొకటిగలదుగాని యటులొనర్చినవాఁడు మాత్రమొకఁడును గానరాఁడు. కన్యాకుబ్జమునుండి ఢిల్లికిఁ బోవు రాదారీకొండప్రక్కగాఁ బోవును. శివరాత్రినాఁడు మాత్రమేగాక యితరసమయ ములందును నాబాటనుఁబోవఁ దటస్థించిన భక్తులెల్లరుగుడికేగి స్వామిదర్శనముఁజేసికొని పోవుచుందురు. ఇంతప్రఖ్యాతివడసి మహోన్నతస్థితియందుండిన యీక్షేత్రము మనచరిత్ర ప్రారంభమగునాఁటికి సంపూర్ణముగ శిథిలమైయుండెను. పదునొకండవ శతాబ్దారంభమున గజనిమహమ్మదు మధురా పట్టణముపై దండెత్తివచ్చి నప్పుడికొండనెక్కి విగ్రహములనన్నిఁటిని ధ్వంసముచేసి మితిలేనిద్రవ్యమును గొనిపోయెను. నాఁటినుండియు నచటిమహత్వము చెడినందునఁ దైర్థికు లచటికేగుటమాని వేసిరి, కానితమదౌర్బల్యము జనకుండని జాలిబూని మూషికవ్రజము మాత్రము శివలింగముమంచి

స్థితియందుండునపుడు భక్తులనేకులువచ్చి యుపచారములు సలుపుచుం దురు గద్దాయని కొంచెము శ్రద్ధఁజేయుచు వచ్చినను భక్తుఁడొక్కఁడైనరాని యిట్టిదీనస్థితియందుఁ దామువూత్రము వదలక దమ జాతివార లనింకనునసేకులఁగూర్చుకొని యభిషేకార్ఘ్యపాద్య నైవేద్యాదిక్రియ లఁగ్రమముగనొనర్చుచునేయుండెను. మఱియుగుడ్లగూబలుమొదలగుఁ బక్షులును దమశక్త్యానుసారముగ నుడుతబత్తిఁజేయుచుండెను. గాలి గోపురము సగముకూలి దివాంధములకును గొండచిలువలకును నావా సమై వానియారావములతో నిండియుండెను. ప్రాకారపు గోడలన్ని యు నెక్కడినక్కడకూలి నేలతోఁజదరమగుచుండెను. గుడివెలుపటి భాగమున ననగాఁబ్రాకారపులోపలిభాగమున నున్నగుళ్ళన్నియుఁ బసు లకాపరులజంతువులు వైచినపెంటలతో రోతగలుగఁజేయుచుండెను. కొండంతయు నిట్లుపాడుపడియున్నను మధ్యనున్న కాళికాలయముమా త్రము శక్తిపూజాధురంధరులగు వామమార్గమతస్థులవలన జాగరూక తతోడఁ గాపాడఁబడుచుండెను. గజనీచే మొండిగఁజేయఁబడిన దేవీవిగ్ర హామునకు వెండికన్నులు మొదలగునవి యలంకరించి శిథిలములైన గోడలబాగుపఱచికొని ద్వారమొకదాని నేర్పఱచికొని యందుఁ దమ పూజలయథావిధిగఁ జేసికొనుచుండిరి. మఱియుఁగొండపైనున్న సగ మువడిపోయిన గదులకుఁ బాషండులగుబైరాగులు కొందఱప్పుడప్పు డు దర్శనమిచ్చుచుందురు. కొండదరికేగిన గంజాయియొక్కయు గబ్బి లపుఁబెంటలయొక్కయు మురికికంపు తక్క వేరొండుశుభ్రమగువాయువు లేనికారణమున సజ్జనులగువారలచటికేగుట మానివేసిరి. అట్టియాపా డుపడిన మెట్లమీఁదుగ నొకనాఁటిసాయంకాల మాఱుఘంటలవేళ బా టసారియొకండు కొండపై కేగియచటి స్థలమంతయుఁ గూరుచుండుట కుఁ గూడఁదగనిదిగనున్నందున మరల గ్రిందికిదిగివచ్చుచు గొళ్లెము

తగిలింపఁబడియున్న కాళికాలయముఁగాంచి తలుపు దెఱచికొని లోని కేగి పైనఁ దాను జూచినదానికంటె నక్కడబాగుగనున్నందున నారాత్రినచటనే గడుపనిశ్చయించుకొని గుడియవతలివైపునకుఁబోయి యక్కడివసారాలోఁ బైగుడ్డఁబఱచికొని పరుండినిదురపోయెను. నాఁటి దిన మమవసయగుటఁ గొంతసేపునకు దిక్కులు దెలియరాక మిట్టపల్లము లేకములగునట్లు గాఢాంధకారము గ్రమ్ముకొనెను. అర్ధరాత్రమగునప్పటికినాకటికి చీఁకటియందుఁ గొందఱు స్త్రీపురుషులు చేతులయందుఁ గాగడాల వెలిగించుకొనివచ్చి కొండనెక్కి కాళికాలయముఁ బ్రవేశింపఁదొడఁగిరి. కొందఱు మద్యభాండముల మోసికొనివచ్చుచుండిరి. మఱికొందఱు బలిసినగొఱ్ఱెల వెంటఁగొనివచ్చుచుండిరి. వీరందఱు గుడిలోఁబ్రవేశించుతఱిఁ గలిగినరొదలకు వెనుకవైపుననున్న బాటసారి మేల్కొని లేచి యవతలిగుండఁ బారిపోవఁబ్రయత్నించెఁగాని యాప్రక్క ద్వారము లేక గోడలెత్తుగనుండెను. అంతనే మైనఁగానిమ్మని గుండెరాయిఁ జేసికొని మరల నెప్పటిచోటికివచ్చి నఖశిఖపర్యంతము ముసుఁగిడుకొని కదలక పరుండియుండెను. నుతస్థులును గుడికిఁ బ్రదక్షిణ మొనర్పసాగిరి. కాగడాలఁ బట్టుకొనికొందఱుముందు వెనుకలనడచిరా నోట వచింపరాని బూతుపాటలఁబాడుచుఁ బ్రదక్షిణము సేయఁదొడఁగిరి. అట్లువారందఱాలయము వెనుక కేగి యట భీతిచేఁ గపటనిద్రాభిరతుఁడైయున్న బాటసారింగాంచి యతనిచుట్టుఁజేరి నాల్గుతన్నులతో లేపి కూరుచుండఁబెట్టి "నీవెవఁడ" వనియడుగ నతఁడింతమంది నడుమనొంటిఁజిక్కితిఁగదాయని యేమియుఁ దోచక మాట్లాడక యూరకుండెను. అప్పుడు వారందఱిలోఁ బెద్దయగుఁ బురోహితుఁడు ముందుకేతెంచి "సీఁడతిదుర్మార్గుఁడు. మనరహస్యంబులఁ బరీక్షింపనిచటికి వచ్చియున్నాఁడు. వీని నిపుడుకాళికి సమర్పింపవలయు" ననెను. అందు

మీఁద నలుగురు వానినివిఱిచికట్టి తముకోఁగూడఁ బ్రదక్షిణముసేయిం చికొనివచ్చి దేవియెదుట నిలువఁబెట్టితమవిధ్యుక్తక్రియలనొనరింప మొదలిడిరి. విగ్రహమునకెదుటఁ బదిమండలములురచించి వానియందుఁ దాము వెంటఁగొనితెచ్చిన మద్యభాండములనుంచి గొరియెలఖండింప నారంభించిరి ప్రాణిహింసయనినఁ గంపమందు నాపాంథుఁడా దారుణ కృత్యములఁ జూడఁజాలక మూర్ఛనొంది పడిపోయెను. తోడనేకొంద ఱాతని మొగముపైఁజన్నీళ్లుపోసి మూర్ఛఁదేర్చుచుండిరి. తక్కినవారు దెచ్చినజంతువులనన్నింటిఁ దెగటార్చివానికళేబరముల భాండములప్రక్కనుంచి యీక్రిందిమంత్రముల నుచ్చరించుచుఁ బూజసేయఁగడఁగిరి.

"బ్రహ్మశాపంవిమోచథా"

అనఁగా ఓమద్యమా! నీవుబ్రహ్మమొదలగు వారిశాపముల నుండి కూడరహితమవై యున్నావు. మఱియు,

"మద్యం మాంసంచ మీనంచ ముద్రా మైథునమేవచ, ఏతే పంచమకారాః స్యుర్మోక్షదాహి యుగేయుగే." కాళీతంత్ర గ్రంథము.

"ప్రవృత్తే భైరవీచక్రే సర్వేవర్ణా ద్విజాతయః,
నివృత్తే భైరవీచక్రే సర్వేవర్ణాః పృథక్ పృథక్."

కులార్ణవతంత్ర గ్రంథము.

"పీత్వా పీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే,
పునరుద్ధాయ వైపీత్వా పునర్జన్మ నవిద్యతే.

మహానిర్వాణతంత్ర గ్రంథము.

"మాతృయోనిం పరిత్యజ్య విహరేత్ సర్వయోనిషు,
వేదశాస్త్రపురాణాని సామాన్యగణికా ఇవా."

జ్ఞానసంకలినీతంత్ర గ్రంథము.

"న మాంసభక్షణే దోషోనమద్యేనచ మైథునే,

ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలః,,

మను, అధ్యా 6

„సౌత్రామణ్యాం సురాంపిబేత్ ప్రోక్షితం,
భక్షయేన్మాంసం వైదికీహింసాహింసానభవతి,,

మను, అధ్యా 5

„ఏకైవశాంభవీముద్రా గుప్తాకులవధూరివ,,
„పాశబద్ధోభవేజ్జీవః పాశముక్తస్సదాశివః.,,

జ్ఞానసంకలినీతంత్ర గ్రంథము.

జారగ్రామణులును, స్వార్థపరాయణులును, సత్యవిద్యావిహీనులునగు దుష్టులు రచించిన తంత్రగ్రంథములలోని యిట్టిమంత్ర నామకతుచ్ఛ శ్లోకములఁబఠించుచు శాంభవీ, భైరవీ, కాళీ, చాముండా! యనునామంబు లుచ్చరించుచుఁ బూజసేయుచుండిరి. అంతవరకును మూర్ఛఁదేరి, యాక్రూరకర్మలఁజూచుచున్న పాంథుఁడు తనమనమున నిట్లు తలపోయఁగడఁగెను.

„అయ్యో! ఇల్లువెడలినదాది నాకన్నియుఁ గష్టములే ప్రాప్తించుచున్నవిగదా! నేటితోనిక్కడ నాచావునిశ్చయము. నాగతియెట్లయినఁగానిమ్ము. నాకొఱకై దినములు లెక్కపెట్టుకొనుచు నిరీక్షించుచుండు నాకన్యకగతియేమికాఁగలదు? ఆహా! ఈదుర్మార్గుల హృదయములందావంతైనఁ గరుణయనునది లేదుకాఁబోలు? వీరలనెట్టి పాపకర్మలనఁదగును. ఇట్టిస్వార్థపరులగు కుమార్గగాములు ప్రబలియుండ నిఁక నార్యావర్తము బాగుపడు టెట్లు? కట్టా! దుర్మార్గులారా! మీకీవిధి యంతయు నెవరుబోధించిరి? పాషండులారా! మద్యమాంసములనా

---

పైశ్లోకములు స్వామి దయానంద సరస్వతివిరచితమగు సత్యార్థప్రకాశమునుండి కైకొనఁబడినవి.

మీరు పూజించునది? హా! నేనేమి సేయుదు! ఓ రాజపుత్రీ! నీకోరిక నె
రవేర్పఁజాలనైతినని నన్ను నిందించెదవుసుమీ? విధివశంబున బెట్టిదము
లగు చిక్కులంబడితిఁగాని నాయజాగరూకతవలనఁగాదు. పరమేశ్వరా!
నీకించుకైన సజ్జనులగు వారిపైదయగలుగదా?,, అని కడువిలపించితన
కష్టమటజరుగుచున్న యసహ్యపుఁబనులఁగాంచి కనులుభైరవులు గ్ర
మ్మ నరలఁగ్రిందఁబడిపోయెను. అంతవానికి మరలఁ గొందఱుపచార
ములు సలుపసాగిరి. ఇంతవరకు జరిగినసంగతులన్నియుఁజూచుచు వా
మమార్గులంగలసి మూలఁగూరుచుండియున్న పురుషుఁడొకఁడు తనకా
ర్యము నెరవేర్చుకొనమంచిసమయము దొరకెఁగదాయని యున్నట్టు
లుండియూగులాడసాగెను. చేతనున్న కొందతేమల్లాగెదవనియడుగ
మూరువల్కక మఱింతతలఁద్రిప్పుచు నాపాదమస్తకముగడగడవడకింపు
చుఁ బండ్లుపటపటఁగొఱుకుచుఁ గన్నులెఱ్ఱఁజేసిచూడ మొదలుపెట్టె
ను. దానిఁగాంచి యందఱువానిచుట్టుఁజేరి దేహమున్స్పృశించి యేమని
యడుగ వారిఁజావమోదుచు ,,అరే! దుర్మార్గులారా! మీరునన్నెఱుఁ
గరా,,? యనిగద్దించిపల్కెను. అంతనెల్లరుఁగాళికాదేవి పూనినదని
నిశ్చయించి సాంబ్రాణి గుగ్గిలపు ధూపములువేయుచు వానిపాదము
లపైఁబడిమ్రొక్కి "అమ్మా! దేవి! శాంతింపుము. మావల్లయేమపరా
ధమువచ్చినదో చెప్పు" మనిబద్ధాంజలులై ప్రార్థింపనాధూర్తుండు "ఛీ!
మూర్ఖులారా! మీకావంతైనజ్ఞానము లేదు. నీచజాతిసంభవుఁడగు మా
నవునొకని నాకుబలినొసంగఁదలచియున్నారు. మిమ్మందఱిభక్షించెద.
చూడుఁ" డని భయంకరముగ హుంకరించుచుఁబలికిన 'అమ్మా! భగవ
తీ! శాంతింపుము. ఎఱుకలేనితనమున నిట్టికార్యము సేయఁబూనుకొంటి
మి. క్షమించినీయభీష్టమేమో తెలిపిన నెరవేర్చెద" మనిరి. అంతనాపు
రుషుండు "బుద్ధిహీనులారా! నాకు సకలకళావతియు, సౌందర్యవతి

యునగు రాకొమారికం దెచ్చి సమర్పించితిరా సరి. లేకున్న మిమ్మందఱ నాశనముగావించెద" ననిపల్కెను. దాని కెల్లరు సమ్మతించి "తల్లీ! నీయిష్టానుసారమటులే సమర్పించెద" మనియొప్పుకొని సాష్టాంగనమస్కారములాచరించిరి. కొంతసేపైన తరువాత నాశినకు త్తినవానికిఁ గుత్తుకబంటి గంగల్లుఁ బోసి యొకచోఁ బరుండఁబెట్టి తామును ద్రావసాగిరి. కొందఱు శాటసారి కడకేతెంచి కట్లువిప్పి "నేఁడు నీవు మాదేవీప్రసాదమువలన బ్రతికిపోతివి పొ,, మ్మనిబయటికి గెంట నతఁడును బులినోటఁజిక్కి చావక బయటఁబడిన మేకవలె లోలోన సంతసించుచుఁ బురిదారిఁబట్టిపోయెను. ఇటగుడియందలి దుష్టులెల్లరుఁ దెల్లవారునప్పటికి తమకార్యములన్నింటి నెరవేర్చికొని దేవీవాంఛితమునకు నేరాజకన్యక తగియుండునాయని యాలోచించుకొనుచుఁ దమదారిం బోయిరి.

# నాల్గవ ప్రకరణము.

అనేకసంవత్సరములకుఁబూర్వ మార్యచక్రవర్తియగు యుధిష్ఠిరుని కాలమున నిర్మింపఁబడి యింద్రప్రస్థమను ప్రసిద్ధనామంబునఁ బ్రఖ్యాతిఁ గాంచి యేడెనిమిదివందల సంవత్సరములక్రిందటివరకు నార్యచక్రవర్తుల స్వాధీనమందేయుండి తదనంతరము మ్లేచ్ఛసుల్తానులపాలఁబడిన ఢిల్లీనగరముఁగూర్చి మీరందఱువినియే యుందురు. మహోన్నతములగు సౌధప్రాకారసంచయములచేతను, నతివిశాలమనోహరములగు నుద్యానవనవాటికలచేతను, వినుతికెక్కి క్రీస్తుశకము పదునెనిమిదవశతాబ్దాంతమువఱకుఁ జక్రవర్తులకే వాసభూమియగుచువచ్చిన ఢిల్లీనిఁగూర్చి వేరుగవచింపనేల? ఈనగరముయొక్క దక్షిణదిశనుండి మధురాపురమునకొక గొప్పరాదారిబాటనిర్మింపఁబడియున్నది. ఈదారిపట్టణము వెలుపట మూఁడుమైళ్లదూరమున ఢిల్లీనిఁజుట్టుకొనివచ్చు యమునతోఁగలసికొంతదూరమువరకు నదీతీరముననే పోవుచుండును. ఈత్రోవ ప్రయాణీకులు పథశ్రమంబార్చుకొనుటకై పెంచఁబడిన వృక్షములచేఁగాక, పురము వెలుపట అడవిలో వేయఁబడియుండుటవలన, నానావృక్షలతాగుల్మములచేఁ బరివృతమైయుండెను. అట్టియాచిన్నయడవిమార్గముగుండ నొకనాఁటి మిట్టమధ్యాహ్నకాలమందు మనుజుఁడొకఁడు కాషాయపురంగుగల పొడుగుపాటి యంగరఖానుధరించి, యట్టివర్ణమేగలపాగ నొకదానిఁ దలఁజుట్టుకొని కమండలువు మొదలగు వస్తువులు గలిగినయడప మొకటి భుజముపై వ్రేలాడుచుండఁ జేతిలోని దండమును ద్రిప్పుకొనుచు దీర్ఘాలోచనపరుండై వచ్చుచుండెను. ఇతనికిసుమారు నలువది వత్సరములుండును. ముప్పదియేండ్లువచ్చునప్పటికే ముసలితనమువహించి మూలఁగూరుచుండ నలవాటుగల దుర్బలులగు కొందఱిఁబలెఁగాక యీమనుజుఁడు మంచి

పిక్కబలిమిగలిగియుండెను. అతని మొగముఁజూడ ననేకకష్టముల ననుభవించి వానినుండి తప్పించుకొనివచ్చినట్లును, నొకకార్యభారము నుదలధరించి యహోరాత్రములు దత్సాధనమునిమిత్తము పాటుబడుచున్నట్లులును దోఁపకమానదు. మిటమిటలాడుచుండు వేసవికాలమునందు దీర్ఘప్రయాణము సేయుచువచ్చిన యాపాంథుఁడు చల్లనినీడలచేఁ బ్రాణము లేచివచ్చినట్లులున్న యా యడవిమార్గమున నొకపెద్దవృక్షపునీడఁ గొంతతడవువిశ్రమింపఁదలఁచి చేతియందలిదండమును, భుజముమీఁదినంచిని క్రిందనొక చోటఁబెట్టి యుస్సుమని నిట్టూర్పులవిడుచుచుఁ దొడిగికొనిన చొక్కాయంతయుఁదడిసి వీఁపునకంటుకొని పోవఁబట్టిన చెమటచిదరవలన దానిఁదీసి యెదుటనున్న చిన్నచెట్ల కొమ్మలకుఁదగిలించి చెమటనార్చుకొనుచుఁ బచారుసేయుచుండెను. అట్టిసమయమున నక్కడకుఁబిలుపుమేర దూరములోనున్న యొకచిన్నగుట్టయడుగుభాగమున మనుష్యులు మాటలాడుచున్నట్లు వినరా నింతవఱకు నానిర్జనప్రదేశమందుఁదానుతప్ప యితరులెవ్వరు లేరని తలఁచుచుండిన యాబాటసారిమనుష్యుల యలికిడివిన్నతోడనే శీఘ్రముగఁ దనవేషమును ధరించుకొని మెల్లననాదిప్పనుజుట్టిపోవ మొదలిడెను. నలుదిక్కుల నతిశ్రద్ధమైతిలకించుచునడచి యవతలి కేగిచూడ నటనొకమానవుఁడైనను గన్పింపకపోయెను. అందులకాశ్చర్యమందుచు గుట్టపైకిబోయి నాల్గుమూలలఁబరికించియుఁ గార్యముఁగానక మరలనాశబ్దమేంచిన స్థలమునకు వచ్చి ప్రతిపాదయందునుఁ బరిశీలింపగాఁ దట్టముగఁదీగెలచే నల్లుకొనియున్నయొక లతాగృహమునఁ దలుపొకటి క్రిందఁబరుండఁబెట్టియుండుటఁగాంచి దానిఁబరీక్షింప లోనికేగి తలుపుఁబైకెత్తనెక్కుడిగుట కనుకూలముగానుండునట్లు త్రవ్వఁబడిన మెట్లఁగూడుకొనియున్న గుహ కానిపించెను. దానిఁజూచినతోడనే విస్మయముకలిగి మెట్లదిగికొంచెము

దూరముపోవ గుహావిశాలమైకనుపడెను. అత్తరిమనస్సున కించుకభయముదోప మరలి గుహాద్వారముకడకువచ్చి యిట్లాలోచింపఁ గడఁగెను "ఆహా! ఇదియేమిచిత్రము? మానవులుతఱచుగ సంచరింపని యీరహస్యపుఁజోటనిట్టిసొరంగముంచుట కేమి కారణము? అడవిజంతువుల యావాసమనుకొందునా! అటులెన్నటికిఁగాఁజాలదు. రహస్యాలోచనములొనరించుకొనవచ్చి పోవువారి కేవిధమైనయాటంకములుఁ గలుగకుండునట్లుచమత్కారముగనిర్మింపఁబడియున్నది. విచారింపనిది రాజశాసనంబులకువెఱచి తమదుష్కార్యముల బహిరంగముగ సలుపుకొనవలనులేక రహస్యముగఁగావించుకొనుటకై కట్టుకొన్న తుచ్ఛులగు వామమార్గులకృత్యమైనఁగావలయును. కానియెడల చక్రవర్తిని రాజ్యభ్రష్టునిఁజేయఁ గుట్రలఁబన్నుచున్న యెయధికారుని కృత్రిమమైనఁగావలయును. ఎటులైన దీనినిజముఁగనుగొనకతప్పదు. ఛీ! బయలుదేరినవాఁడనట్లేపోవక వెనుకకేల మరలితి? చేతనొక చిన్నకత్తియైన లేనిసమయమునఁదప్ప గృహాము వెడలినదాది నిట్టిపిరికితన మెప్పుడుఁబూననైతిఁగదా. కానిమ్ము. మరలఁబ్రవేశించి దీని నిక్కమరసివచ్చెదను.,, అని దృఢనిశ్చయుఁడై పరుల కగపడకుండ లోనబెట్టుకొనియున్న ఖడ్గమునుజేతధరించి పరమేశ్వరునిపై భారమువైచి బాసిగుండ నడచిపోవ నారంభించెను.



# అయిదవ ప్రకరణము.



అట్లా బాటసారి గుహం బ్రవేశించి యెంతదూరంబు నడచినదియు నెఱుంగంజాలముగాని గడియయగునప్పటి కవతలిమెట్లు కాలుందగిలెను. వానిమీందుగ నెక్కివచ్చి యొకయుద్యానవన మధ్యమునం దేలెను. అట నేమిం జేయుటకును దోంపక నలుదిక్కులు పాఱంజూచుచు నిలువంబడియుండం జెట్లసందులనుండి దివ్యభవన మొకటి దృగ్గోచరమయ్యెను. కనుపడిన యాసౌధముదగ్గరకుం బోవందలంచి చెట్లమాటున డాగుకొనుచు నిశ్శబ్దముగం గొంతదూరమేగ వాక్యములు వినవచ్చెను. మాటలసవ్వడింబట్టి మఱింతదగ్గరకేగ నటనొక మందిరప్రాంగణమున దీర్ఘకాయుండును, నెఱ్ఱమామిడిపండుంబోలిన మొగముగలవాండును నగుమనుజుండొకండు సందేశముంగొనివచ్చిన నలుగురుభటులతో సంభాషించుచుండెను. ఆమనుజుండు సోఫాపైగూరుచుండియుండెను. భటులుప్రక్క నొదిగినిలిచియుండిరి. సోఫామీందియతండు కొంచెము మించుగ నేబదివర్షములుసూచించుచుండెను. జల్తారుమయమైనపాగను ధరించిబంగారు చెమ్కీపనిచేసిన షేర్వాణీనిదాల్చి రేష్మీపాయిజామాదొడిగి పాదములకు మేజోళ్లంబూనియుండెను. మఱియు దూరముగనున్న హుక్కాగొట్టముద్వారా మాటిమాటికిం బొగంబీల్చిముక్కులవెంట నోటివెంట వదలుచుం దనకెదుటనున్న నలువురు మనుష్యులపైం గోపదృష్టివఱపి గద్దించి పలుకుచుండెను. భటులునల్గురు నల్లనిలాగులం దొడుగుకొని యెఱ్ఱబనారస్‌చొక్కాలందాల్చి పసుపురంగుపాగలనెత్తిధరించి నడుమున కాకుపచ్చరంగుగల కాశలంజుట్టుకొని నయభక్తుల నాపెద్దమనుష్యునితోం దమసమాచారములవిన్నవించుచుండిరి. సోఫాపైంగూరుచున్నమనుజుండు వీరల ధిక్కరించి మాట

లాడుచుండుటఁబట్టి యంతడే ప్రభువని యాబాటసారి గ్రహించిపొంచి యుండి వారిమాటల నాలింపసాగెను అప్పుడాదొర భటులపైఁ గోప దృష్టిఁబఱపుచు "ఛీ! దుర్మార్గులారా! మిమ్మునింతింత కండలుగఁ గోసి కాకులకు వైచినను బాపములేదు! మీకింతస్వతంత్రమా? బుద్ధి హీనులారా! మీకున్న యాలోచన సుల్తానుగారికి లేకుండెను గాఁబోలు. పరుఁడగుపడిన తత్క్షణమే చంపక యింతశ్రద్ధతోఁగాపాడుచున్నను నెట్లోగికురించి తప్పించుకొనిపోయి మనరహస్యముల వెల్లడిసేయునని యేకదాగోరీగారగుపడిన వానినగుపడినప్పుడే చంపవలసినదిగ నాజ్ఞాపించినారు" అనిపల్కెను. అంతులకానలుగురు చేతులజోడించుకొని మొగములపైదీనత్వముదోప "మహాప్రభో! రక్షింపుఁడు. చేతఁజిక్కినవాఁడెందుఁబోవుననుధైర్యముననువానివలనమనకేమైనసహాయముదొరకఁగలదనియు నుపేక్షచేసినారము" అనివిన్నవింప నుగ్రుండై యాదొర "ఛీ! మూర్ఖులారా! నేఁగావించుచున్న పన్నుగడలకన్నిటికి విఘ్నములు సేసితిరి. వాఁడు చావక బ్రదికియేయుండెనా మన కీయార్యావర్తమున నిలుచుటకావంతయు నవకాశముండదు. నేనెన్నిటక్కులఁబన్ని పృథ్వీరాజునొద్ద నేమిసేయుచున్నదియు మీకేమెఱుక? ఆహా! ఎంతపనిఁ గావించితిరిరా దుర్మార్గులారా!' అని దీర్ఘనిశ్వాసమువదలి మిక్కుటముగఁగలిగినకోపమువలన నెడలెఱుంగక చేతనున్న హుక్కాగొట్టము నావలఁబారవైచి సోఫాకుఁజేరగిలఁబడి కూరుచుండియుండెను. అత్తరి లోపలినుండి పరిచారకుఁడొకఁడే తెంచి "సర్కార్! ఇదే మీయాజ్ఞప్రకారము భట్టుగారిఁగొనివచ్చినాఁడ"నని పొడుగుపాటిబక్కపలచని నల్లని మనుజునిదెచ్చిచూపించెను. వెంటనే యజమానిలేచి యావచ్చినమనుజునకు సలామొనరించి "రండు, భట్టుగారు! వచ్చికూరుచుండుఁ"డని యాసనముఁ జూపింప నతఁడు దానిపైనాసీనుఁడయ్యెను. అప్పుడువారిరువు రీవిధమున మాటలాడిసాగిరి.

భట్టు.—ఈదినమున నీరలేమైనఁ గ్రొత్తవార్తలుదెచ్చినారా ?

యజ.—త్వరలో మాకందఱను నిక్కడినుండి యుద్వాసనగునట్టి యుపాయము గనిపెట్టుకొని వచ్చినాను.

భట్టు.—ఏమి! అట్లనెదరేల?

యజ.—అయినదికానిండు. తరువాతవచించెదను. ఇప్పుడీజాబునఁగల వృత్తాంతములేమో చూచిచెప్పుము. అని లేఖ నొకదానినందియ్యఁగైకొనిభట్టుగారిట్లు చదువఁదొడఁగిరి.

"మనోహరా ! తరణిసందర్శనంబు లేనిచోఁ బద్మిని ప్రాణముల భరింపనోపదు, దీనికై యనేకములగు నితరమదగజములు కాచుకొని యున్నవి. లోకబాంధవసమానుండవగు నీవీపద్మినింగరుణించి పరనాగములవాతఁబడకుండ దక్కించుకొనవలయునని వేడుకొనుచున్నదానను.

"సంయుక్త"

జాబునందలి సంగతులవిని పొంచియున్న బాటసారి విస్మితుఁడై తాను పోయినదనుకొనినవస్తువు తనకెంతమాత్రము సంబంధములేని పరులవద్ద నగుపడినచో మానవుఁ డెట్టి స్థితియందుండునో యట్టియవస్థఁబూనియుండెను అంత మరల భట్టుగారు యజమానుఁడును ఇట్లు మాటలాడసాగిరి.

యజ:—భట్టుగారూ! దానియందుఁగల సంగతులేమి?

భట్టు:—మరేమియులేదు. కన్యాకుబ్జనగరమేలుచున్న జయచంద్రునకు సంయుక్తయను నొక కూతురుగలదు. ఆమె మన చక్రవర్తిని వలచియున్నది. ఈయుత్తర మామె లిఖించినదే!

యజ.—ఏమని? ఎవరిపేర?

భట్టు.—చక్రవర్తికే. తన్నెటులైనఁ బెండ్లియాడుమనియు లేకున్నఁ బ్రాణములఁ ద్యజించెదననియు వ్రాసియున్నది.

యజ.—ప్రాణముల వదలునంతటి మోహము గలిగియున్నదా ఆక న్నియ?

భట్టు.—సందేహమేమి?

యజ.—మరి చక్రవర్తి కామెపై నింత ప్రేమమున్నదా?

భట్టు.—ఆహా! ఇంతకన్న నెక్కువే!

యజ.—నిక్కము వచింపుము.

భట్టు.—నిశ్చయమే చెప్పుచున్నాను చక్రవర్తి కామెపై నింతకన్న నెక్కువ మక్కువగలదు.

యజ.—అటులైనఁ జక్రవర్తి యింతకాలము పేక్ష చేసియుండుటేమి కారణము?

భట్టు.—జయచంద్రునకుఁ దనకుఁ గల వైరమువలన చక్రవర్తి కొంచెము వెనుదీయుచున్నాఁడు. కాని యెప్పుడో యొకసారి పెండ్లి యాడకమానఁడు.

యజ.—అయిన మనమిప్పుడు చక్రవర్తిని సులభముగ నే తుదముట్టింప వచ్చునే?

భట్టు.—ఎట్లు?

యజ.—ఏకరణినైన మన మాసంయుక్తనుఁ జంపించవలయును. అందువలనఁ జక్రవర్తి నశించును. పిదప మనము రాజ్యము నాక్రమించుకొనవచ్చును. సంయుక్తనుఁ జంపించితిమన్న వార్త యొకవేళ జయచంద్రునకుఁ దెలిసినను అతఁడు మనపైనెత్తి రాఁడు వచ్చినను నతనినొక్కనిఁ బారదోలు సామర్థ్యము మావద్దగలదు. ఇన్ని నాళ్ళనుండియుఁ బ్రసిద్ధివడసిన డిల్లీ కనూజ్ రాజ్యములురెండు మైత్రితో నున్నందున మాకిచటఁగాలుపెట్టుటకు వీలుకలుగక పోయినదిగాని లేకున్న నీదేశము నీపాటికే మావశముఁ గావించుకొని యుండక

పోదుమా. కానిండు ప్రస్తుతవిషయమునుగుఱించి యేమాలోచించెదరు?

భట్టు—మహాప్రభో! ఏలినవారిదయ చల్లగనుండవలెగాక దానికిదివరకే యేర్పాటుం గావించియున్నాను.

యజ.—ఏమికావించియున్నారు.

భట్టు.—సంయుక్తను జంపు నేర్పాటులే.

యజ.—ఎట్లు.

భట్టు.—ఇక్కడికిం గొన్ని మైళ్లదూరముననున్న మధురానగరము చేరువ నొకగుట్టపైం బ్రసిద్ధికెక్కిన కాళికాలయముగలదు. ఆప్రాంతములనుండు వామమార్గులనువారు తఱుచుగనాదేవికి నరబలులర్పించుచుందురు ఆమతస్థుల నెట్లైనం బ్రోత్సాహపఱిచి సంయుక్తం జంపునుపాయముం జేసిరమ్మని నానమ్మినసేవకుని నొకని నిదివఱకేపంపియున్నాను. వాఁడన్ని కార్యములు చక్కంబఱచియే యుండును.

ఈ పైమాటలు చెప్పఁబడినవెంటనే పొంచివినుచున్న పాంథున కారాటమును, రోషభయసంభ్రమంబులును ఒక్కపర్యాయమేకలుగ వారి చెంతకేగ రెండడుగులు ముందుకువైచి సమయము కాదనుకొని యాగి తాను వచ్చినదారినే బయలువెడలి పోవ నుంకించి మరల నేమనుకొందురో యనునాసఁబోపుటమాని యాందోళనమున నేమియుదోఁపక నిలువఁబడియుండెను. అత్తరి భట్టుగారు వచించిన వాక్యములకు డిల్లీరాజ్యము తనకుం జేకూరినంత సంతోషమునొంది యజమానుండు "వహవా! ఎంతటిబుద్ధిశాలులండి మీరు? మీకెట్టి యుపకారముం జేసినను మీఋణమును మాత్రము దీర్చుకొనం జాలము" అనిస్తోత్రము సేయం దొడంగెను. అంతభట్టుగారు పట్టరాని సంతోషమున "మీరు నన్నింతపొగడవలయునా? నాపై సంపూర్ణ

కటాక్షముంపుఁడు. ఇఁక నేను సెలవుఁబుచ్చుకొనెద" నని యతనికి సలాములుగొట్టి వెడలిపోయెను. అంత నాయజమానుఁడు భటులఁ గాంచి "ఈదినమున నీసంతోషవార్తవినుటఁ జేసి మిమ్మందఱ క్షమించితిని. ఇఁక ముందిట్టి యకార్యముల సల్పితిరా మీప్రాణములఁ దీయించెద" నని కఠినముగఁబలికి వారిలో నిరువురికిఁ దనవద్దనుండ నాజ్ఞాపించి తక్కిన వారితో "మీరీక్షణమున మనదండు విడిసియున్నస్థలమున కేగి యిపుడున్న తావువదలి వేరొక చోటికేగవలసినదిగా సేనాపతితో వచింపుఁడు. వేవేగఁబొం" డని సెలవొసంగ వారలును బయటరా నుద్యుక్తులై యుండిరి. అత్తరి నిట దాగియున్న పాంథుఁడు తానున్న చోటు వదలి త్వరితగమనంబున సొరంగమార్గముగుండ బయటికేతెంచి జాగరూకుఁడై లోపలనుండి వచ్చువారల కగుపడకుండునట్లు గుహాముఖమున దాగియుండెను. లోపలి యిరువురు దమయజమానికి సలాములొనరించి గుహామార్గమున బయటికేతేర నొకనితరువాత నొకఁడు వచ్చుచుండిరి. మొదటివానితల బయటి కగుపడిన నిముసమున దాగియున్న పాంథుఁడు తనఖడ్గముతో దానినెగురఁగొట్టెను. రెండవవాఁడు దిగ్భ్రమఁజెంది వరలోనున్న తనకత్తినిఁ బైకిఁదీసికొనఁబోవునంతలో వానిపై కురికి పట్టుకొని క్రిందఁబడఁదన్ని రొమ్ముపై కాలువైచి "దుష్టులారా! మీకక్కడ మరణము తప్పినను ఇక్కడఁ దప్పుననుకొంటిరా? అధర్మాలోచనపరులగు వారి దైవమెక్కడనైన శిక్షింపక మానఁడు". అనుచు వానిఁగూడ మొదటివానికిఁదోడుగఁబంపి యారెండు కళేబరములచటనే పడియున్న నాదారివచ్చిపోవువారికి సంశయముకలుగునని చేరువనున్న యమునం బాఱవైచి తనశరీరము శుభ్రపఱచుకొని తానుగావించిన సాహసకృత్యమునకుఁ బరవశుండగుచు నాలుగు గంటలు మీఱినందునఁ బురముదారిఁబట్టి పోయెను.

# ఆఱవ ప్రకరణము.



సకలకళాపరిపూర్ణుండై హిమాంశుండు తన శ్వేతకాంతులచేఁ గన్యాకుబ్జనగరసౌధములకు వెండినీరుఁ బోయుచుఁ బ్రకాశించుచుండెను. పరస్పరసంఘట్టనంబుల లేచు యమునాతరంగ తుషారసముదయములం దడిసి, నెత్తమ్ముల పుష్పాళ్లం జిందులాడి, నవమల్లికాప్రసవసౌరభములఁ గొల్లగొని, కేతకీగర్భపరిమళముల హరించి, పొగడతావులం గలసి మందయానంబున శీతలమలయమారుతుఁడు పాంథజనముల పరితాపం బపనయించుటకో యనఁ బురంబు నెల్లెడల సంచరించుచుండెను. రాత్రి పదునొకండుగంటలగుటచే మనుష్యసంచార మెచ్చటను లేకపోవుటయే కాక పక్షులకలకలంబులును సడఁగి యూరంతయు మాటుమణఁగియుండెను. కొన్ని గొప్పగొప్పవృక్షములపై నివసించియున్నపక్షులు మాత్రము మేల్కనినవు డంతయుఁ జంద్రాతపమునుం గాంచి తెల్లవారినదను భ్రమను ఱెక్కల విదుచ్చుకొనుచు గూండ్లవదలి బయటికేతెంచి యిటునటు గొంతదూరమేగి మరలివచ్చి తమతమ నెలవులఁ జేరుచుండెను. అట్లు సకలలోకాహ్లాదకరమై పిండియారఁబోసినట్లు కాయుచున్న పండువెన్నెలలోఁ గన్యాకుబ్జరాజ్యమునం దనుపమానమని ప్రఖ్యాతికెక్కిన యొకశశికాంతశిలావినిర్మితసౌధోపరితలంబున బాలికయొకర్తు తన ప్రియవయస్యలం గూడి వెన్నెలవిహార మొనరించుచుండెను. ఆకన్నియ నూతనముగఁ బ్రాప్తించిన నిండుజవ్వనముచే రూపొందిన సౌందర్యరాశియోయన రాజిల్లుచుండెను. స్నిగ్ధమై బంగారుచాయలం గేరు కాంతిగలపచ్చని శరీరమును, గుండ్రని మొగమును, వాలికలగుఁ గనుదమ్ములుం గలిగి నాఁటిదినమున నాశన్యక చెవులఁ దాల్చిన రవలకమ్మల వెలుఁగులు పలుచని చెక్కుటద్దములఁ బ్రతిఫలింపఁ, గ్రొమ్ముడి సడలి యవటుతలం

బునఁబడి నర్తన మొనరించుచుండ, హాసన్ముఖియైన నవమోహినీదేవత యోయన సంచరించుచుండెను. అర్ధరాత్రము కావచ్చువఱకు నట్లే విహరించుచుండి పిదపఁ గొంతవడికి మంజరియను ప్రాణసఖిం దక్కఁ దక్కిన వారల వారి వారి నెలవుల కనిచి నెయ్యంపుసఖిం జేరఁబిలిచి యిట్లనియె.

కన్యక.—సఖీ! ఇపుడెంత కాలమైయుండును?

మంజ.—కొంచెమించుమించుగ నర్ధరాత్రము కావచ్చినది. ఇంకను బండిగంటల ఫిరంగి వినఁబడ లేదు గదా?

కన్య.—అవును. చెలీ! ఈపండువెన్నెలలో నాకెంత చరించిననువిసువు జనింపకున్నది. ఆహా! ఎల్లెడల నిశ్శబ్దముగనుండ నాకసమునం దెచ్చటను మబ్బులేక నక్షత్రములలరారుచుండ సంపూర్ణకాంతుల రాజిల్లు నీ చంద్రమండలము చూపరుల కెంతయాహ్లాదము గొల్పుచున్నదే.

మంజ.—అవును. దేశమం దేకల్లోలములు లేక ప్రజలందఱు హాయిగ సుఖింప ధీపరాక్రమవంతుఁడై తేజశ్శాలియై కువలయపాలన మొనరించు రాజుం గాంచిన నెవరికానందము గలుగకుండును?

కన్య.—ఈకాలమున నట్టివార లేరైనఁగలరా?

మంజ.—లేకేమి?

కన్య.—చెలీ! అట్టి మహాత్ముని నామాక్షరములచే నాశ్రవఃపుటములనలంకరించెదవా?

మంజ.—ఆహా! ఎంత తెలియనిదానివలె నటించెదవే? నానోటఁజెప్పింపవలెననియా?

కన్య.—అటు కాదు. నీయుద్దేశ మేమో చెప్పుము.

మంజ.—మన యిద్దఱి యుద్దేశముల కెప్పుడు భేదముగలుగ లేదుకదా.

కన్య.—లేదుగాని యిపుడునీవు వచింపరాదా?

మంజ.—కానిమ్ము. నీవాంఛిత మేల నష్టపఱుపవలయు? చెప్పుటకు నాకును వినుటకునీకును విసుగుకలుగదులే. ఏ రాజుసద్గుణపుంజముల కాటపట్టని సమస్తప్రజలచే నుతులందుచుండునో, యెవని పరాక్రమశౌర్యములు వైరిరాజులకు గుండెదిగులుఁ బుట్టించుచుండునో, యెవని రూపరేఖావిలాసములు సౌందర్యవతులని ప్రఖ్యాతివహించిన కన్యకామణుల స్తోత్రము లందుచుండునో, యెవనినాను మెన్నిపర్యాయములు విన్నను నీకు దృప్తియుండదో—

కన్య.—అబ్బ. పేరు సెప్పుమన్న నీప్రసంగమంతయు నేటికి?

మంజ.—ఇంత చెప్పి పేరుసెప్పక మానుదునా? ఏమి, ఇంతలోనడ్డము తగిలితివి; కానిమ్ము. సూర్యగ్రహమునకు తొమ్మిదికోట్ల, పది నాలుగులక్షల, ముప్పదివేలమైళ్ళ దూరమునందుండు గ్రహమేది?

కన్య.—భూమి.

మంజ.—దాని కొకచక్రవర్తి వలన గలిగినపేరేమి?

కన్య.—పృథివి.

మంజ — మనదేశమందలి కవులు నృపాలునకుఁ జంద్రునకుఁగలిసి వచ్చునట్లు శ్లేషాలంకారమున వాడుపద మేది?

కన్య.—కువలయపతి.

మంజ.—ఏకపదముఁ జెప్పుము.

కన్య.—రాజు.

మంజ.—ఆరెంటిఁ గలిపి చెప్పుము. అతఁడే.

అనఁ బట్టరాని సంతసమున మోము కలకల లాడుచుండ నేమియుఁబలుకక వాల్జూపుల మంజరిఁజూచుచు నాకన్నియయూరకుండెను. అప్పుడు మంజరి యిట్లుపలుకరించెను.

మంజ.—నెచ్చెలీ! అనిమేషమునఁ జంద్రబింబముఁ గాంచుటకంటె నీవ దనముఁ జూచిన నెక్కువ సంతోషము కలుగుచున్నదికదా?

కన్య.—ఎందువలన?

మంజ—మనోహరనామప్రశంసచే సంతోషముప్పొంగి మొగముపై వెలిబాఱుచుండుటవలన.

కన్య.—చాలులెమ్ము నీమాటలు. అయిన నా రాజునుగుఱించి యింకేమైన నూతనవృత్తాంతములున్నవా?

మంజ.—వలచియున్నదానవు నీకుమాత్రము తెలియదా?

కన్య—ఆయనసుగుణగణముల విని వలచితినిగాని ప్రస్తుతమతఁడొనరించుచున్న కార్యములఁగూర్చి నాకేమియు బాగుగఁదెలియదు.

మంజ.—అటులైన నెలరోజులక్రిందట మాపినతల్లిగారి గ్రామమునకేగినప్పుడటఁ నొకబాటసారివలనఁ గొన్ని సంగతులువింటిని. వాని సారాంశముఁదెలిపెద వినుము. ఋషిజనసేవ్యమానమై, ప్రఖ్యాతికెక్కిన మన యార్యావర్తమునకు మాంసఖాదనులగు కొన్ని జాతులవారిమూలమున లేనిపోని బెడదలు సంభవించినవి. మొట్టమొదటఁ బాంచాలమునఁ బశ్చిమప్రాంతముల నుండుప్రజలు కొందఱాఫ్గన్ దేశస్థులగు మ్లేచ్ఛులఁగలసి పలలముఁదిన నలవాటుపడినారు. వారివలన స్వార్థపరులగు మఱికొందఱు మతాధిపతులలవాటుపడి వామమార్గులనుపేరున దేశమునం దెల్లెడల బోధించుచు ననేకప్రజలఁ దమలోఁ గలుపుకొని దురాచారములఁగడఁగ నారంభించిరి. అప్పటికె నూఱువర్షముల నుండి దేశమున నుత్తములగు రాజ్యపాలకులు లేనందునఁ బాఠశాలలన్నియు ధనలోభులగు నధికారులమూలమున నాశ

నమైయుండుటచే జనులును విద్యావిహీనులై యుండిరిగాన మూర్ఖులై తమ పురోహితులమాటలే విని మోసపోవుచు వచ్చిరి. ఇటులుండఁ జక్రవర్తి సింహాసనమునకు వచ్చినపిదప నతఁ డుత్తమవిద్యావంతుఁ డగుటచేఁ దన రాజ్యమున జరుగుచున్న హత్యల కసహ్యముఁజెంది తన దేశమునందట్టి దుష్కార్యము లొనరింపఁగూడదని గట్టియుత్తరవుగావించి సత్యవిద్యావిదూరులగుటచేఁ బ్రజలిట్టి యకార్యముల నొనర్పఁగడఁగిరి గదా యని యోచించి ప్రతినగరమునందుఁ బాఠశాలలేర్పఱిచి మాసిపోయిన చదువుల మరలఁ బైకిఁదెచ్చినాఁడు. అందువలన నుత్తమవిద్యావంతులై జనులు కొంద ఱట్టి దుర్మార్గములుచేయుట మాసివేసిరి. మఱియు పదునొకండవ శతాబ్దమునఁ గలిగిన మ్లేచ్ఛుల యార్భాటములచే జను లందఱు నొకక్రొత్తమార్గమునుద్రొక్కుచున్నారు. తమతమకాంతలుమ్లేచ్ఛులవాతఁ బడకుండ సంఘమం దనేకమార్పులఁ గలిగించుకొనుచున్నారు. అవి నేఁటివఱకును జరుగుచునేయున్నవికదా?

కన్య.—అవును. పాపము మనతోటికాంతల మ్లేచ్ఛులు పెట్టినబాధలు గణింప నలవికాకుండెనఁట.

మంజ.—"ఉండెనఁట" యనియనుచున్నావా? ఇప్పుడు మరల వచింప నలవికాని యల్లరులు జరుగుచున్నవఁట. గడచినశతాబ్దమందే మ్లేచ్ఛులపోరు దప్పించుకొనుటకుఁ గొందఱు సంఘసంస్కారకర్తలు గ్రామములమీఁద బయలుదేరి యూరూర నాఁడుబిడ్డల కెనిమదవయేఁడు రాకమునుపే వివాహముఁ జేయవలయుననియు,బురుషుఁడు గతించిన స్త్రీని మగని శరీరముతోడనే దహనము సేయవలయుననియు, నారులకు విద్యనెప్పించి బహి

రంగముగఁ దిరుగసీయఁగూడదనియు బోధించుచుండిరని నీవె ఱేఁగియే యున్నావుకదా.

కన్య.—అయ్యో! మఱచియున్న యాదుర్దినములందలి సంగతులన్నియు జ్ఞాపకమునకుఁదెచ్చితివా? ఆవిషయాములగురించి వ్రాసియున్న గ్రంథములఁ జదువునపుడంతయు నాకు భరింపనలవికాని వేదన గలుగుచుండును. ఆపాడుదినములు పోయినవనియే తలంచితి. అయిన మరలనిపుడెవరైన సంస్కారకర్తలు బయలుదేఱినారా?

మంజ.—బయలుదేఱకున్న నెట్లు? మనవారందఱు మాపెద్దలేర్పఱచిన పూర్వాచారముల మానఁజాలమని తమబిడ్డలకు పదియాఱవయేఁటివఱకు వివాహమొనరింపక యుంచినచో నిలోపలనే యేమ్లేచ్ఛుఁడో తనవాత వేసికొనిపోవుచుండు; పురుషవిహీనయగుకాంత బ్రతికియున్న నెప్పుడో యొకనాఁడు రాక్షసునిపాలు కావలసినదే. విద్యావతియై బహిరంగముగ సంచరించుచుండుకామిని యేమహామ్లేదియునకో యాహారమగుననుట తథ్యమే.

కన్య.—కట్టా! మనజాతి కాంతలకెట్టి యిక్కట్టులు సంభవించినవే? అవును. ఇట్టియెడఁ బూర్వాచారమని పట్టుపట్టిన నెట్లు?

మంజ.—మాపూర్వాచారము వదలఁజాలమని కూరుచున్నవారు తమవారల మ్లేచ్ఛులకే యొప్పగించుచున్నారు.

కన్య.—అయిన సంస్కారకర్తలిపుడేమి చేయుచున్నారు?

మంజ.—ప్రతిగ్రామమున కేగి యందు మీమీస్త్రీల రక్షించుకొనఁదలచితిరా బాల్యమందే వివాహములు సేయుఁడనియు, లేకున్న మ్లేచ్ఛులపాలిఁ దోలియవలసివచ్చుననియు, నుపన్యాసము లిచ్చుచున్నారు.

అందులకుఁ గొందఱు సమ్మతించుచున్నారఁట. కొందఱు "మాపిల్లలెట్టులైనఁ గానిండు, మాపెద్దలేర్పఱచిన యాచారముల వదల" మని వచించుచున్నారఁట మఱికొందఱు సంస్కారపక్షమవలంబించియు లోలోపలఁ దమ పూర్వాచారముల విడువకున్నారఁట. ఇంకఁ గొందఱు మనఃపూర్వకముగ సంస్కారపక్షము గైకొననభిలాషగలిగియుండియుఁ దమపెద్దలకు జడిసి యూరకొనుచున్నారఁట. ఇప్పుడందువలన దేశమంతయు నాలుగువిధములైయున్నది. మఱియుఁ గొన్నిగ్రామములందలిప్రజలు తమమాటవినక ధర్మశాస్త్రముల నేవైన ప్రమాణములఁజూపుడనికోర సంస్కరణసమాజమువారు గొన్ని శ్లోకములఁ గల్పించి చెప్పుచున్నారఁట.

కన్య.—ఆశ్లోకము లేవో నీకుఁదెలియునా ?

మంజ.—నాకన్నియుఁదెలియవుగాని రెండుమూఁడుమాత్రము నాకోటికివచ్చును. వచించెదవినుము.

స్త్రీలకు వేదాదివిద్యల నేర్పకుండుటకు

"స్త్రీశూద్రానాధీయామితిశ్రుతేః" అనియు

వారలకు బాల్యమందే వివాహములొనరించుటకు గాను,

"అష్టవర్షా భవే ద్గౌరీ నవవర్షా చరోహిణీ

దశవర్షా భవేత్కన్యా తతఊర్ధ్వం రజస్వలా"

"మాతా చైవ పితా తస్య జ్యేష్ఠో భ్రాతా తథైవచ,

త్రయ స్తే నరకంయాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం."

అనునవి పారాశర్యముమొదలగు స్మృతులలోని వనిచెప్పి యొప్పించుచున్నారఁట.

కన్య.—అయ్యో! ఈపాడు శ్లోకములే ముందుకుఁ బ్రామాణికములై యప్పటివారి కంఠములఁ బట్టుకొనునేమో కదా!

మంజ.—మతి కాలముననుసరించి సంఘము౦ను మార్పులఁగావించు కొనకున్న నెట్లు! ఈ మ్లేచ్ఛుల కౌర్యములన్నియు నడఁగి యుత్తములగు రాజులు పాలించి దేశమంతయు నెమ్మదిగ నున్నతరి మరల యథాప్రకారము కానచ్చును.

కన్య.—అప్పటివారల కివి కల్పితశ్లోకములను జ్ఞానము గలుగక నమ్మ ప్రబలమగు దురాచారముల మగ్నులై మా యాచారముల నూనఁజాలమని కూరుచున్నచో నాకల్పాంతము మనస్త్రీ కాంతలెల్లరు మూర్ఖురాండ్రై యుండవలసినదేకదా?

మంజ.—అటు లెందు కగును? ఆచారమువలన దేశకాలస్థితులననుస రించి పరమేశ్వరగుణ కర్త్రానుకూలముగఁ బ్రజలందఱు నడుచు కొనవలసిన విధులేకదా? ఒకవేళ మనదేశము నీవువచించినట్టి స్థితికి వచ్చిన బుద్ధిమంతులగు కులాచారసంస్కరణకర్తలప్పు టికెవరైన బయలుదేరకుందురా?

కన్య.—అవును లెమ్ము. మనదేశమున కెట్టింటక్కట్టులు మూడవలసి యున్నవో యెఱుఁగము. నాజనకుండు చక్రవర్తితో నింతవై రముఁబెట్టుకొనకున్న దేశమిట్టి గతికి వచ్చియుండునుగదా?

మంజ.—అవును. మూర్ఖమతులమనసు ద్రిప్ప నెవరితరము?

కన్య.—చెలీ! ఇప్పుడీసంగతులన్నియు ముచ్చటించుకొనుటవలన నామ నసు కలఁత నొందినది. మన గృహారామములోనికిఁ బోయి వత్తము.

మంజ.—ఒంటిగంట కావచ్చినది. ఇప్పుడేమి?

కన్య.—అటుకాదు. త్వరలోమరలి చనుదెంతము రమ్ము.

అన మంజరి తనచెలిమాటఁ ద్రోయఁజాలమి నటులేయని సమ్మ తించెను. అంతనాకన్నియ లిరువురు మందిరారామములోని కేగ వెడలిరి.



# ఏడవ ప్రకరణము.

పూర్వకాలమున నార్యావర్తమునందు ఢిల్లీనగరముతరువాత నంతప్రసిద్ధికెక్కినపట్టణము కన్యాకుబ్జనగరము. దీనినేఁడిప్పుడు "కనూజ్" యని వ్రాయుచున్నారు. పండ్రెండవశతాబ్దమున ననఁగా మనచరిత్రకాలమున జయచంద్రుఁడనురాజు దానిఁబాలించుచుండెను. ఇతఁడు సద్గుణవంతుఁడే కాని యొక్కదుర్గుణము మాత్రముకలిగియుండెను. ఆదుర్గుణమేదనఁ దన ప్రాణము మీఁదికివచ్చుచున్నను లెక్కగొనక ముందువెనుకలరయక మంచి చెడ్డలవిచారింపక తాఁబట్టిన మూర్ఖపుఁబట్టును నెగ్గించుకొనుట. అనేకసద్గుణగణచంద్రతారావిరాజితుఁడయ్యు మౌర్ఖ్యమను ఘోరజీమూతసంఛన్నుండై మనదేశము నన్యులపాలఁబడవైచిన దీమహాత్ముఁడే. ఇతఁడు రాజ్యముసేయుకాలమున ఢిల్లీనిదీపసింహునివంశస్థుఁడగుజీవనసింహుఁడుపరిపాలించుచుండెను. జయచంద్రజీవనసింహులిరువురు మైత్రికలిగియుండి పరదేశములవారి నార్యావర్తము ద్రొక్కకుండఁ జేయుచువచ్చిరి. ఇటులుండ జీవనసింహుఁడు కారణము లేకయే తన సేననంతయుహిమాలయప్రాంతములకనుప చౌహానవైరాట్ వంశస్థుఁడగుపృథ్వీరాజుతనసేనతో నాకస్మికముగ ఢిల్లీపైదండెత్తియారాజునునోడించి రాజ్యమునుతనవశముచేసికొనెను. ఈసంగతి జయచంద్రుఁడు తెలిసికొని తనమిత్రునిఁ జంపెననియు సామంతుఁడగువాఁడు చక్రవర్తియయ్యెననియుఁ బృథివీరాజుపైఁ గోపమును అసూయనుబూని నాఁటినుండియు నతని చక్రవర్తిపదభ్రష్టునిఁ జేయఁగను పెట్టుకొనియుండెను. చదువరులారా! మన యార్యావర్తమన్యులపాలగుట కీవిరోధమే కారణము. మనదేశమున బాల్యవివాహములు సహగమనములు మొదలగునవి ప్రబలుటకీ జయచంద్రుని మూర్ఖత్వమే కారణము. వేయేల? మనకుఁగల

స్వాతంత్ర్యముల నన్నిఁటి నేటఁగలిపి యస్వాతంత్ర్యవుఁ బ్రతుకుఁగలుగఁ జేసినది జయచంద్రునిఁబట్టిన యసూయయే. పృథ్వీరాజుపైవిరోధము నీర్ష్యయు వహింపక తనమార్గపుఁబట్టును మానియుండినయెడల నెంతబాగుండును? పూజనీయమై మునిజనసేవ్యమానమై విదేశీయగణ్యమై ధనధాన్యరాశులకాగారమై మహోన్నతపదవియందుండిన నీయార్యావర్తము భ్రష్టముకావించి వదలినమూఢుఁడీ జయచంద్రుండే యనినొక్కివక్కాణింపనగును. పైప్రకరణమున సౌధోపరితలంబున విహరించి గృహారామమున కేగఁదలఁచిన కన్యక యీజయచంద్రుని కూఁతురు. ఈమెయే మన కథానాయికయగు "సంయుక్త". అట్లిరువురు కన్నియలు గృహారామమున కేగ నెడలి పైయంతస్థునుండి సంయుక్త శయనమందిరములోనికి దిగిరి. ఈగది విశాలమై చదరముగ నుండెను. పైభాగమునఁ దెల్లపట్టుతానులతో చాందినీ యమర్పఁబడియుండెను. క్రిందఁ వలవరుసగ స్థాపింపఁబడిన పటికంపురాలపై ముఖ్మల్ మెత్త పరుపఁబడియుండెను. చాందినీకి మూరెఁడుక్రిందుగఁ జిత్రవిచిత్రములగు గులోబులు, పెద్దపెద్ద పాదరసపుబుడ్లు, మెఱపుదీపములుంచుట కనువగు నద్దపుగిన్నెలు ;వ్రేలాడుచుండెను. గోడలలోపలి భాగమంతయు నిర్మలమగు నద్దములకూర్పుగలిగి యుండెను. ఇవికాక నానాదేశముల చిత్రపటముల నక్కడక్కడ వ్రేలాడఁదీసి యుంచిరి. మెత్తపైస్వదేశ పరదేశ నిర్మితములగు చలువరాలకుర్చీలు వట్టువబల్లలు, సోఫాలనేకములు అలంకరింపఁబడియుండెను. మందిరమునడిమిభాగమునఁ దూగుటుయ్యేలలును, వానిమధ్య హంసతూలికాతల్పమును నుండెను. ఈప్రాసాదమునాల్గువైపుల విశాలములగు కవాటములు గలిగియుండెను. కవాటములనుండి బయటికేగ పిట్టగోడలచే నావృతమైన గొప్పహార్మ్యోపరితలము గాన్పించును. అందు బారులుగఁ దీర్పఁబడిన పలురకముల పూలచెట్లతొట్లును వానిమధ్యభాగమునఁ దీవెలతో దట్టముగ

నల్లుకొనిపోయి లతాగృహమువలెనుండు చలువపందిరియుఁ జూపరుల కాహ్లాదముఁ గొలుపుచుండును. వారిరువురుఁ గొంతవడి చలువపందిరివద్దఁ దిరిగి యక్కడనుండి క్రిందియంతస్థునకు దిగసాగిరి. ఈ క్రింది నికేతనము సంయుక్త ధరించునట్టి యమూల్యములగు వస్త్రాభరణముల మూఁదసములుగలిగి పైప్రాసాదమున కెంతమాత్రము దీసిపోవకుండెను. అందుఁబ్రవేశింపకయే వారిద్దఱు దానిక్రిందియంతస్థునకు దిగ నారంభించిరి. ఇదిసంయుక్త దేహపరిశ్రమఁ జేయునట్టిగది. ఎల్లపుడు ధరించునట్టివస్త్రములు గాక యాస్త్రవిద్య నలవర్చుకొనుటకుఁ బ్రత్యేకముగ దాల్చునట్టి యుడుపు లనేకములక్కడక్కడ వ్రేలాడుచుండెను. గోడల కొకవైపునఁ దళతళలాడు గత్తులును మఱియొకవైపున తుపాకులు మొదలగునవి తగిలించియుండిరి. మొదటఁజేర్కొన్న ప్రాసాదమునకుంబలె నీయుంతస్తు నొకవిశాలమగు బహిరంగ ప్రదేశముగలదు. సంయుక్తతన చెలిఁగోనందుఁబ్రవేశించి నయ్యాళికేగునప్పుడు మామూలుగ ధరించునట్టి చేతికత్తి నొకదానిఁ గైకొని క్రింది యంతస్థునకు దిగసాగెను. ఈక్రిందియంతస్థు సంయుక్త విద్యాభ్యాసమొనరించుకొనుహర్మ్యము. వరుసలుగఁదీర్పఁబడి బీరువాలు లెక్కింపనలవికాని గ్రంథరాజములఁ గూడుకొనియుండెను. సంయుక్త పుస్తకాగారముఁ బ్రవేశింపకయే దానిక్రింది యంతస్థునకు దిగి యుటనిద్రాపరవశలైయున్న దాసీనికరంబుల కెఱుకరాకుండ మెల్లన నడుగులిడుచుఁ గ్రిందికిదిగి యటనుండి తోటలోనికిఁ బోవు తలుపుఁ దెఱచుకొని వనములోనికేగి నిలఁయుఁజూచి వెన్నెలలో మఱింత మనోహరములుగనున్న బొండుమల్లియల విలాసంబున కానందమందుచు నటకుఁగొంచెము దూరమున నున్న మాధవీలతా మంటపము లోనికేగియక్కడనుండి వెడలి యుత్తరపుదిశనున్న లవలీలతామంటపముఁ బ్రవేశించి యాచేరువనున్న కప్పురంపు దిన్నెల యామోదమున కామోదమందుచుఁ

బిమ్మట ప్రాగ్దిశయందలి నవమల్లికాలతామంటపముఁ జేరి, యాప్రాంతములనున్న సంపెఁగవనము నుండివచ్చుచున్న తావులకుసమ్మోదమంది, యావలఁగడచి చలువరాలచే నిర్మింపఁబడి, నిండువెన్నెలలో నిగనిగలాడుచున్న కేళాకూళిం జేరి జలయంత్రముల విడువ నించుకసేపటికి నీరునిండి వెల్లువయై పాఱఁదొడఁగెను. కొంతతడవు దానిగట్టుపైఁగూరుచుండి మృగములున్న వైపున కేగఁదరలిరి. ఈ మృగశాల తోఁటయందుత్తరమున నుండెను. తూర్పువైపుగోడనుండి పడమటికడ్డముగ వల యొకటిగట్టఁబడియుండెను. వలదాటి లోపలికిఁబోవ వరుసలుదీరియున్న శాలల నేకములు కాన్పించును. అందు మొదటివరుసయందు సింహవ్యాఘ్రాది జంతువులును, రెండవవరుసయందు బలురకముల కోతిజాతులును, వానికావల నానావిధపక్షులును, దదనంతర మనేక సర్పజాతులును, వేరువేరుశాలలయం దుంచఁబడియుండెను. ఇందుఁ బ్రతిశాలకెదుట నంతఃపురస్త్రీలుకూరుచుండి జంతువులచేష్టలు వీక్షించుటకై మంటపములు కట్టఁబడియున్నవి. ప్రతిమంటపములోఁ దూగుటుయ్యేలలు, సోఫాలమర్పఁబడియుండెను. తోఁటయందన్ని భాగములను, మంటపములందును, జంద్రకాంతులఁగ్రిందుపఱుపఁజాలు విద్యుద్దీపములు పెట్టుటకనువగు సన్నని గొట్టము లడుగడుగునఁ బెట్టఁబడియున్నవి. వెన్నెల దినములలో మంటపములందలి దీపములమాత్రమే వెలిగించుచుందురు. మఱియు నాయావరణమందు నాలుగువైపుల స్ఫటికశిలావినిర్మితములగు కేళాకూళులుగలవు. ఇవి చిన్నచిన్న సోపానముల నొప్పి పూలవృక్షములతొట్లచేఁ గడుమనోహరముగ నుండును. ఈనాలింటిలోపలఁ దూర్పుప్రక్కనున్నది. దట్టముగఁ దీఁగెలతోఁ నల్లుకొని మనుష్యులుదాగియున్నను నగుపడకుండఁ జేయుచుండును. అట్టి యావరణమం దాయిరువురుకన్నియలుఁ బ్రవేశించి మొదటిశాలలవరుసదాటి రెండవశ్రేణియందలి కోతులచేష్టల దర్శింపఁగోరి యొకమంట

పమునఁజేరి యొకసోఫాపై నాసీనులై వానితోఁ జమత్కారముగ ముచ్చటించుచు నాడుకొనుచుండిరి. ఆతరుణమున దీర్ఘకాయుండగు నల్లని మానవుఁడొకఁడు పుట్టగోచిని బెట్టుకొని శరీరమునిండ యాముదము కారుచుండఁ దీక్షణమగు మూరెఁడుపొడుగుగుదియ నొకదానిఁ జేతఁ బట్టుకొనిచూచువారలకుఁ బ్రత్యక్షయముఁడోయను భయముగలిగించుచుఁ దూరుపుప్రక్కనున్న కేళాకూళిమాటున కేగెను. తనయాకార వేషములతోఁ దులదూఁగఁగల మఱియొకని నటఁగలసికొని యామనుజుఁ డిట్లుమాటలాడసాగెను.

మొదటివాఁడు — అరే! వచ్చినటులున్నదే.

ద్వితీయుఁడు.— ఆ! ఇన్నిదినములకు మనకష్టము లీడేరుసమయము వచ్చినది.

ప్రథముఁడు.— అందులో నెవతె రాజుకూఁతురు?

ద్వితీ.— అదియేమో నాకుఁ దెలియదు.

ప్రథ.— మఱేమిచేయుదము?

ద్వితీ.— వారి మాటలవలనఁ గనుగొందము, నీవించుకతాళి యుండుము.

అనవాఁడేమియుఁ బలుకక నిలచియుండెను. అత్తరిసంయుక్త వదన మించుకవాడియుండుట దీపములవెలుతురునఁ గనుఁగొనిమంజరి యిట్లనియె.

మంజ.— నెచ్చెలీ! ఇప్పటికి రెండుగంటలు కావచ్చినవి. నీకింకను నిద్ర వచ్చుటలేదా? నిద్రలేమి దేహమునకెట్టి యనారోగ్యము కలుగునోయెఱుఁగవా? సకలమెఱిఁగిన విద్యావతివి రాకొమారి తవు నీవే యిట్లొనరించుచున్న నిఁక మాబోంట్లకు బుద్ధులు గఱపువా రెవరు?

అని నడిపటకెక్కొంచెము నిద్ర వచ్చుచుండుటవలన నుబ్బుమాటలతో సంయుక్త ,, చెలీ; ఈదినమున నాకేమో యారాటముగ నున్నదే. నాకోర్కె నెఱవేర్చుకునని వచించిపోయిన నాగురువుగారి వార్తయించుకైనం దెలియలేదుగదా! అందుచే నుత్తింతపరితాపము కలుగుచున్న,, దనివచించుచు నల్లే సోఫాపైఁబరుండి నిదురవోయెను. మంజరియు వనవిహారముచే బడలికఁజెంది నిద్రించినసంయుక్త నప్పుడే మేల్కొలుపుట కిచ్ఛగింపకయొకగడియ వెనుక మేల్కొల్పెదనని యనుకొనుచు నల్లే తానును నిదురవ్రాయెను. ఇక్కడవీరిట్లు నిద్రించుటఁగాంచి దాగియున్న యిరువురు నిశ్శబ్దముగ సమాటపములోనకేతెంచి వారలమాటలవలన రాకుమారికం గుర్తెఱుఁగొనియుండిరి గాన నామెపరుండియున్న సోఫానెత్తుకొని తామువిపరకే తెఱచియుంచుకొన్న ద్వారముఅటాటి తమదారింబోయిరి.



---

# ఎనిమిదవ ప్రకరణము.

అంతఁ దెల్లవాఱుజామున నాలుగుగంటలగుటయు నిదురఁజెందియున్న సింగములు లేచి "మందబుద్ధులగు నోద్వారపాలకులారా! జయచంద్రునకుఁ బ్రాణసమానురాలగు సంయుక్తను దస్కరు లెత్తుకొనిపోవుచుండ నజాగ్రతతో నిద్రించుచుంటిరిగాన మిమ్ముందఱ నిప్పుడే మ్రింగివైచెదము చూడుఁడు" డని హుంకారములు సలుపుచున్న వ్రాయన నొక్కపెట్టున భయంకరముగ గర్జింపసాగెను. అత్తరి నా గర్జనముల కులిక్కిపడి లేచి మంజరి తనకట్టెదుట సంయుక్తనుగానక సంభ్రమమంది పేరులుపెట్టి పిలిచియుఁ బ్రత్యుత్తరముగానక కొకవేళ తన నిద్రాభంగముసేయుట కిచ్చగింపక వేఱొకచోటి కేగినదేమోయని మృగశాలలన్నింటవెతకి యెచటనుంగానక దిగులొందుచుఁ ద్వరితగతి నారామముఁ బ్రవేశించి నల్గడలఁ బరికించి యెందును బొడగానరామి భయార్తయగుచు నేమియుందోపక బిరబిర మేడనెక్కి ప్రతియంతస్థునందును రోయుచు, శయనమందిరముఁ జేరి యచ్చోటను గానరానందునఁ బొంగివచ్చుచున్న దుఃఖభారమున మొదలునఱికిన తరువువలె నిలువునన నేలఁ గూలి "హా! ప్రాణసఖీ! నన్నొంటిదానిఁజేసి నీవెచటి కేగితివి? మనకు శరీరములు వేఱైనను బ్రాణమొక్కటియేయని యిదివఱ కనేకమారులు వచించియుంటివే. అయ్యో! సగముప్రాణముతోఁ బోవ నీకు మనసెట్లువచ్చెను? ఈదుర్వార్త మీవారల కేమనివచింపుదు? ప్రాతఃకాలమగునప్పటికి నీతల్లి చనుదెంచి సంయుక్తయెక్కడని యడుగ నేమని చెప్పుదును? కట్టా! సంయుక్తను నాపొట్టనువైచుకొంటినని వచింపుదునా? నాపైనింత కాఠిన్యమేల పూనితివి? నీసౌఖ్యమున కాశించియే గదా! నీవు రమ్మనిన చోటికెల్ల వచ్చుచుంటిని. ఇయ్యెడ నన్ను వెంటఁ

గోసిపోయిన నీయుద్దేశమునకుఁ బ్రతిబంధకమగుదునని వదలిపోయితివా? హా! ఇంకెందుఁబోవుదాన" నని బిగ్గరగ నేడ్చిన వారువీరు లేచి వచ్చెదరను భయమున లోలోపలనె కృశించుచు సముద్రతరంగములవలె పొర్లి పొర్లి వచ్చుచున్న దుఃఖమున నేమిసేయుటకుఁ దోఁపక మరల నారామముఁ బ్రవేశించి వెదకినచోటే వెదకుచుఁ బిచ్చియెత్తిన దానివలె వనమంతటఁ గలయంబరికించి మితిమీఱినశోకమున నటనుండ మనసొప్పక "హా నాప్రాణపదమగు సంయుక్త నెడబాసి నేనేల యొంటరిగ నుండవలయును? నానెయ్యంపుఁ జెలియెక్కడనో యేయిడుమలో పడుచుండ నేనింట సౌఖ్యముగ నుండఁగలుగుదునా? నేనును దదన్వేషణార్థ మెచటికైనఁబోయెదఁగాక" యని దృఢచిత్తయై తత్క్షణంబ యాయుధాగారమున కేగి యటఁగల కొన్ని యుడుపులతోఁ బురుషవేషము వేసికొని లోపల నడుమున రెండుకత్తులఁబదిలపఱుచుకొని కావలివార లెవరును లేవకమున్నె యారామద్వారములన్నియుఁగడచి చింతాసాగరంబున మునిఁగి తేలుచు నెక్కడికో పోయెను. అంతఁ గొంతవడికిఁ బక్షులకలకలారావములు మిన్నుముట్ట జల్లని ప్రభాతవాయువులు మెల్లన వీవఁ దొడఁగెను. ముందు జరుగఁబోవు రణమునందిల్లే రక్తసిక్తములగునని సూచించుభంగిఁ బూర్వదిక్కునందలి యరుణమరీచులు కన్యాకుబ్జనగరప్రాసాదతలములపైఁ బ్రసరించుచుండెను. కావలివారెల్లరుఁ దమ్ము నావేశించియున్న నిద్రాపిశాచముల నతికష్టము మీఁద వదలించుకొని ఖడ్గపాణులై జాగరూకతఁ గోటద్వారములఁ గాచుచుండిరి. కాని రాత్రిఁ దాము పడుండఁబోవునప్పుడు మూసినద్వారము లిప్పుడు తెఱువఁబడియుండుట కేమిహేతువో యని యొక్కఁడైనఁ దలఁపఁడయ్యెను. అత్తఱిఁ జెలికత్తెలెల్లరు మేల్కని సంయుక్త శయనమందిరము లోని కేగి యామెఁ గానక మంజరియు లేకుండుటవలన నిరువురుఁ దమకన్నముందుగ లేచి ప్రాతఃకాలవనవిహారమున కేగియుందురనుదలఁపున

వారిఁగలసికొనుటకై క్రిందికివచ్చి తోఁటయందుఁ బ్రవేశించి యన్ని మూలలవెదకి వారిఁ బొడగానక ద్వారముకడ కేగి "ఓకీ ! మంజరీసంయుక్తలెక్కడికైనఁ బోవుటఁ జూచితిరా?" యని యచటి కావలివారల నడుగ "అమ్మలారా ! రాత్రియంతయు నిద్రేప్రకారము గాచుకొని యున్నాము. మాకెవ్వరుఁగాన్పించలే" దనిన వింప నందఱుసంభ్రమాక్రాంతహృదయులై వేవేగ నంతఃపురమున కేగి రాణి కాసమాచారమెఱిఁగించిరి. ఆమెయుఁదల్లడమంది లేచిపోయి జయచంద్రునకు విన్నవింప భయాకులుఁడై యేమిచేయుటకును గాలు సేతులాడక కోట నాల్గుమూలల వెదకించియుఁగార్యముగానక భటులఁ గొందఱ నన్నికడలఁ బురములోపల వెలుపల సోయఁబంచి యాందోళనమున నుండెను. రాణివాసమంతయు నల్లకల్లోల మగుచుండెను ఈసమాచార మప్పుడె నగరమంతట వ్యాపింపఁ బౌరజనంబు లెల్లరును విచారపడసాగిరి. పట్టణమందలి జనంబు లెల్లరు నామె సుగుణములకును, విద్యకును, జక్కఁదనమునకు నావాసమని వేనోళ్ల శ్లాఘించుచుందురు. మఱియుఁ గన్యాకుబ్జమున రూపొందివెలసిన లక్ష్మియని భావించుచుందురు. పౌరులెల్లరు దమస్వంతబిడ్డలుపోయినట్లు విలపింపసాగిరి. ఇఁక రాణియొక్క యవస్థ నేమని చెప్పనగు ! జయచంద్రుఁ డించుక ధైర్యవంతుఁడగుటచే మంజరియు లేనందున వారిద్దఱుఁగలిసి యెక్కడికో పోయియుందురనియు, నిరుపురుఁగలసియున్నంతవఱకు వారి కేయిక్కట్టులు సంభవింపవనియు నెంచుకొనుచుఁ గంటికి మంటికి నేకధారగా విలపించుచున్న రాణినోదార్చి, కొలువుకూటమున కేగి చారులనేకులనన్ని దిక్కులవెతకఁ బంచి పురమునఁ దంతట సంయుక్తను గొనితెచ్చువారికి బహుమానములియ్యఁబడునని చాటింపించెను. ఆచాటింపువిని పలువురు బీదలు నగరము వెడలి యనేకగ్రామములు వెతకి యెచ్చోటనుంగానక తిరిగివచ్చుచుండిరి. మఱికొందఱు రాకొమారికను గనుగొన కేలమరలిపోవల

యునని పట్టుపట్టి మఱింతదూరదేశముల కేగుచుండిరి. రాణి వాస మిట్టికారవస్థనుండ నైదురాత్రులు గడచెను. ఒక్కరును సంయుక్తవార్తఁ దేరైరి అనుదినమును జూడనిదే ప్రాణముల నిలుపనో పని రాణి తనముద్దుకూఁతురుపోకడవలన మంచముపట్టి నిద్రాహారము లుమాని యహోరాత్రము లొక్కతీరున విలపించుచుండెను. „హా! కుమారీ! నవశిరీష కుసుమకోమలాంగివగు నీ వెక్కడనున్నావు? నిర్దయురాలా! నాశోకమూర్తినైనను వచింప కెచ్చటి కేగితివి? కట్టా! నవ మాసములు మోసి, కని, యింత పెద్దదానిఁ గావించినందులకుఁ దుద కిది యా తల్లిమెడఁ గసఁబఱచు కృతజ్ఞత? అయ్యో పున్నమచందురుఁ బోలు నీముద్దుమోమిం కెన్నఁడు గాంచగలను? హా! నాదౌర్భాగ్యము! నాముద్దుకూన నెడబాసి నే నెట్లు ప్రాణముల ధరింపగలను?„ అని గోలు గోలునఁబలవించుచుండ నెల్లరుఁ జెంతఁజేరి యోదార్చుచుండిరి. జయచంద్రుఁడును బుత్రికావార్త తెలియనందునఁ గొలువుకూటమున కేగుటమాని రాచకార్యము లన్నియుఁ జక్కఁబఱుప మంత్రికాజ్ఞాపించి తానంతఃపురంబు వదలక చింతాసాగరమున మునిఁగి కూఁతురుసమాచార మెవరుకొని తెచ్చెదరా యని దినములు లెక్క పెట్టుకొనుచుఁ గాలముఁ గడపుచుండెను.

---

# తొమ్మిదవ ప్రకరణము.



మూఁడవ ప్రకరణమునఁ జేర్కొనిన మధురాపట్టణపుఁదిప్పమీఁది కాళికానిలయమునకు మఱియొకపర్యాయము మంచిదినములు గలుగుట సంభవించెను. అచ్చటివా రంద అమావాస్య పదిదినములున్నదనఁగనే గుడిని బాగుపఱచ నారంభించిరి. ప్రాకారపుగోడలకు,గర్భగుడి శిఖరమునకు సున్నమువైచి వానిపై మూతులు, ముక్కులు, పోయియున్న బొమ్మలఁ జక్కపఱిచి లోపలనున్న స్తంభముల కన్నింటికి రంగులువైచి యుంచిరి. గోడలమీఁదఁ జూచువారలు గుండెపగిలిచచ్చునంత టిభయంకరములగుబొమ్మలఁ లిఖించుటయేగాక యట్టివే పటముల నందందు ప్రేలాడఁగట్టిరి. ఆవరణమందు దుబ్బువలెఁ బెఱిగియున్న గడ్డినంతయు దోకి శుభ్రముచేసిరి. గజనీమహమ్మదుచే నవయవవిహీనఁగఁ జేయఁబడిన కారణమునఁ గాఁబోలు స్వశరీరమైనను శుభ్రపఱచుకొను శక్తిలేకయున్న దేవీవిగ్రహమునకు భక్తులాదఱు మీఁదఁబడియున్న నెలుకపెంటలను దుమ్మును బోఁదుడిచిసీకాయరసముంతో మడ్డినంతయుఁ గడిగి వెండికన్నులు మొదలగువాని నాయాచోటుల నలంకరించి తమకోరికల ఫలింపఁజేయునని తలఁచుచుండిరి. కాని యింతశక్తివిహీనమగు ఆాతివిగ్రహము మనవాంఛితముల నెట్లు నెరవేర్చునని యొక్కఁడును దలఁపఁడయ్యెను. అంతకుమునుపు మడ్డిపట్టియుండుటవలన నెటులున్నను కండ్లుమొదలగునవి చక్కగాఁదోమి యలంకరించిన పిమ్మట మాత్రము చూచినవెంటనే ఘాంతులుపుట్టి చచ్చునంత టిభయముఁ గొల్పుచుండెను. ఆమందముచేసంగుళమెత్తు మడ్డిపట్టియున్న దీపఁపుసెమ్మెలను, బ్రమిదెలు బ్రయాసపడితోమి గుడిలోపల వెలుపలనున్న గూండ్లయందును గుడినుండి క్రిందవఱకున్న మెట్ల కిరు

పార్శ్వములందలి పిట్టగోడలమీఁదను బెట్టియుంచిరి. మఱికొన్ని యగండములనాలయములోపల శక్తికొలఁది వ్రేలాడఁదీసియుంచిరి. ఖడ్గముల సానఁబెట్టించి లోపల నొకగదియందు వ్రేలాడఁగట్టిరి. ఇంతలో నమవసయు వచ్చెను. ఆనాఁడు బాలగోపాల మభ్యంగనస్నానము లాచరించి నూత్నవసనధారణులై యుపవాసమునుండి సూర్యుఁ డెప్పుడు గ్రుంకునా యనివేచియుండిరి. ఆనాఁడు మిట్టమధ్యాహ్నమందొక పెద్ద సభ గావించిరి. ఆసభయందు జారుఁడును, జోరుఁడును, విద్యావిహీనుండును, మూర్ఖాగ్రేసరుఁడును నగు వారి పురోహితుఁడు దేవి నిక్కముగఁ బ్రత్యక్షయగునని తలఁచి తత్ప్రసాదంబు దానొక్కఁడే పాలుగొను వాంఛనులేచి యిట్లని వచింపసాగెను.

"సభికులారా! మీరందఱు శ్రద్ధతో నే వచించువాక్యముల వినుఁడు. మనతరిమం దిదివఱకెన్నఁడు నొసఁగనట్టి నరబలియీదినమున నియ్యఁబోవుచున్నాఁము. అందు సాధారణపుమానవుండుగాఁడు సమస్తవిద్యాసంపన్నురాలును సౌందర్యవతియు నగు రాజకూఁతురైయున్నది. అట్టియెడ మనమందఱము గుమిగూడిన నాలయమున మిక్కుటమగు నల్లరియగును. అదియునుంగాక రాత్రి నాకలయందు దేవిప్రసన్నయై 'నాకుబలియిచ్చునపుడు నల్గురుమనుజులుతప్ప నెక్కువయుండఁగూడదు. అట్లున్న యెడల నాకన్యకనువదలి మిమ్ములనే భ్రమింగెదనని వచించినది. కానమీరందఱుఁ గొండయడుగుభాగమందేయుండుఁడు. దేవి ప్రత్యక్షమైనవెంటనే యామె యనుజ్ఞఁగొని మిమ్మందఱఁ బిలిపించెదను.' అని నమ్మికకలుగునట్లువచింప "నెద్దయీనినదన్న దూడనుగట్టివేయు" మను నంతటి బుద్ధిశాలులగు నామూఢులందఱు వల్లెయని యతనివాక్యములకు సమ్మతించిరి. అంతఁ గొంతవడికి సభ ముగింపుచేసి యెవరిండ్లకు వారుపోయిరి. సభ ముగియునప్పటికి నాలుగుగంటలయ్యెను. తరువాతఁ గొందఱు పెద్ద

మనుష్యులు లెక్కలేని మద్యభాండముల మోయించుకొని కొండ మీఁదికేగి కొన్నింటి దేవిగుడియందుఁ బెట్టించి కొన్నింటి రాత్రికిఁ దాము నిలువఁదలఁచుకొన్న స్థలమునఁ బదిలముసేయించి పరిచారకుల కొందఱ నటఁగావలియుంచి గృహములకు మరలివచ్చిరి. అనంతరమీ దారుణకృత్యములఁ జూడనోపక కనుదొరంగిపోయెనోయన రవి పడమటి సముద్రమునఁగ్రుంకెను. బాగుగఁ జీఁకటిపడినవెంటనే నౌకరులేగి దీపముల వెలిగించివచ్చిరి. రాత్రిఁ దొమ్మిది గంట లగుపు మతస్థులెల్లరుఁ బురోహితుని యింటిదగ్గరఁ జేరిరి. నలుగురు మనుష్యులు లోనికేగి యొకగది తలుపుఁదీయ దానిలోనుండు దివ్యమంగళవిగ్రహమురూపము దాల్చినవగపునుంబోలె నేలకంటుకొని పడియుండెను. నా రామెను బైటికి రమ్మని యాజ్ఞాపింప నాహారము లేక పోవుటవలనఁగాక పోయినను మితిలేని శోకభారమున లేవనోప కట్లుపడియుండ నామెం గొనివచ్చుటకు వ్యాఘ్రములవంటి నల్గురు స్త్రీలను బంపిరి. వారుపోయి యా కన్యను లేపి చేతులతో నెత్తుకొనివచ్చి బయట సిద్ధముగనున్న నొక పల్లకియందు గూరుచుండఁ బెట్టిరి. చెవులు బ్రద్దలగునట్లు రుంజా మొదలగు భయంకర వాద్యములు తమభీకర ధ్వానములచే దిశలఁ గలగుండు పడఁజేయుచుండ మేళతాళములతోఁ బల్లకి నెత్తుకొని యందఱును గుట్ట వైపునకు బయలుదేరిరి. పాప మీసవారియందున్న కన్యక కెట్టిగతి పట్టెనో యూహింపుఁడు. తలిదండ్రులు, బంధువులు, తోడుకత్తెలు మొదలగువారు గలిసిరా వివాహోచితవేషమున శుభవాద్యములతో నూరేఁగఁదగు నాకన్యక దుర్మార్గులగుఁ బాషండులు వెంటరా మరణసూచక వేషముతో భయంకరవాద్యములు మిన్నుముట్ట నూరేగ వలసివచ్చెఁగదా! దీనికంతయు సత్యవిద్యావిహీనతయే కారణము. విద్యనెఱుంగనికతమున నీమతస్థులందఱు దమపురోహితు లెట్లు చెప్పిన నట్లు నడచుకొనుచుందురు. అట్లు కొండయడుగుభాగముఁ జేరినపిదపఁ

పైకేగ నేర్పఁబడిన నలువురు పల్లకిబోయీలు దప్పఁ దక్కినవార లక్కడే నిలచిపోయిరి. పురోహితుఁడాదిగాఁగల నలువురు పల్లకిని గుడిలోనికిఁ బట్టించుకొనిపోయి శక్తి యెదుటఁ బెట్టించి బోయీలు వెళ్ళఁ దనవారలును నట్లే వెడలి పోయిరి. అంత నాకన్నియ పైనున్న ముసుఁగుఁదీసి వైచుటతోడనే యెదుటనున్న భయంకరమగు శక్తిఁజూచి భీతచిత్తయై మూర్ఛిల్లి లేచి తనదురవస్థఁ దలఁచుకొని యడఁచుకొన్నను దాఁగక తెరతెరలై వచ్చుచున్న శోకమున నిట్లు విలపింపసాగెను. "దైవమా! నేను నీయెడఁ గావించిన యపరాధమేమి? నిర్హేతుకంబుగ నాకిట్టివ్యథ నేలఁ దెచ్చి పెట్టితివి? కలనైన నిట్టి దుర్మరణంబు నొందుదునని తలంచితినా? హా! తలిదండ్రులారా! నావంటి నిర్భాగ్యురాలి నేలఁ గాంచితిరి? మిమ్ముఁ దరిలేని శోకసాగరంబున ముంచివైచితిఁగదా! మీరలెంత పరితపించుచున్నారో! హా! మంజరీ! నీవంటి ప్రాణసమానురాలగు సఖి మఱియొకతె దొరకుట దుర్లభము. నీమాటవినక యే నిట్టిబెట్టిదములకు లోనైతిని. నీవు వచించిన ప్రకారము మందిరంబులఁ బరుండియే యున్న నాకీప్రాప్తి గలుగకుండును గదా! నేనెంత విలపించి యేమి ప్రయోజనము. తెగించి పోరాడుదమన్నఁ జేత నొక కత్తియైనను లేదు. మనోహరా! నీయుత్సంగంబున వసించు భాగ్యము దౌర్భాగ్యురాలనగుట నాకు లేకపోయినది. పరమేశ్వరా! ఎన్ని జన్మములకయినను నా హృదయనాథుఁడగు పృథ్వీరాజునే ప్రాణకాంతునిగా నొసఁగుము" మని తనవారి నందఱఁ దలఁచుకొని యొక్క పర్యాయమేడ్చి చేయునది లేక నిరాధారయై వ్యాఘ్రముల మధ్యఁ జిక్కిన లేడివిధమునఁ బడియుండెను. పురోహితుఁడాదిగాఁగల తక్కిన నలువురుఁ దమదమ పూజాకార్యముల నెరవేర్పఁ దొడఁగిరి. పురోహితుఁ డెఱ్ఱని పుష్పములతోడను నక్షతలతోడను మంత్రముల జపించుచు విగ్రహమునకుఁ బూజసేయుచుండెను.

వేఱొకఁడు రెండుమూఁడు బిందెలయన్నమును గ్రుమ్మరించి దానిలో నెత్తురు గంగఁబోసి కలుపుచుండెను. ఇంకొకఁడు శక్తియెదుట నుండు గుండములో హీనవస్తువుల తుచ్ఛములగు మంత్రములఁబఠించుచు వ్రేల్చుచుండెను. అంతనర్ధరాత్రమునుగా వచ్చినంతనుఁ జేయవలసినకార్యము లన్నియుఁ జేసి యిరువు రాకన్నియను దేవియెదుటకుఁ గొనివచ్చి నిలువఁబెట్టి యొరిగిపడకుండఁబట్టుకొనియుండిరి. నిర్జీవప్రతిమవలెనాకన్నియ నిలిచియుండెను ఒకఁడు శంఖముఁ బూరించుచు గంటవాయించుచుండెను. పురోహితుండతితీక్ష్ణమగు కత్తినొకదానిం గైకొని మంత్రోచ్చారణము సలుపుచు నామెశిరంబుఁ దెగ వ్రేయ సిద్ధమైయుండెను. అట్టిమహోపద్రవమగు సమయంబున తేజశ్శాలియగు యౌవనవంతుఁ డొకఁడతిత్వరితగమనంబున గుడితలుపులు గుభాలున నెట్టుకొనివచ్చి తలఁదెగ వ్రేయుటకు సిద్ధముగనున్న పురోహితునిహస్తమున నున్నదానినున్నట్లే తునుమాడెను. తోడనే విభ్రాంతుఁడై పురోహితుఁడు నేలఁ గూల సంయుక్తంపట్టుకొనియున్న యిరువురు వేఱొకగదికేగి యాయుధములంగొని యౌవనవంతునిపై దుముకవచ్చుచుండిరి.

ఈలోపల నావచ్చినపురుషుండు "సంయుక్తా" యని కేకవైచి తనవద్దనున్న రెండవఖడ్గము నొసఁగెను. వెంటనే సంయుక్త ఖడ్గమునందుకొని యుత్తరప్రత్యుత్తరములకు సమయము లేనందున నావచ్చిన మనుజుఁ డెవ్వరైనదియు నెఱుంగకపోయినను దనకుసహాయ్య మొనర్పఁ జనుదెంచెనని యూహించి తానును బోరాడసిద్ధమయ్యెను. నామమాగ్గు లిరువురిపై వారిరువురు లంఘించి యతినిపుణముగ వారిఁ దుదముట్టించిరి. ఆకల్లోలమంతయుఁ గాంచి శంఖముఁబూరించునతఁడు బిరబిరఁ గ్రిందికిఁ బరువెత్తి యక్కడివారల కీసంగతిఁ దెలియఁబఱుపఁ దక్షణంబ వారును హుంకారము లొనర్చుచు బయలుదేరి గుడిఁ బ్రవేశింపఁగడఁగిరి.

ఈలోపల గుడియందలి సంయుక్తాయౌవనవంతులు ద్వారమున కిరుపార్శ్వముల నిలచి వామమార్గుల నావరణముఁ బ్రవేశింపఁకుండఁ జేయుచుండిరి. అతిప్రయత్నముమీఁదఁ గొంత సేపటికి వామమార్గులు లోపలఁ బ్రవేశించి యాయుధములతోఁ గొందఱు, దండములతోఁ గొందఱు, పోరాడసాగిరి. సంయుక్తయౌవనవంతు లిరువు రతిచమత్కారముగ ననేకులఁ జంపుచుండిరి. దేవి ప్రత్యక్షమై తమకు వర మొసఁగి స్వర్గసౌఖ్యములనొసఁగూర్చునని తలఁచియున్న భక్తుల కందఱకు సంయుక్తాదేవి ప్రత్యక్షమై యట్టిసౌఖ్యమాతే యొనగూర్చుచుండెను. ఇట్లు వీరిద్దఱు హస్తలాఘవ మొప్పఁజిత్ర విచిత్రములుగ ఖడ్గములఁ ద్రిప్పుచు శత్రువుల వ్రేటులఁ దప్పించుకొనుచు హోరాహోరిగఁ బోరుచున్న తరుణమున నడిజవ్వనమందున్న రాజపురుషుఁడొకఁడు ఖడ్గపాణియై శీఘ్రగమనంబునఁ గొండ నెక్కివచ్చుచు "ఓరీ! బలిమొసంగఁ దెచ్చినకన్యకకు సాహాయ్యముగ వచ్చినపురుషునకుఁ గుడిచేతిపై బలమగుగాయముతగులుటచే వామహస్తమునఁ బోరాడుచున్నాఁడు. ఆకన్నియయుమిక్కుటముగనలసియున్నది. కావునమీరందఱుత్సాహమునఁ బోరాడుఁడు" అను హెచ్చరికవాక్యములువిని తోడనే రివ్వునఁ బైకేతెంచి యచటనున్నవారినందఱి నొక్కుమ్మడినఱక నారంభించెను. రాజపురుషునిధాటి కోర్వఁజాలక ద్వారముబయటనున్న వామమార్గు లొకఁడు వోయినత్రోవను మఱియొకఁడేగక చెల్లాచెదరై పాఱఁదొడఁగిరి. అంత నతఁడావరణమందుఁ బ్రవేశించి రెండుచేతుల రెండుకత్తులఁబూని విశృంఖలలీల శత్రుధ్వంసముఁ జేయ నారంభించెను. సంయుక్తాయౌవనవంతులును దమకు వేఱొకసాహాయ్యము దొరకినదని యుత్సాహమున విజృంభించి రిపుశాసన మొనర్చుచుండఁ జేయునదిలేక లోపలివారునుఁ బిక్కబలిమిఁ జూపి పరువెత్తసాగిరి. అట్లు పరువెత్తుతరిఁ బ్రాకారపుగోడలెక్కి దుముకఁబోయి చీకటియగుటచే నొకచోటనుకొని వేఱొక

చోటఁబడి యనేకులు ప్రాణముల విడుచుచుండిరి. అంతఁ గొంతవడికిఁ దమ్మెదురించువా రెవరును లేకపోవుటచే సంయుక్తాయశావనవంతు లిద్దఱొకచోఁ జేరినిలిచియుండ రాజపురుషుండును జేరి వారిచేఁ బ్రణాతు లంది యాస్థలమంతయుఁ బీనుఁగుపెంటలతో భీభత్సముగ నున్నం దున వారివెంటఁగొని వేఱొకచోటికేగి యట యశావనవంతుని వాస్తమునకుఁ జికిత్స సేయ నొకకళేబరముపై బట్టలాగి దానిఁదడిపి బిగించుటకై జలమునకొఱకు వెతక నెచ్చోటను గానిపింపదయ్యెను. అత్తరి సంయుక్తమరల గుడిలోపలికేగి యటఁబురోహితుఁడు దేవికిఁ బ్రోక్షింపఁ బెట్టుకొనియున్న జలకమండలువును గొనితెచ్చెను. ఆనీటియం దాగుడ్డను దడిపి గాయముపై బిగించికట్టిరి అనంతర మా రాజపురుషుఁడు వారిద్దఱిందోడ్కొని కొండదిగి పురమువైపునం గొంతదూరమేగి యట నొకబయలు ప్రదేశమున నిర్మించియున్న డేరాలఁ బ్రవేశించి భటపరివృతమగు నొకగుడారమున యశావనవంతునునిచి నడుమనిర్మింపఁబడి యనేకులగుఁ గావలివారలతోఁ గూడుకొనియున్న మఱియొక గుడారమున నాకన్నియం దిగవిడచి వారిద్దఱవద్ద సెలవుగైకొని వెడలిపోయెను.



# పదియవ ప్రకరణము.



అటు లారాజపురుషుండు డేరాయందు దిగవిడచి చనుటతోడనే సంయుక్త యట నమర్పఁబడియున్న నొకపాన్పుమీఁదఁ గూరుచుండి తనకిక్కట్టులు సంభవించుటయు వానినన్నిటిఁ గడచి బయటపడుటయు మొదలుగాఁగల తలంపులు మనస్సునకురాఁ గొంతసేపటివఱకు నేమేమొ యాలోచించుకొనుచు నలసియున్నది గావునఁ బ్రత్యూష వాయువులు మేనుసోకుచుండ సుమారైదున్నరగంటవేళ నించుక నిద్రఁగూర్కెను. వెంటనే మంజరి చనుదెంచి తనపార్శ్వమునఁ గూరుచుండి నట్లొకకలగని „హా! మంజరీ! ఎన్నిదినములకు నిన్నుఁజూడఁగంటినే„ యని పలవరించుచు మంచముపై లేచికూరుచుండెను. అట్లు లేచి కనులుదెఱచి వీక్షించినతోడనే యాకన్యకుఁ గలిగిన సంతోషమేమని చెప్పుదును? నిజముగ మంజరవచ్చి తనకట్టెదుట నొకకుర్చీపైఁ గూరుచుండియేయుండెను. తోడనే సంభ్రమాస్వితయై మంజరిం గౌఁగిలించుకొని యబలకావున నించుక దుఃఖింపసాగెను. మంజరియు గొన్ని యనునయంపువాక్యంబుల నోదార్పఁ గలఁకదేరి "చెలీ! నీవునిక్కముగ మంజరివగుదువా? నాకేమియు భ్రాంతిచేకూరలేదుకదా? నీవిక్కడి కెట్లువచ్చితి?" వన„ సంయుక్తా! నీకింతభ్రమ యేటికి? నేను నిక్కముగ మంజరినే. నేనిక్కడి కెట్లువచ్చినదియు వచించెద వినుము. ఆనాఁడు నీవట్లు సోఫాపైనిదురింపఁ గొంతసేపైన వెనుక మేల్కొలిపెదఁగాకయని తలఁచుకొనుచు నేనును నట్లేనిదురించితి. అనంతరము సింహగర్జనమువలన మేల్కనిచూడ నీవచ్చోటఁ గానుపింపవైతివి. వెంటనే వెతకవలసినచోట్లనెల్లను వెతకి యెక్కడనుగానక జీవములపై నాసవదలుకొని దేశములమీఁద వెడలి నిన్నెట్లయినఁగనుగొన నిశ్చయించి పూరుషవేషమునఁగ్రు

మ్మరుట సురక్షితముకాదని పురుషవేషము దాల్చి సమయము పడినప్పుడు పనికివచ్చునను తలఁపున రెండుచేతికత్తులఁ బదిలపఱుచుకొని యప్పుడే బయలుదేఱితిని. అట్లు వెడలి ప్రతిగ్రామమునందు, నడుమఁ దటస్థపడు నరణ్యములందును నెమకుచు నచ్చటచ్చటఁ గొందఱివలన కొన్ని సమాచారంబులఁ దెలియుచు సంచరించుచుంటిని. అట్లు రెండుమూడు దినములు గడచిన వెనుక నొకయూరిలో మధురానగరమునకుఁ జేరువనున్న తిప్పపైని కాళికాశక్తికి సకలకళాపరిపూర్ణయు సుందరాంగియునగు రాచకన్నియ నొకతెను బలియిత్తురను సమాచారమువిని యట్టి యదృష్టవిహీనయగు కన్యయెవతియై యుండునాయని యనుకొనుచు శక్త్యానుసారము నామెను రక్షించుతలఁపున బయలుదేఱి యొక్కరీతి నడచుచు నీసాయంతనమున నే యొకపల్లియఁ జేరి యక్కడి వారల మధురాపురవృత్తాంతము లడుగ నక్కడికేడుమైళ్లదూరమున్నదని వక్కాణించిరి. ఆమాట విన్నవెంటనే మిక్కుటమగు నాకలియగుచున్నను,నంతవఱకు నడచియున్నందునఁ బాదములు సత్తువ దప్పియున్నను లక్ష్యముచేయక సాహసమూని రాజమార్గమునంబడి నడుచుచువచ్చి యీనగరము తొమ్మిదిగంటలకుఁ జేరితిని. అక్కడివార లింతకుమునుపే వామమార్గులందఱుఁ గొండకేగిరని వచింప దుఃఖార్తనై నాకష్టము ఫలింపదను తలఁపున నించుకయోచించి వెంటనే యొకమనుజుఁడు దారిఁగనుపఱుప గుట్టఁజేరవచ్చితిని. నేదగ్గరకేతెంచి చూచుటతోడనే తిప్పయంతయు దీపాలంకృతమై కడుమనోహరముగ నుండెను. కొందఱు గుంపుగఁజేరి యక్కడడుగుభాగమునఁ దప్పెఁ దాఁకి గేలింతలగొట్టుచుండిరి. వారేమి చేయుదురోయని దూరమందు నిలచి చూచుచుండ వారిత్రాగుడేమో వారేమోకాని దేవికొని పూజకాని యేమియుఁ గనిపింపవయ్యెను. అంతట పైనొకగుడి దీపాకాంతిమైయుంటఁగని యక్కడనేమిజరుగుచున్నదోయని క్రిందనున్న

వారికిఁ గొంచెము దూరముగఁ గొండనెక్కి గుడిని సమీపించుచుండ శంఖారావమును, జేగంటలచప్పుడులును నొక్కుమ్మడి వినవచ్చుచుండెను. గుడిఁజేరి తలుపులు దగ్గరకు వేసి యుండుటఁగాంచి యుపాయముగఁ దెఱచుకొని వీక్షింతుఁగదా! ఏమనవచింతు! నాపంచప్రాణములు పైవిపైకెగిరిపోయెను. ప్రకాశమైనయఖండము కాంతిఁగున నీవుధరించియున్న వస్త్రమును గుర్తించితిని గుర్తించినవెంటనే గుభాలునఁ దలుపులనెట్టుకొని వేఱొండాలోచింపక నిన్నుఁజంపఁగ ద్రియున్న వానిచేతినట్లే నఱికితిని. తరువాత జరిగినసంగతులు నీకును విశదమేగదా" యనివచించిన వెంటనే పులకీకృతాంగయై సాయుక్తతనచేతిం గౌగలించుకొని "హా! నాప్రాణపదమా! మృత్యువునోటఁబడనున్న నన్నురక్షించిన మహానుభావుండవు నీవేనా? నీయాఋణము నేనెట్లు దీర్చుకొనఁగలుగుదు? నీసాహసధైర్యములకే నేమని వచించుదానను. ఒక్కనిమిషమాలస్యమైన మనకిట్లు మరలఁ గలిసికొను భాగ్య ముండకపోవుఁగదా! నీవంటి బుద్ధిశాలినియగు సఖింబడిసినఁగదా లోకంబునమనంబోడికాంత లెట్టి యిక్కట్టులనైనఁ దప్పించుకొనఁగలుగుట" అని యానందపారవశ్యమున మాటలు తడబడఁ బల్కినవిని "నీవింతగావచింపనేల ?. మన మొకరినొకరు గాపాడు కొనకున్న నేటికి ? అదియటుండనిమ్ము. నీ వెట్టి లీకష్టములబారిఁబడితివో వచింపు" మన నాకన్నియ యిట్లనియె. "ఆనాఁడట్లు నీకనులమొసుటనే నిద్రించితిఁగదా. ప్రొద్దుపోయినందునను నాయాసము నొంది యున్నందువలనను వెంటనే గాఢముగ నిద్రపట్టెను. అంతనేమిజరిగినదో నాకుఁదెలియదుకాని మేల్కనిచూచునప్పటికి నొక గొప్పయరణ్య మధ్యమునఁ బాడుదేవాలయమందు నలుగురుస్త్రీలనడుమ నుంటిని. విభ్రాంతిగనుర 'నేనిక్కడికెట్లువచ్చితి ? మీరెవ' రనివారినడుగనొక్కరును నామాటకుఁ బ్రత్యుత్తరమీయరైరి. ఎంతపలుకరించినను మాడలాడకున్నతఱి బయటికేగుదమని బయలుదేఱ నన్నురానీక పట్టుకొనిరి.

"ఛీ! పాపినులారా! నాతండ్రిగారితోడఁ జెప్పి మిమ్ము శిక్ష సేయించెద" ననినను బెదరక నావచనములకుఁ బ్రత్యుత్తర మీయక నేనొనరింపఁబోవు కార్యములకు మాత్రమాటంకపఱచుచు వచ్చిరి. అత్తఱివారి బెదరించి బయటఁబడుదమని నాఖడ్గమునకై వెదకికొన నదియెచ్చోటను గాన్పింపదయ్యెను. అంత నేమిసేయుటకును దోఁపక వారిపైఁ గలియఁబడి తప్పించుకొన నెంచియుండ భయంకరాకారులగు నల్గురు మనుష్యులు మఱికొందఱిస్త్రీల వెంటఁగొనివచ్చి యటనుంచి జాగ్రత్తగఁ గనిపెట్టియుండుఁడని హెచ్చరిక చేసిపోయిరి. నిరాయుధనై ప్రబలమగు నాపదయందుంటఁ దెలిసికొని నాయుద్యానవనమున మంజరిం గలసి సమరించితిఁగదా! నన్నొంటరిగ నెట్లుకొనివచ్చిరి. ఒకవేళ నాసఖిం గడదేర్చి తెచ్చిరో లేక నామెయు నావలెనేనినురింప మోసపుచ్చి తెచ్చిరోయని పలుగతులనిన్ను నాపితరులఁదలఁచికొని యేడ్చితప్పించుకొని పోవుమార్గము వెదకుచుండ మఱియొకతెకొన్ని యాహారపదార్థములఁ గొని తెచ్చి నాముందుఁ బెట్టి తినుమనియెను. ఆమెయైన నాప్రశ్నలకు జవాబునిచ్చునేమో యనియడుగ నప్పటికిఁ దగిన ప్రత్యుత్తర మిచ్చినది కాని తామెవరైనది, నన్నేటికెక్కడకుఁ గొంపోవునది మొదలగువానికిఁ బ్రత్యుత్తరమీయదయ్యెను. ఈవిధమంతయుఁగాంచి నన్నేదోమోసముచేసి చంపఁగొనిపోవుచున్నారని దుఃఖార్తనై యెదుటఁబెట్టినవానిఁ దాకనందునఁ గొంతసేపటివఱకుంచి పిదపఁదీసివైచిరి. తదనంతరము నాయంతనముందును నట్లే తెచ్చి యియ్యానపుడును నాసినొల్లనైతిని. బాగుగఁ జీఁకటిపడినతరువాత నొక పాడుసవారియందు నన్నుఁ గూరుచుండఁబెట్టుకొని రాత్రి యంతయుఁ బ్రయాణమొనరించి తెల్లవాఱునప్పటికి మఱియొక గ్రామము జేర్చిరి. అచ్చటి కొకమానవుండరుదెంచి నమ్మకము కల్గునట్లు నాతోడ

తాము ఢిల్లీపురవాసులమనియు నొకయధికారి యాజ్ఞను జక్రవర్తికి బహుమానముగ నన్నుఁ గొంపోవుచున్నారమనియు వేఱొండప కారము సేయుటకుఁ గాదనియు దిగులుమాని యాహారము భుజించు చుండుమనియు వచించెను. వాఁడు చెప్పినదానివలన నాకునమ్మకము గలుగకపోయినను నాకలి మిక్కిలియగుటచే నానాఁడుఁదెచ్చిన యాహారపదార్థములఁ గొన్ని రుచిచూచితిని. ఇట్లు రాత్రులందుఁ బ్రయాణముసేయుచుఁ దెల్లవాఱినతోడనే యొకగ్రామమునందాగుచు నాలుగైదుదినములకు మధురాపురముసేర్చి యందొకవిశాలమగు నింటి లోఁ జీఁకటిగదియందె నన్నుంచిరి. ఆగదిలోనున్న దినములందనేక పురుషులేతెంచి తిరునాళ్ళప్రజలవలె ననుదినమును నన్నుఁజూచి పోవు చువచ్చిరి. మూఁడుదినములు గడచినపిమ్మట నల్గవనాఁడెవరు లేనితరు ణమున నొకతస్వి నాకడకేతెంచి విచారముతో "అమ్మా! నీవెంత దురదృష్టవంతురాలవు. నీవంటి సౌందర్యవతికిట్టి దుర్మరణంబు గలుగఁ జేసిన యాపరమేశ్వరు నేమనవలయు? కట్టా? నీవెట్లు లీదుష్టులబారిఁ బడితివి? నిన్ను రేపమావాస్యనాఁడిక్కడికించుక దూరముననున్న కాళికా శక్తికిసమర్పింపఁగోని చనుదెంచియున్నారు. వీరందఱునిన్ను మాటలాడు కొనుచుండవింటెని.నీవాహారమొల్లకుండి చావిలోనే మృతినొందుదువని రొకదురాత్ముఁడేతెంచి నీతోఁ గొన్ని మాయావాక్యములాడినాఁడఁట. అదంతయు వట్టియబద్ధము. అయ్యో! నిన్నుఁగాంచిన నాకువిచారము గలుగుచున్న "దని కన్నుల నీరుపెట్టుకొనెను. నేను నించుక దుఃఖించి మరల ధైర్యముఁదెచ్చుకొని యామెతో 'అమ్మా! నీవు నాపుణ్యవశం బున లభించితివి. నేనొకటివచించెద. అట్లు కావించితివా ధన్యురాల నగుదును. నాకుఁ జిన్నతనమునుండియుఁ గత్తిసామునందలవాటు గలదు. ఎటులైన నొకఖడ్గమును సంపాదించి తెచ్చియిచ్చితివా వీరంద ఱిపైఁదిరుగఁబడి తప్పించుకొనియైనఁ బోయెద. లేనిచోఁబోరాటమునఁ

ప్రాణములవిడిచెద. నా కిపుడు మరణము మాత్రము తప్పిపోవు' నని వల్లె యని యాకాంత వెడలిపోయెను. కాని మరల నింతవఱకును నాకంటికిఁ గానుపింపలేదు. ఆమె వెడలిపోవుటయు తడవుగ మఱికొందఱు నా దగ్గరకు వచ్చిరి. ఆమెకొఱకయి కొంత సేపటివఱకు నిరీక్షించుచుంటి నెంత సేపటికి రానందున మా సంభాషణ మెవ్వరో విని మరల నావద్దకు రానీకుండ నామెను బంధించిరో లేక యిట్టికుతంత్రములఁ బన్నినందులకు వధించిరోయని సాహాయ్యమొనరించువా రెవరును లేకుండుట వలన దుఃఖసాగరమున మునిఁగి తేలుచుఁ బడియుంటిని. అనంతరము గడచిన రాత్రి నను బల్లకియందుఁ గూరుచుండఁబెట్టుకొని గుడియందుఁ జేర్చిరి. గుడిలోవారు చేయఁదగిన కార్యముల వీక్షింపనోపక స్మృతి దప్పిపడిపోతిని. తరువాత వారేమి కావించిరో యది నాకుఁ దెలియదు. కొంత సేపటికి గంభీరారావమొకటి నాచెవులంబడఁ గన్నులు విప్పితిని. అప్పుడు నీవు నాచేతికి ఖడ్గ మొసంగితివి పిదప జరిగినదంతయు నీకుఁ దెలిసియే యున్నదిగదా." అని చెప్పి పరస్పరాశ్లేషణ బులోనర్చుకొనుచుఁ, జెప్పినదానినే మరలఁ జెప్పుకొనుచుఁ దమకట్టియిక్కట్టులఁ గలుగఁజేసిన విధిని దూరుచు సంభ్రమాన్వితలై మంజరీసంయుక్తలు తమ్ముఁ బిక్కడకుఁ జేర్చిన రాచపురుషుఁ డెవఁడాయని యతనిఁ గూర్చి ముచ్చటించుకొనుచుండిరి

# పదునొకండవ ప్రకరణము.

వారిప్పు రట్లుమాటలాడుకొనుచుండ బాగుగఁదెల్లవాఱి ప్రొద్దెక్కివచ్చుచుండెను. అత్తఱిదాసీనికరంబులు సంయుక్తకూరుచున్నగదిలోకివచ్చి ,,అమ్మా! ఏమిసెల,,వని ప్రతివారునడుగసాగిరి. అప్పుడీక్రింది సంభాషణ జరిగెను.

సంయుక్త.—మీరెవ్వరు?

దాసీ.—మీ కుపచారము లొనర్ప నియమింపఁబడిన దాసీలము.

సంయుక్త.—ఎవరియుత్తరువుప్రకార మిట్లేతెంచితిరి?

దాసీ.—మా రాజుగారి యానతివడువున.

సంయుక్త.—మీ రాజుగారెవరు?

దాసీ.—రాత్రి మిమ్ముఁ దోడ్కొనివచ్చినవారు.

సంయుక్త—ఆయన యేదేశపురాజు? ఇప్పు డెచటనున్నారు?

దాసీ.—ఆ సంగతులన్నియు వచించుటకు మాకధికారములేదు.

కానిందు మీ కేమిచేయవలయునో తెలుపుఁడని సంయుక్తయాజ్ఞాపించినట్లు సమస్తకృత్యముల నెఱవేర్చుచుండిరి. సంయుక్త యుత్కంఠతో నారాత్రి సహాయపడిన మహాత్ముని పేరు తెలియకపోయెనని విచారమున రెండురాత్రులుగడపెను. అంతమూఁడవనాఁడు కంచుకియొకం డరుదెంచి ,,అమ్మా! మీరు రేపుమీనగరమున కేగ వలయుఁగాన ప్రయాణమునకాయత్తమైయుండుఁ" డన "మీరాజుగారెక్కడ? ఆయనను సందర్శింపక మేమెట్లు పోవఁగల"మని మంజరీసంయుక్తలు పల్కిరి. అందులకుఁ గంచుకి ,,అమ్మా! మారాజుగారు వేఱొండవసరమగు పని మీఁదబోవలసి మమ్మందఱ నిక్కడనియోగించి రెండుమూఁడుదినములు గడచినవెనుక మిమ్ముకన్యాకుబ్జమునఁ జేర్పనాజ్ఞాపించి వార

ప్పుడే వెడలినారు. ఇఁక మనకు వారిదర్శనమగుట దుర్లభము. కావునఁ బ్రయాణముగుఁ,,డని తెలుప నిరుత్సాహచిత్తలై ,,మమ్ము విపత్తునుండి రక్షించినమహానుభావునిఁగాంచు భాగ్యము లేకపోయెనే,,యని చింతిం చుచుఁ బ్రయాణమునకటులేయని సమ్మతించిరి. అంత మఱునాఁడు ప్రయాణమునిశ్చయించినందునఁ గొన్ని దినములవఱకు సరిపోవునాహార సామగ్రుల బండ్లపై నెక్కించి రాణివాసపుదాసీలకుగాను మఱికొన్ని బండ్లు సన్నాహపఱిచి నౌకరులు సమస్తము సిద్ధము చేసియుంచిరి. ఆమ ఱునాఁడందఱుభోజనము చేసి సాయంతనము మూఁడుగంటలకుబయలు దేఱుదమనుకొనిరి. ఈలోపల మంజరీసంయుక్త లుచితవేషములూని ప్రయాణమునకు సంసిద్ధలైయుండిరి. మూఁడుగంట లగుటకు౯ోడనే సవారి వచ్చి తమయావాసమున కెదుటనిలువ వారిరువు రందు నాసీనులైరి. బోయి లాసవారి నెత్తుకొని ప్రయాణమైరి. ఈసవారికి నాల్గువైపుల దాసీలు కూరుచున్న పల్లకీలువచ్చుచుండెను. వీనియన్నింటికి ముందు శూరులగు భటులు త్తమాశ్వములపై నడచుచుండిరి. వెనుకవై పున మఱికొందఱు దాసీలుకూర్చున్న బండ్లును వానియనంతరము సామానుబండ్లును నన్నింటివెనుక నాశ్వికులును వచ్చుచుండిరి. ముం దువెన్కలఁగాకఁ గుడియెడమలందును బ్రసిద్ధులగు నాశ్వికులు కత్తు లును, దుపాకులను ధరించి చనుదెంచుచుండిరి. ఇట్టిమహావైభవ ముతో నడుమ నక్కడక్కడాగుచు నాలుగవనాఁడు చీఁకటిపడి యెని మిదిగంట లగునప్పటికి కన్యాకుబ్జనగరప్రాంతముఁ జేరి రి. అంతమరలఁ గంచుకి సంయుక్త సవారివద్దకేతెంచి "అమ్మా! మనమిప్పుడు మీనగ రమున కరుదెంచినాము. పట్టణ మింకొకమైలు దూరముగలదు. పల్లకీ బోయిలును, మఱికొందఱు దాసీలుదప్ప నితరులెవ్వరుఁ బురముఁ జొరవలదని మాన్యపుడాజ్ఞాపించి యున్నాఁడు. మేమందఱ మిక్కడి కైదుమైళ్ళదూరమున నిలిచియుండెదము. మీరు సురక్షితముగ నంతః

పురమునఁ జేరినవార్త మీ వెంటవచ్చిన దాసీలవలన మాకెఱుకపఱచుఁడు" అన "నాకింతటిసాయ మొనరించి మామన్నన లందక పోవుట న్యాయమగునా? మీ నృపుఁడిట్టి కట్టడి యాజ్ఞల నేయుద్దేశమునఁ గావించెనో గదా?" యని సంయుక్త పలికిన "నమ్మా! ఎప్పటికైన మాపైఁ గరుణయుంచుఁ డతి యోజాలు"నని యతికష్టముమీఁద నామెనొడంబఱిచి యాసవారిని మఱినాలుగు పల్లకీలను బురమునఁ జేరంబంచి కంచుకి మరల తనవారిఁ గలయ వారందఱు వెన్క కేగి నగరమున కైదుమైళ్ళ దూరమున నదీతీరమున విడిసియుండిరి. ఇఁట సంయుక్తయు పురమెల్లఁ దనకొఱకై పరితపించుచున్న ప్రజలతోఁ గూడి దీనదశయందు సాక్షాత్ లక్ష్మీవలెనందుఁ బ్రవేశించి పోవుచుండెను. పౌరులందఱు పల్లకీలఁ గాంచి వింతపడసాగిరి. రాజవీధియందుఁ గొంతదూర మేగినపిదపఁ గోట బహిర్ద్వారము సమీపింపగాఁ బల్లకీల నటనిలిపి యందఱు దిగుఁడని సంయుక్త చెప్పెను. వీరందఱు కోటముందు దిగుట వీక్షించి కావలివారలువచ్చి సంగతినడుగ సంయుక్త వచ్చినదని పరిచారకులు తెలిపిరి. వెంటనే యామెను జూడనైనఁ జూడక పరమానందమున ద్వారపాలకులు లోనికిఁ బఱువెత్తి యాసంగతి రాణివాసమున నెఱుకపఱిచిరి. ఈమాట విన్న వెంటనే తమకూఁతు రెక్కడనో మృతినొందెనని తలఁచి తమప్రాణములపై సహితమాశ వదలుకొని పడియున్న రాజదంపతులు చివాలున లేచి "యెక్కడెక్కడ? నిజముగ వచ్చినదా?" యని ప్రశ్నింపఁ బల్లకీ వచ్చి ద్వారమెదుట నున్నదని చెప్పుటతోడనే సంతోషవార్త దెచ్చిన యా ద్వారపాలకులపైఁ దమకంఠములందలి హారములవిసరివైచి త్వరితగమనంబున బయటిద్వారము కడకుఁ జనుదెంచుచుండిరి. తక్కిన చెలికత్తెలు నీవార్త విని యొడలెఱుఁగని సంతోషమునఁ బఱుగెత్తుకొని వచ్చుచుండిరి. ఈలోపల నిఁట సంయుక్తసవారి దిగి మొదటిద్వారము

గడచి కోఁడవద్వారము సమీపించుచుండెను. అప్పుడందఱు నొక పర్యాయముగఁ జనుదెంచి సంయుక్తం గౌఁగలించుకొని గొల్లుమనిరి. కొంతసేపటి కాసంరంభమణఁగి పట్టరాని సంతోషమున నానందబాష్పములు రాలుచుండ నందఱు నంతఃపురముఁ జేరిరి. రాజదంపతులు మహోల్లాసంబునఁ బరవశత్వమందుచుఁ గొంతసేపటి వఱకుఁగూఁతును గౌఁగిలించుకొనియేయుండి ముంగురులు దిద్దుచు "అమ్మా! తిరిగివచ్చి మాకండ్లయెదుటఁబడి మమ్మందఱఁ బ్రతికించితివా? తల్లీ! ఇన్నిదినంబులు మమ్మెడబాసి యొంటరిగ నెటులుంటివి?" యనియడుగఁ ఓదలిదండ్రులారా! ముందు మంజరిని మన్నింపుఁడు. మంజరిమూలముననే మిమ్మెల్లర మరలఁగాంచుభాగ్యము గల్గిన"దని తనవృత్తాంతమంతయు నెఱింగింప మితిలేని ప్రేమంబున నామెం దగ్గరకుఁదీసికొని "మంజరీ! నీసాహసకార్యములకు మేమేమని పొగడువారము? ఆపత్కాలంబునకు మిత్రుఁడనుమాట నీవె సార్థకపఱచితివి. నాముద్దుకూఁతును రక్షించి మమ్మెల్లరఁ బ్రతికించితివి. మీనెయ్యమును సార్థకముగావించుకొంటివి. భూమిపై బ్రతికినంతకాలము మీకిట్టిస్నేహమే వర్ధిల్లుఁగా" కని పలువిధంబులనుతించి వెంటవచ్చినతక్కిన వారల కుపచారము లొనర్పఁ దమపరిచారికాజనంబుల నియోగించిరి. ఇట్లు కొంతవడినిష్టగోష్ఠివినోదంబులఁగడపి యనంతరము మృష్టాహారములభుజించి యందఱు నొక్కస్థలమందే శయనించిరి. అదివఱకుఁ గంటినిండ నిద్రలేనందున నందఱు హాయిగనిదురింప సాగిరి; కాని సంయుక్తవెంటవచ్చిన నిపుణిక యనునది మేలుకొనియుండి రాజకొమారికంగనిపెట్టియుండెను. సంయుక్తయుఁబరున్నను నిద్రరానందునఁ దనమంచముపై లేచికూర్చుండి తమ కటసహాయపడిన మహాత్మునిఁ దిరిగిసందర్శించుభాగ్యము గలుగకపోయెనే యని చింతించుచుఁ, బ్రక్కపైనుండిలేచి యిటునటు సంచరించుచు మరలఁ బాన్పుఁజేరి పవళించి వెండియు లేచి తిరుగుచు

నాందోళమున నుండెను. ఈవిధమంతయుఁ గాంచుచున్న నిపుణిక లేచి రాజపుత్రికను సమీపించి “అమ్మా! నీవింకను మేలుకొనియేయున్నావా?” అనియడిగెను. అందులకు సంయుక్త “అవును నాకింకను నిదుర రాలేదు. ఇటురమ్మ”ని తనదగ్గరకుఁ బిలచెను. అప్పుడు వారిట్లు సంభాషింపమొదలిడిరి. నిపు: “అమ్మా! ఇంతసఱకు నేమాలోచించుచుంటివి?” సంయు: “ఏమియులేదు. నిద్రవచ్చునేమోయని యిటునటుఁ దిరుగుచున్నాను. అంతియేగాక మమ్ముఘోరవిపత్సముద్రమునుండి దరిఁజేర్చిన యాపరోపకారపారీణుఁ గన్నులారఁ గాంచుటకైనను వీలుకలుగక పోయెఁగదాయనుచింత నామనంబున దృఢముగ నాటుకొనియున్నది. తుదకాయుత్తముని పేరైన విననోచుకోనైతిగదా!” అని హీనస్వరంబునఁ బలుక నంతవఱ కాతస్వపడుచున్న సంతాపముఁ జూచుచున్నది గాన జాలినొంది మెల్లగ నిపుణికయిట్లనియె.

“అమ్మా! ఇత్తఱి నీయవస్థఁజూడ నాకువిచారము గలుగుచున్నది తమసంగతి మీతో వచింపవలదని మారాజుగారు గట్టియుత్తరువు సేసియున్నారు. అయినను నీతో నిపుడు వచించెద; ఈరహస్యమెచటను బయలుపెట్టకుము. ఆరాత్రి మిముఁదోడ్కొనివచ్చినయతఁడు ప్రస్తుతము డిల్లీనిఁ బాలించుచున్న పృథివిరాజు. ఉన్నట్టులుండి యొకనాఁడు కొంతసేన నెచటికోపంపి యాక్షణమందే మమ్మందఱ వెంటఁగొని మిమ్ము దిగవిడచినచోటి కారాత్రియేవచ్చు ఘనివారెల్లరు డేరాలు మొదలగునవి నిర్మించుతొందరలో నుండ మాలో నెవరికి వచింపకెక్కడికో పోయి సుమారునాలుగు గంటలవేళకు మిమ్ముఁగొనివచ్చి యటడించి మీకు సకలోపచారములుసేయ మాకాజ్ఞాపించి రెండుమూఁడుదినములు గడచినపిమ్మటఁ గన్యాకుబ్జముఁ జేర్పవలసినదిగాఁ గంచుకి మొదలగువారికిఁ దెలిపి తానప్పుడెకొంతసైన్యమును వెంటఁగొని యెచటికో పోయినాఁడు. ఎక్కడికేగినది నిజముమాకుఁ దెలియదు

కాని మనవెంటవచ్చిన సేనాపతులకు మాత్రము తెలియును." అని పృథివీరాజువృత్తాంత మెఱుకపఱపగా సంయుక్త విచారమునఁ దనలో "హా! నేనెంతమందభాగ్యురాలనైతి! చేతికందిన నిధానమును బోఁగొట్టుకొన్నటులయ్యెఁగదా నాబ్రతుకు! ఇన్నిదినములపర్యంత మేమహానుభావునిదర్శింప నభిలషించియుంటినో, యట్టి నామనోకాంతుఁడు చేరువకే తేరఁదిన్నఁగఁజూచుకొను భాగ్యముకూడ లభింపకపోయె. ఛీ! నాజడబుద్ధి! కానిమ్ము. గడచినదాని కింతగవగవ నేల?" అని లోపలిగుట్టును నిపుణిక తెలిసికొన పోవునను తలఁపున నప్పటి కేమియు మాటలాడక నిద్రవచ్చుచున్నదని నిపుణికను బంపి తానును గొంతతడవునకు నిదురించెను. తరువాత జయచంద్రుఁడు కూఁతురువచ్చినదను సంతసమున నామఱునాఁడు మొదలనుదినమును బండుగ లొనరించుచుఁ ద్వరలో నామెకు వివాహముగావింప నిశ్చయించుకొని సమస్తదేశాధిపతులకు లేఖలపంపఁదొడఁగెను. సంయుక్త వెంటవచ్చిన పరిచారిక లిఁక మేము మానగరముకేగెదము సెలవొసంగుఁడని రాణి మొదలగువారి నడుగ స్వయంవరమగు వఱకునుండుఁడని నిర్బంధించిరిగాని కొన్ని యూఁటంకములుచెప్పి సమ్మతింపక సముచితసత్కారములంది సంయుక్త మొదలగువారూరిబయటివఱకువచ్చి సాగనంప బయలుదేఱిపోయి దారిలోఁదమ కొఱకై కాచుకొనియున్న వారలఁగలసి జరిగినసమాచారములన్నియు సేనాపతులకుఁ దెలియఁబఱచిరి. అంత నక్కడిసేనాని కొందఱిభటులఁ దోడితెచ్చి యాపరిచారికాజనంబుల స్వపురంబునకుఁ బంచి మిగతసేన నుంగూడుకొని తన రాజునకుఁ దోడ్పడఁబోయెను.



# పండ్రెండవ ప్రకరణము.



పై ప్రకరణమున వచించిన వృత్తాంతములు జరుగుకాలమందే మధురాపురమునకెగువ రెండామడలదూరమందలి కాళిందీతీరప్రదేశము లతిభయంకరయుద్ధమున కావాసములై యుండెను. ఆప్రదేశములందు సుమారు ముప్పదివేలసైన్యముతో నెప్పుడు సమయముదొరకునా యెప్పు డార్యావర్తమును మ్రింగివేయుదునా యని కుతుబుద్దీనను మహమ్మదీయ సేనానాయకుఁడు గాచుకొనియుండెను. ఆప్రదేశము యమునకొండలగుండఁ బ్రవహించుచున్నందున నడుమఁ గొన్ని కొండలు ద్వీపకల్పములుగ మాఱియుండెను. ఎప్పుడుపట్టిననపుడు శత్రువులు ప్రవేశించుటకు సులభముగానట్టి ద్వీపకల్పముగనున్న నొకకొండపై ముప్పదివేలసైన్యముండుటకుఁదగినంత విశాలమగునావరణముఁగట్టించి కుతుబుద్దీ నందు నివసించియుండెను. ఈయావరణమునకు దక్షిణఁపుఁ బార్శ్వమునమాత్ర మొక గొప్పబలిష్ఠమగు ద్వారముకలదు. శత్రువులెవ్వరైన లోపలఁబ్రవేశింప నెంచినచో నది నీది దక్షిణఁపువాకిట బోవలయుఁగాని వేఱొండుమార్గము లేదు. ఆవరణపుగోడ నాగజెముడు మొదలగుముండ్లదుబ్బులచే నిర్మింపఁబడి నాలుగుగజములయెత్తు గలిగి యుండెను. దక్షిణమందలి ద్వారముమాత్ర మడుసుతోఁ గట్టబడి యుండెను. అచటశూరులగుభటు లనేకులు గావలియుందురు. మఱి యునావరణములోపలఁ గంచె కొకగజమెత్తుగ నుండునట్లు మట్టిబురుజులనందందు గట్టించి వానిపై ఫిరంగులఁ బెట్టించి యనేకసిపాయిలఁ గావలియుంచియుండెను. ఈకట్టుదిట్టములవలన సైన్యమంతయు నొకబలిష్ఠమగు దుర్గమున నున్నట్లేయుండెను. వెండియు సైన్యమునకువలసిన యాహారసామగ్రుల లోనఁ జేర్చుకొనుటకును దమవారి ననాయాసముగ

దాటించుకొనుటకును వీలుగనుండునట్లు తేలికలగు పెద్దపెద్ద వృక్షముల ననేకముల నఱకించి తెప్పించి తెప్పలుగట్టించి నీటఁద్రోయించి వానిపై ననేకభటుల గావలియుంచియుండిరి. ప్రతితెప్పయు రెండువందల మనుష్యులభారమును మోయఁగలిగినదిగా నుండెను. దూరముందున్న గొప్పగొప్పగ్రామములకనిచి భటులచేతఁ గావలసిన సామగ్రులఁ దెప్పించుకొనుచు వేగులవారివలన నార్యావర్తపురాజుల తెఱంగుఁదెలియుచు నతిజాగరూకుఁడై యెప్పటివార్త లప్పుడు సుల్తానుగారి కెఱుకపఱచుచు రణమునకై గుతుబుద్దీను వేచియుండెను. అట్టితరుణమున నొకనాఁటినిశీథమున రెండుగంటలవేళ నార్యసైన్యములు కొన్ని నదియందుదిగి నిశ్శబ్దముగఁ దీరముఁ జేరవచ్చుచుండెను. అదివఱకాస్థలమున మ్లేచ్ఛులు రెండునెలలనుండి విడిసియుండ నేతొందరలును గలుగకపోవుటచే సేనాపతి హాయిగ ద్రాగిపరుండెను. తక్కుంగల సైన్యభటులును దమతమశస్త్రాస్త్రముల నెక్కడివక్కడఁ బాఱవైచి నిద్రాపరవశులై యుండిరి. తెప్పలపైఁ గావలిగాచువారుసహిత మొకరిద్దఱినన్నిటికి గావలింబెట్టి తాములోపలఁజేరి పరుండియుండిరి. ఆ యొకరిద్దఱును నదీతీరముననొకయిసుకతిన్నెపైఁబరుండి చల్లగాలికి హాయిగ నిదురవోయిరి. బురుజులన్నియు భటవిహీనములై నిద్దురఁబోవుచుండెను. అట్టి సమయమున పైనిచెప్పిన యనార్యసైన్యములు నదీతీరమున బారులుదీఱి నిలిచియుండఁ గొందఱుభటులు నది నీది మ్లేచ్ఛులున్న వైపుఁజేరి యట నిదురించియున్న నిద్దఱ దీర్ఘనిద్రాసౌఖ్యమును భవింపుఁడని నీటఁబాఱవైచి తమ్మునాటంకపఱచువా రొక్కరును గానరానందునఁ దెప్పల నవతలకుఁగొంపోయి తమసేనాభటులనెక్కించుకొనివచ్చి మహమ్మదీయుల ప్రాకారముచుట్టుఁ జేర్చుచుండిరి. ఆర్యసేనాపతి దానిద్వారముఁగనిపెట్టి సేనయందు మూఁడవవంతుదక్షిణమును ముట్టడింపఁబంపి తక్కిన సైన్యమును దక్కినమూఁడు పార్శ్వముల

ముట్టడింప నాజ్ఞాపించెను. మఱియు బయటనుండి మహమ్మదీయులకు సహాయ మొనర్పవచ్చినవారి నడ్డగించుటకుగాను మఱికొంత సైన్యము నవతలితీరముననే యుంచెను. ఏర్పఱుచుకొన్న ప్రకార మెక్కడివా రక్కడం జేరియున్న పిదప సేనాపతి సంజ్ఞనొనర్ప నార్యభటులందఱు నొక్కపర్యాయముగం దుపాకుల మ్రోయించి దక్షిణద్వారపు ముట్టడిని బ్రారంభించిరి. తుపాకుల మ్రోతలకు లోపలివారెల్లరు భయభ్రాంతచిత్తులై లేచి తమ తమ యాయుధములం దుపాకులం బూని ద్వారముకడ కేగిరి. బురుజులపై నుండవలసినవారును మేల్కని నిద్రకండ్లతో మెట్లెక్కం బోయిపడుచు నతిప్రయత్నముమీఁదం బైకిచేరి బందూకులతో నార్యసేనలం గాల్వసాగిరి. బురుజుపైనుండివచ్చు బందూకుల వ్రేటుల కనేకులు నీటంబడి కొట్టుకొనిపోవుచుండిరి. ఎట్టులయినను లోపలవారి నుక్కడించు కోరికచే నార్యులు శత్రువుల వ్రేటులకు లక్ష్యము సేయక తమ వారలు కుప్పలుగం గూలుచున్నను ధైర్యము వీడక సాహసముతో మ్లేచ్ఛులపై నగ్నివర్షము గురిపించుచు మహాఘోరముగ యుద్ధమొనరించుచుండిరి. లోపలివారు ప్రయోగించు బందూకులగుండ్లన్నియు యమునంబడి మహాభయంకరముగ శబ్దించుచుండెను. ఆవరణములోపలం జేరుటకై దక్షిణమందలివారలును హోహారా హోహారిగిం బోరాడుచుండిరి. ఈతరుణమందే మహమ్మదీయులకొఱకు సామానుబండ్లుకొన్ని వచ్చి యవతలిగట్టుం జేరెను. అక్కడనున్నవారు వచ్చినవారి ననాయాసముగ నోడించి బండ్లనన్నింటిం దమవశముగావించుకొనిరి. ఈప్రకారము మూండుదినములవఱ కతిఘోరముగం బోరాడుచుండ లోపలివారల కాహారపదార్థములు తక్కువగుటచే వారందఱు భీతినొందసాగిరి. అట్లయ్యును రెండుమూండుదినములవఱకు మ్లేచ్ఛులు పరాక్రమముతోడనే పోరుచుండిరి. ఎట్లును బయటివస్తువులు లోపలికివచ్చుమార్గము లేనందునం దమ కపజయము కలుగు

ననియే కుతుబుద్దీ తలపోయుచుండెను. మఱిరెండు దినములకు రణసంరంభమువలనను క్షుద్బాధవలనను సైన్యములో మూఁడు వంతులు నష్టమయ్యెను. ఆసమయమందే రాజపురుషుండొకఁడు మఱి కొంతసేనతో నార్యులకుఁదోడ్పడవచ్చి హెచ్చరికఁ గలుగఁజేసెను. రాజదర్శనమువల్లనుప్పొంగి యార్యసేనాగరము విజృంభించి పనిఁజేయసాగెను. ఎట్టకేలకు దక్షిణమండలివారు ద్వారమును నాశనముఁజేసి లోపలఁ బ్రవేశించి మ్లేచ్ఛులధ్వంసముఁ జేయఁజొచ్చిరి. తనవారంద ఱిట్లుమృతి నొందుచుండుట వీక్షించి యింకనాలస్యమొనరించిన ప్రాణాపాయము గలుగునని కుతుబుద్దీ శత్రువులకంటఁబడకుండఁ దప్పించుకొని పరువెత్తెను. హెచ్చరికఁగలుగఁజేయువారు కానరానందున మ్లేచ్ఛులునుజెల్లాచెదరై యిష్టమువచ్చినట్లు పరువెత్తసాగిరి. కొందఱు కంచెలంబడి మడసిరి. మఱికొందఱు బయటికేతెంచి యట కాచుకొనియున్న ఆర్యులవాతఁబడి చచ్చిరి. కొంతసేపగునప్పటికి శత్రుసైన్యము నాశనమై యెదిరించువారు లేకపోవుటచే యుద్ధ మాపుదలచేయఁబడెను. మూఁడువేలమహామ్మదీయభటులు ఖైదీలుగఁ బట్టుకొనఁబడిరి. శత్రువుల తుపాకులు, నాయుధములుఁ, దక్కినయుద్ధసామగ్రులన్నియు నార్యుల పాలఁబడెను. ఇట్టి మహావిజయముతో నారాజచంద్రుఁడు తన సైన్యముం గూడుకొని నిజరాజధానికిఁ బయనమైపోయెను.



---

# పదుమూఁడవ ప్రకరణము.



"అబ్బబ్బ! ఈదినముదయముననే లేచి యెవరిముఖముగాంచితినో కాని నాకన్నియుఁ జిక్కులే సంప్రాప్తములైనవి. మాకక్కడఁ బల్లెలందు మ్లేచ్ఛులొనరించుచున్న యార్భాటములెటులున్నవో యిక్కడ నీ స్వయంవరమునకు వచ్చిన రాజులయార్భాటము లటులున్నవి. సుమారు రెండుజాములవేళఁ దూర్పువీధివదలితి. మూఁడుజాములు తిరిగిపోయినవి. ఇంతవఱకు రాజద్వారము చేరుటకు వీలుపడలేదుగదా? కొండలవలె తండతండములై పరువెత్తుకొనివచ్చు నీ పాడుబగ్గీలు నేఁడు నాదుంపఁద్రెంపినవి. గోడ్లమీఁదనీళ్లుచల్లుబండ్లకొత్తుకొడుకులెప్పుడుచల్లిరోగాని యీగుఱ్ఱముల రాపిడివలన నేలంతయు నెండిపోయి దుమ్ము వెదఁజల్లుచున్నది. శకటములసంరంభముచే నెగురుధూళియంతయు వీధులనిండఁ గ్రమ్ముకొని దారిఁగాన్పింపకుండఁ జేయుటయేగాక ముక్కులలోఁగన్నులలోఁ జొఱబడి దృష్టినిఁగూడ నాశనముఁజేసివైచినది. రాత్రియంతయునిద్రఁగాచిన వానికింబలెఁ గన్నులు భగ్గునమండుకొని పోవుచున్నవి. ఈయెడ తెగనిగుఱ్ఱముల గిట్టలవలనఁగలుగు పటపటధ్వనులచేఁ జెవులు గడియలుపడిపోయినవి. ఒకొక్కవరుస వచ్చి కడచిపోవువఱకు నీ మిడియెండలో నిలువవలసివచ్చుటచే నాతాతలుదిగివచ్చుచున్నారు. పైసినెత్తి క్రిందకాళ్లు మలమలమాడుచుండ వచ్చినసవారీలవరుస పోవువఱకుఁ బ్రాణములబిగఁబట్టుకొని నిలువవలసినదేగాని కొంచెమిటునటుఁగదలిన నీగుఱ్ఱముల కాళ్లక్రిందఁబడి యీల్గుదునోయనుభయమే. పోనీ యేపంచనైనఁజేరుదుమాయన్న నన్నింటియందు ద్వారపాలకులె. దూరముననుండఁగనే 'యెవరువా'రని కేకలువైచుచు వెడలగొట్టుదురుగాని పాపమెవఁడో ముసలిబ్రాహ్మణుఁ

డని దయఁదలఁచిపిలుము ముందవాఁడొక్కఁడుఁ గానరాఁడు. అయ్యో! రాకరాక వివాహసమయములో మేమేలవచ్చితిమి? ఇప్పుడీజయచంద్రుఁడు మావాక్యములాలించి మమ్ముఁబీడించుచున్న మ్లేచ్ఛులఁ బాఱఁదోలునని తోఁచదు. దేశమందలి ప్రజలు క్రూరులగు మ్లేచ్ఛులబారింబడి ప్రాణమానములఁ గోల్పోవుచుండ నీరాజేమియుఁ బట్టించుకొనకుండ నిట్లుత్సవములలో మునిఁగియుండుట మాబోటిపౌరుల దురదృష్టమే కాని వేఱొండుకాదు. అయ్యో! ఈరోజున నాగ్రహచారము బాగుగనుండలేదు. నేనిటు మొత్తుకొనుచుండఁగనే మఱియొక సైన్యము సంప్రాప్తమైనదే. నాయనో! ఇవియెక్కడిగుఱ్ఱాలు! రాజమార్గముపట్టుకుండఁజనుదెంచుచున్నవి. ఇంతకుముందు చనుదెంచిన కోసలపతి సేనాసంరంభములో నావెంటవచ్చిన యితరగ్రామస్థులు వేఱైపోయినారు. ఈసంరంభములో నాకు నాజీవములకు నెడఁబాటుకలుగునట్టులున్నది. ఓయిదేవుఁడా! ఈసంకులమునుండి తప్పించి నావారిఁగనుఁబఱిచికొనఁ జేర్చితివా యీవివాహమైన నగరమంతయు నెమ్మదిపడువఱకు బయటనెక్కడ యనుగ్గైనఁ బెట్టను. ఓహో! అప్పుడే చేరువకువచ్చినవే గుఱ్ఱములు" అనియొకము సలిబ్రాహ్మణుఁడు తనచేరువనున్న వారివలన మార్గమునఁజను రాజవరులవృత్తాంత మడిగి తెలిసికొనుచు నాయాసముచు దీనత్వమును దోఁపఁగ న్యాకుబ్జనగర రాజవీధిఁ ద్రిమ్మరుచుండెను. తిరుగుచు నప్పుడు వచ్చుచున్న రాజుగా రెవరనియడుగఁ జెంతనున్న యొకఁడు కాశ్మీరపు రాజని బదులుచెప్పెను. అంత నాన్నృపునివీక్షించు నభిలాషతోఁ దాను ప్రక్కకొదిగి నిలచియుండెను. తరువాత నొకబలిష్ఠమగు నశ్వముపై రౌతుకూరుచుండి వీధివెడల్పున నాడించుకొనుచువచ్చెను. వానివెన్నంట నొకయుత్తమపారసీకంబుపై సేనాపతివచ్చుచుండెను. వానియనంతరము బారులుగట్టి యాశ్వికులు కొందఱు దెంచుచుండిరి. వారివెన్నంటి మఱియొకసేనాని కాంభోజము నెక్కి చనుదెంచుచుండెను.

తదనంతరము శ్వేతాశ్వముల నారోహించి భటులనేకులు ఖడ్గపాణులై యేఁతెంచుచుండిరి. వీరివెనుక శ్రేష్ఠములగు వనాయుజములపై నక్షౌహిణీపతులు ముందునడువఁ గొంతసైన్యము శిబిమై చనుదెంచుచుండెను. ఈసేనానంతర మాజానేయము లెనిమిదింటిచే బంధింపఁబడిన రాజుగారి బగ్గివచ్చుచుండెను. ప్రతియశ్వముపై నొక్కొక్క భటుఁడు కూరుచుండి తోలుచుండెను. అందుఁదనప్రధానమంత్రితోఁ గన్యాకుబ్జనగరవైభవమునుగూర్చి ముచ్చటించుకొనుచు కాశ్మీరమహారాజుగారాసీనులై యుండిరి. వీరియనంతరము ఉపమంత్రులు, రాజ్యమందలి ముఖ్యాధికారులు మొదలగువారు కూరుచున్న బగ్గీలు వరుసలుదీఱి వచ్చుచుండెను. వీనికన్నిఁటివెనుక మఱియొకసేనాసియు మఱికొంతసేనయుఁ బాహ్లీకములపై వచ్చుచుండెను. ఈసందడి తగ్గువఱకు పైనఁబేర్కొన్న బ్రాహ్మణుఁడు తా నున్నచోటనేయుండి యది తగ్గిపోయినతోడనే మరల బయలుదేఱి నడచుచుఁ గొంతదూరమేగి పిదపఁ దనకొఱకై నలుదిక్కులఁ బరికించుచు నిలువంబడియున్న తనవారలఁగలసికొని, "నాయనలారా! నాయదృష్టమున నేఁడు మిమ్ముఁ గాంచఁగల్గితి. ఇక్కడ నిబగ్గిలక్రిందఁబడి చచ్చుటకింకొ మనగ్రామములందు మ్లేచ్ఛులు పోయు వేడనూనియలచేతఁ జచ్చుటొ మెలనితోఁచుచున్నది. మనకిఁక నెట్లును బ్రతుకు తెరువులేదు. అతనికేమి? ఏచింతలేక పౌరులు మొరలాలకింపక జయచంద్రుఁడు హాయిగ బెండ్లిఁగావించుకొనుచున్నాఁడు. ఇట్టిరాజు బ్రతికిననేమి? చచ్చిననేమి? మనమీరాజ్యము వదలిపోయిన బ్రతుకుదుమేమో కాని యిక్కడేయున్నటులైన వట్టిదే. మీ కేమైన రాజుగారి దర్శనము లభించినదా?

పౌరు.—లేదు. ఈతొందరలన్నియు నడఁగినతర్వాత నేమైన యీ రాజు మనదిక్కు చూచునేమొ.

బ్రాహ్మ.—ఈ కల్లోలము లణఁగవలసిన యవసరమేమి? ఈలోపలనే బూడిదెరాసులతోఁ గూడుకొని మనపల్లెలన్నియు నెమ్మదిగ నుండఁగలవు.

పౌరు.—అయిన మనమిప్పు డేమిచేయుదము?

బ్రాహ్మ.—అందఱముఁ గట్టఁగట్టుకొని యొక్కపర్యాయముగ యమునలో దూకుదము.

పౌరు.—కాసిందు. మనఘోషలు ప్రధానితో విన్నవించుకొందము పదండి. అతఁ డేమైన సాహాయ్య మొనరించిన సరి, లేకున్న నీవు చెప్పినట్లే నదిలో దుముకుదము.

అని మాటలాడుకొని వారందఱుఁ బ్రధానింజూడ వెడలిపో యిరి. కూఁతురువచ్చినదను సంతోషమునఁ ద్వరలో నామెకు వివాహ మొనర్ప జయచంద్రుఁడు సకలదేశములనృపులకు లేఖలనంపుచుండె నని యిదివఱకే లిఖించియుంటిఁగదా. తన్మహోత్సవమునకైఁ గన్యాకుబ్జము బాగుగ నలంకరింపఁబడెను. అత్యున్నతములై వరుసలుతీఱియున్న సౌధపంక్తులు క్రొత్తగ వేయఁబడిన సున్నముచే స్వచ్ఛమగు వెండికొండల బారును దలఁపునకుఁ దెచ్చుచుండెను. ప్రతిమందిరమునకు వేఱ్వేఱుగ గాక రెండుప్రక్కలసౌధంపువరుసల యొకకొననుండిమఱియొకకొనవఱకు బచ్చనియాకుతోరణములు వ్రేలాడఁగట్టిరి. రాజవీధియందు బండ్లు మొదలగునవి నడచునట్టి మధ్యమార్గమునందుగాక ప్రత్యేకముగ మనుష్యులుమాత్రమే నడుచుటకుగాను సౌధపంక్తుల కంటుకొని యుండునట్లు నిర్మింపఁబడిన ప్రక్కదారులపొడుగున దాళ్వారము (అనగా గ్యాలరీ)లఁ బెట్టించి వానిపై క్రిందినుండి మీదివఱకుఁ జెక్కలగపడని యంతదట్టముగ బలురకములగు బూలచెట్లతో ట్లుంచఁబడియుండుటచేవీధి యందొకవైపున నిల్చి చూచువారలకుఁ బచ్చనిపొదలతోఁ గూడుకొని

యుండుకొండలలోయ తలఁపునకు వచ్చుచుండెను. ప్రక్కదారులు పూలమొక్కలచే నిండియుండుటవలన మధ్యమార్గమందిటునటునొకగజము మేర జనులరాకపోకలకు వదలి వీథిపొడుగునను దగ్గఱదగ్గఱగ నెత్తైన స్తంభములఁబాతి వానియగ్రములకు సమాంతరముగ నుండునట్లుతీగెల బిగించిరి. మఱియు నొకవరుసయందలి మొదటికంబపు చివరకును దానియెదుటివరుసయందలి రెండవస్తంభాగ్రమునకును మరల మొదటి వరుసయందలి మూఁడవదానికొనకును నిట్లుక్రమముగ నన్ని స్తంభముల యగ్రములకు గొంచెము మందములగు తీగెల నంటగట్టిరి. అట్లు కట్టినతీగెల ప్రతియడుగునందు మైనపువత్తులతో గూడుకొన్న గుండ్రములగు నాకుపచ్చరంగుగల చిన్నచిన్న యద్దపుఁగలశముల వ్రేలాడదీయుటయేగాక చివరల బిగించినతీగె లొండొంటితోఁ గలియుభాగమున గాలిదీపము లుంచుటకు వీలైన పెద్దపెద్ద గులోబులు వ్రేలాడగట్టి యుంచిరి. కలశములు గులోబులు నాకుపచ్చరంగుగల వగుటచే గాత్రులందు దీపములు వెలిగించుటతోడనే వానికాంతులును పూలమొక్కల కాంతులును నేకమై వీథియంతయు శోభాయమానమై లక్ష్మీ విలాసస్థానమో యన రాజిల్లుచుండును. రాజుగారి దివాణమునందేగాక నగరమం దెక్కడఁజూచినను చెవులు గింగురుమన శుభవాద్యములు మ్రోగుచుండెను. తక్కినవీథులును గొంచె మించుమించుగ నిటులే యలంకృతములై యుండెను. జయచంద్రుఁడు సమస్తదేశాధిపతులకు శుభలేఖలనంపెగాని తన పూర్వవైరము తలఁచి ఢిల్లీపతికిమాత్రము వర్తమాన మంపక తిరస్కారభావముననుండెను. అటులుండుటయే కాక చక్రవర్తిని మఱింతయవమానపఱచుటకై రాతివిగ్రహము నొకదానిఁ జేయించి దానికి ఢిల్లీపతినామమిడి కోటబహిర్ద్వారమునఁ గావలివానివలెఁ బెట్టించెను. ఈవార్తవిని నగరమంతయు నల్లకల్లోలము

కాసాగెను. కొందఱు జయచంద్రున కిదియేమి వెఱ్ఱి? ఇట్లుచేయుట తగునా యనువారును, కొందఱువీనికిఁ బోవుకాలము సమీపించినది కావుననే యిట్టిబుద్ధిపుట్టిన దనువారును, కొందఱు మనకిక రణముదప్ప దనువారునునై జనులెల్లరు వీధులందు గుంపులుగుంపులుగఁగూడి మాటలాడుకొనఁజొచ్చిరి. దుర్మార్గులగువారుమాత్రమతని మఱింత ప్రోత్సాహము చేయుచుండిరి. నృపుఁడును దుష్కార్యములకు నుత్సాహము చేయించుచుండెను.



# పదునాల్గవ ప్రకరణము.

జయచంద్రుని వృత్తాంత మటులుంచి యిఁక సంయుక్తగూర్చి కొంతవిచారింతము. ప్రాణోపద్రవమునుండి తన్నుగాపాడిన మహాత్ముఁడు పృథ్వీరాజని నిపుణికవలన విన్ననాఁటంగోలెఁ బాచప్రాణములతనిపై నిడుకొని స్వయంవరమున కతఁడువచ్చునో రాఁడో యనుతలఁపున వగలఁ బొగులుచు నిద్రాహారములయెడ సహితమనాదరణఁ జూపుచుఁ దనయుపాధ్యాయుని సంగతిగూడ తెలియనందున నుత్కంఠయై దినములు గడపుచుండెను. బయటికేగివచ్చు ప్రతిపరిచారికను జక్రవర్తి యేమెంచెనాయని యడుగుచుండెను. ఇట్లు ప్రాణపదముగ నెంచుకొనుచున్న నారాజునెడలఁ దనతండ్రికావించిన యకార్యముఁ గూర్చి తెలిసినటులైన నామెహృదయ మెట్టిదశయందుండునో వచింపనలవిగాదుగదా? ఇటులుండ మంజరి చనుదెంచి జరుగుచున్న సంగతులన్నియు వచింప నిశ్చేష్టితయై కొంతసేపటివఱకు మాటలేకనిలుచఁబడి తుదకు "కట్టా! నాజనకుం డిట్టికట్టిడి యయ్యెగా! నేనిఁక నెవరితో మొరలిడుకొందు? ఎవరు నావేదనఁ దీర్చువారలు? ఎవరు నాప్రాణకాంతుని నన్నుఁ గూర్చువారలు? నన్ను ఘోరమగు విపత్తునుండి తప్పించి రక్షించిన యాజగన్మోహనాకారునకుందక్క పరుల కీశరీరమెటు లర్పింపఁగలుగుదు. హా! జనకా! నాయిష్టము లేని యెవనికో యొకనికి నన్నంటగట్టి యందులకే ననారతము వలపించుచుంత నీవు చూచి భరింపఁగలవా? ఇట్టియుద్దేశము నీవు కలిగియున్నప్పు డీస్వయంవరసంరంభమంతయు నేటికి? స్వయంవరమనఁ గన్నియ దనకిష్టమగు నరునిఁ జేపట్టవలయుఁగదా! ఆర్యావర్తమునంగల రాజులనెల్ల రప్పింపకిట్లేల పక్షపాతము గావించితి" వని పలుగతులఁ జింతించి తండ్రిని

దూఱుచు నెట్టకేల కొకసాహసకృత్యమును గావింప నిశ్చయించుకొని మంజరికిఁ గొన్ని రహస్యములు బోధించి తా నానాఁడు రాత్రిఁ దిన్నగ నాహారమునైనఁ గుడువక చాలఁ బ్రొద్దుపోయినపిదప నెట్లో శయనించెను. అంత బాలభానుండు దన బాలారుణదీప్తులచే నలంకృతములగు రాజవీధులకు నూత్న శోభ గల్పించుచు నుదయపర్వతముపైఁ దోఁచెను. ఆనాఁడు పనిపాటలవారందఱు దమతమ వ్యాపారములకుఁ బోవుట మాని గృహములందే వసించియుండిరి. నగరమునం దెల్లడల ప్రభాతకాలవాద్యములు మ్రోఁగుచుండెను. సంయుక్తయు మేల్కాంచి తానా దినమునఁ జేయఁబూనుకొన్న కార్య మతిదుర్ఘటంబు గావునఁ దండ్రి నెట్లు దిరస్కరింతునాయని కొంతతడవును, దిరస్కరింపనిచోఁ దన కోరిక నెఱవేఱుటకు వేఱొండుమార్గము గలుగదని కొంతసేపును విచారించి తుదకెట్లైనఁ దనయిష్టమే నెరవేర్చుకొనఁ దలచియుండెను. అంతఁ గొంతసేపటికి రాణియానతిఁ జెలికత్తెలు మున్నగువార లేతెంచి నామెకభ్యంగస్నానాదికములఁ జేయించి యలంకరించి తల్లిదగ్గఱకుఁ గొంపోయివిడిచిరి. ఆనాఁ డెనిమిదిగంటలకుస్వయంవర ముహూర్త మేర్పఱుపఁబడియుండెను. దివాణములోపల స్ఫటికశిలావినిర్మితమగు నొకవిశాలచతుశ్శాలామంటపము స్వయంవర కార్యమున కుద్దేశింపఁబడెను. ఈమంటపాంతరమునఁ దూర్పుప్రక్క జయచంద్రుఁడు నతని సంతతియు,నుత్తరమున రాజ్యమందలి ముఖ్యులును,పశ్చిమపార్శ్వమున స్వయంవరాగత రాజమండలియు, దక్షిణమున బరరాజుల వెంటవచ్చిన ప్రధానులు మున్నగువారును నాసీనులగుటకుఁ బీఠము లమర్పంబడియుండెను. తెల్లవారినదిమొద లొక్కరొక్కరు వచ్చి యుచితాసనములఁ బరివేష్టింపసాగిరి. వీధులయందు శకటముల రాకపోకలకు విధివిరగడ లేకుండెను. అంతఁ బ్రతీహారు లేగి సకలమును విన్నవింప జయచంద్రుఁ

షు పురోహితులు ముందునడువ మంటపమున కేతెంచి సింహాసన మధిరోహించెను. పురోహితునానతి బరిచారికలుచని పిలువ సంయుక్త యుచితాభరణభూషితురాలై తల్లింగూడి దివ్యమంగళవిగ్రహముం బలె నుందయానంబున నరుదెంచి సభలో నాసీనయయ్యెను. ఉబ్బెత్తు యద్దపుబిళ్లను సూర్యునియెదుటం బెట్టినతోడనే నలుదిక్కులం బ్రసరించియుండు కిరణములన్నియు దాని తేజఃకేంద్రమునకే చేరులీల స్వయంవరోత్సవముం జూడవచ్చిన సమస్తజనులచూపులు సంయుక్తముఖము మీదనే వ్రాలెను. ఎనిమిదిగంటలగుడు పురోహితుఁడు పుష్పహార మొకదానిని సంయుక్త చేతికొసంగి నీయిష్టమువచ్చిన రాజవరునికంఠమున వేయుమనిచెప్పి రాజుల వేఱుపఱచి చెప్పుట కెవరు దగుదురని యాలోచించుచున్నతరి మంజరి నేనని ముందు నిలచెను. అందుపై నామెనే నియోగించిరి. అత్తరి సంయుక్త తనసహజారుణములగుహస్తముల హారమునుధరించి లజ్జానతాననయై రాజలోకంబు నెదుటకువచ్చుచుండఁ బ్రతివాఁడును దననే వరించునని గుటకలుమింగుచుండెను. మంజరియొక్కొక్కని జూపించి తెలియఁజెప్పుచుండెను. ముఖసంజ్ఞలచే వ్యతిరేకభావమును సూచించుసంయుక్త ముందుచూపులు చూచుచుండెను. ప్రతిరాజకుమారుఁడును దనపై వానివదలి తనదగ్గఱకేతెంచుతరి నీకఁదన్నే వరించునను సంతోషమున మొగము కలకలలాడ గూరుచుండి వ్యర్థమగుటతోడనే విన్నదనంబు నొందుచుండెను. అటనున్నవారి నందఱఁ దెలియఁజెప్పెనుగాని సంయుక్త యెవ్వని వరింపదయ్యెను. సభయందలివారెల్లరు విభ్రాంతివహించి కూరుచుండి యుండిరి. అంతమంజరి పృథివీరాజునువర్ణించి బహిర్ద్వారమున శిలావిగ్రహుఁడై యున్నాఁడనసంయుక్త సభలోనివారల నెవ్వరి లక్ష్యపెట్టక త్వరితగతి నాశిలావిగ్రహముకడ కేగి దానికంఠమున పుష్పహారము వైచెను. చెంతనున్నవారు

కళవళమందసాగిరి. రాజకుమారులు విషణ్ణులై తమచోటులఁ బాసి లేవసాగిరి. ఎక్కడ కేగునో యనిచూచుచు కూరుచున్న జయచంద్రున కావార్త తెలిసినతోడనే మధ్యందినమార్తాండునింబోలె రోషభీషణాకారుఁడై సంయుక్తను లోపలికిఁ గొనిపొండని పరిచారికలకుఁ దెలియఁ బఱచి తాను రాణీసమేతుఁడై యంతఃపురమున కరిగెను. ఆశాభంగ మగుటచేఁ దక్కిన రాజులును దమ తమ నివాసముల కేగిరి.

---

I read this book, and found very good.
It teaches us how to win freedom.
We should not lose our courage at any time.

# పదునేనవ ప్రకరణము.

---

కన్యాకుబ్జనగరమందలి వృత్తాంతము లటులుంచి యించుక ఢిల్లీ నిగూర్చి విచారింతము. చౌహాణవంశస్థుఁడగు పృథ్వీరాజాపురమును బాలించుచుండెనని యిదివఱకే తెలిపియుంటిమిగదా! ఇతఁడార్యమతావలంబకుఁడును, న్యాయపరిపాలకుఁడును, బుద్ధిశాలియు, నతిభోగశాలియునై రాజ్యమేలుచుండెను. ఇతఁడార్యమతమువాఁడగుటచే సమస్తకులములవారిని వారివారి యోగ్యతానుసారము మన్నించుచు వచ్చెను. అందులకు నిదర్శనముగ మనకథాసందర్భమున వచ్చువారి నిరువుర వర్ణించెదను. ఈశ్వరభట్టను నతఁడు జైనమతస్థుఁడు. ఇతఁడు త్రిపిష్టపమునుండి చనుదెంచి రాజు నాశ్రయించి మొదట నొక చిన్న యధికారిగనుండి క్రమముగ యుక్తిచాతుర్యములవలన నొకముఖ్యాధికారి యయ్యెను గొప్పయధికారము చేకూరినది మొదలు రాజ్యమునందు గొన్నిదుష్కార్యము లొనరింప మొదలిడె. తుదకొక స్త్రీని గామించి యామెకుఁదనవాంఛ నెఱిఁగింప నందున కామెసమ్మతింపదయ్యె. ఇటులుండ నామెభర్త కార్యాంతరమున మఱియొక గ్రామమునకేగి మఱలి స్వగృహమునకువచ్చుచుండ దారిలో గొందఱు తలారుల నుంచి వానిఁజంపించి యాశవము నీమెయింటి ముంగిటఁ వేయించి తెల్లవారినవెంటనే కొందఱుభటులఁనంపి పతినిఁజంపినదని యామెం దెప్పించి యాసంగతి దానే విచారణసేసి యామెకు మరణదండన విధింపవలసినదిగఁ జక్రవర్తికిఁ దెలియఁబఱిచెను. చక్రవర్తి స్వయముగ మఱల విచారణసేసి తనకుఁ దృప్తికరముగ ఋజువుకానందున దానిని గొట్టివేసెను. అందులకాభట్టుగారీర్ష్యవహించి నృపాలునెటులైన రాజ్యపదభ్రష్టునిజేయ మూయోపాయముల వెదకుచుండెను. ఇతని కుట్రల

కన్నింటికి నానగరమందె మఱియొక ముఖ్యాధికారపదవియందున్న కరీమను మ్లేచ్ఛుఁడు తోడుపడుచుండెను. ఈకరీమ్ ఆఫగన్ దేశస్థుఁడు. ఈతరుణమున సుల్తాన్ మహమ్మద్ గోరీ యనునతఁడు లాహోరుల రాజ్యముచేయుచుండెను. పదునొకండవ శతాబ్దారంభమున మహమ్మద్ గజినీ యార్యావర్తముపై దండెత్తి లాహోరురాజగు జయపాలుని నోడించిపోయెను. జయపాలుఁడు తనకుఁగలిగిన యవమానమును భరియింపజాలక తన పుత్రుఁడగు నానందపాలుని సింహాసనమునుంచి తా నడవికిఁ బోయెను. ఎనిమిదిసంవత్సరములు కడచినపిదప మఱల గజినీవచ్చి యానందపాలుని నోడించెను. అనంతర మానందపాలుఁడును దనతండ్రిచేసిన ప్రకారము తనకుమారునకుఁ బట్టముఁగట్టిపోయెను. తరువాత క్రీస్తుశకము పదివందల యిరువదియొకటవ వత్సరమున మఱల గజినీ దండెత్తివచ్చి యానందపాలుపుత్రు నోడించి రాజ్యము దనస్వాధీనము జేసికొనెను. నాఁటినుండియు లాహోరున మహమ్మదీయ రాజ్యము స్థాపింపఁబడెను. గజినీ మరణానంతరముకూడ నారాజ్యము మహమ్మదీయుల వశమందే యుండెను. పండ్రెండవ శతాబ్దమున సుల్తాన్ మహమ్మద్ గోరీ యనునతఁడు దానిఁ దన వశముగావించుకొని పరిపాలించుచు నార్యావర్తమునంతయు జయింపఁదలఁచూనియుండెను. అట్టితలంపున నిదేశమందలివారల కెఱుక లేకుండ గొన్నిచిన్న చిన్న సేనల నక్కడక్కడనుంచి రాజులసమాచారము దెలియఁజేయుటకై నిపుణులగువారి ననేకస్థలముల కంపెను. పైకరీమును నిట్లు పంపఁబడినవారిలో నొకఁడు. ఇతఁడతికుయుక్తుఁడు. తన పైయధికారుల యెడల నెట్లు వినయముతో నడుచుకొనవలసినదియుఁ, వారికనుల నెట్లు దుమ్ముగొట్టవలసినదియు నితనికి బాగుగఁ దెలియును. చక్రవర్తి మతవివేచన బాటింప కెల్లరగౌరవించునని తెలిసికొని పురమునందె యొకయధికారిగనున్న నెక్కువరహస్యములు కనుగొనుటకు వీలగుననియూహించి

చక్రవర్తినాశ్రయించి కొద్దికాలముననే యొకముఖ్యాధికారిపదవినం దెను. ఇతఁడు భట్టుగారు జేయుచున్న కుతంత్రముల దెలిసికొని యతని కడకేగి తనకుసాహాయ్యపడవలయుననియుఁ దనకోరికలు నెఱవేఱిన కోడనే ఢిల్లీయం దర్థరాజ్య మిప్పించుతుననియు వాగ్దానముసేసెను. నాఁటి నుండి వారిరువురిపోకలకు మేరయే లేదు. చక్రవర్తినాశనమైనతన కర్థరాజ్యము రానున్నదనిభట్టుగారువ్వీళులూరుచు మహమ్మదీయునకుఁ జేదోడువాదోడుగ మెలఁగుచుండెను. చదువరులారా! ఈ భట్టుగారివంటి స్వార్థపరులమూలముననేగదా యనేక స్వతంత్రరాజ్యములు మన్నుఁగల సిపోయినవి. స్వార్థపరత్వమనుగుణ మెంతచెడ్డదియో బాగుగ నాలోచింపుఁడు. ఈయవగుణరాజమును బూసియున్న వాఁడు దనకుదాను లక్షలకొలంది ద్రవ్యమును సంపాదించి బాగుపడవలెనను పట్టుదలగలిగి పరులకనేకగతుల నపకార మొనర్చుచుఁ దుదకు తానునష్టపడి దేశమునంతయు నాశనముకావింపఁ బాల్పడుచున్నాఁడు. ఒక వేళ నట్టికుబుద్ధులకుఁ దాత్కాలికముగఁ గొన్ని సౌఖ్యములు గలిగినను రాఁబోవు నిజసంతతులకుఁ జెప్పరానినష్టము గలుగఁజేయుటయేగాని లాభముగలుగఁజేయుటకెన్నటికిఁ గాదు. ఎనిమిదువందలయేండ్లక్రిందటి యీభట్టుగారివంటి దుర్మార్గులమూలముననేకదా స్వరాజ్యమన్యరాజ్యమైనది. ఈభట్టుగారు మొదలగువారి కాదినములలో సౌఖ్యమేకలిగినదని యనుకొందము. కానిదానిఫలిత మాలోచింపుఁడు. తరువాత వారిసంతతివారందఱు మ్లేచ్ఛులచేత నెన్నికష్టములందిరో యెవరికెఱుక? ఇప్పటికిని మనదేశమందీగుణము పూర్తిగినే పాతుకొనియున్నది. ఎవనికొఱకువాఁడు చూచుకొనుటయేగాని పరోపకారమన్న లేశమైనలేదు. తెల్లవారినది మొదలొండొరుల దూషించుకొనుచు నొకరిపై నొకరునిందను మోపుకొనుచుఁ బోరాడుచుండుటయేగాని దేశోపకారముకొఱకు బాటుపడుదమనువారలు మిక్కిలియరుదు. ఇట్టివారలకుఁదుదకు దుఃఖరూపకనరక

మేగాక వేఱొండుకలుగునా? స్వార్థపరత్వమూని మగాశాబద్ధులై మొదతెగని మనోచింతచే గృశించుచు నుపకారమనుమాట లేక లోభులై ధర్మహీనులై తుదకుముక్తికిపదూరగులగుచున్నారు. సోదరులారా! ఇట్టి యిహపరలోకములకు గొఱగాని స్వార్థపరత్వము నేలత్యజింపరు? మీకుమీకే కాకస్వదేశమును సంఘమునునట్టిభాగ్యవంతమునుగ జేయఁబ్రయత్నింపుఁడు స్వార్థపరత్వమునుమీహృదయములనుండి పాఱఁదోలుఁడు. ఐకమత్యము వహించిమీదేశక్షేమమునకై పాటువడుఁడు.) ఇఁక గథాంశమునకువచ్చెదను. రాజ్యమందుపీరిరువురుదప్ప తక్కినప్రధానులు మంత్రులు సకౌహిణీపతులు మొదలగువారు తమప్రాణములసహితము జక్రవర్తి కర్పించు నంతటి భక్తితోనుండిరి కాన నతని కేవిధమైనచిక్కులు గలుగకుండెను. పైనివచించిన దుష్టద్వయమునకుఁ జెరియొక దేవిడి కలదు. అందుమహమ్మదీయుఁడు తనకొఱకై యేతెంచు మ్లేచ్ఛభటులు నగరమందలి తక్కినయధికారులకంటఁబడినచో హానియగునని యూరిబైట నాలుగైదుమైళ్లదూరమునుండి తనదేవిడలోని కొకసొరంగముద్రవ్వించి దానిగుండ దనవారలు రాకపోకలుచేయ నేర్పఱుచుకొని చేతనైనన్ని కుట్రలఁ బన్నుచుండెను. "ఇంటిదొంగ నీశ్వరుఁడైన బట్టఁజాలఁ"డను నట్లు తనకొలువునందే యుండి యెదుటముఖస్తుతులు సేయుచు లోలోపలఁ గుట్రలఁబన్నుచున్న వీరిద్దఱి నడవడి నెంతమాత్రము గుర్తింపఁజాలక చక్రవర్తి రాజ్యమేలుచుండెను. ఇటులుండ వేదవేదాంగ షట్ఛాస్త్రపారంగతుఁడగు బైరాగి యొకఁడరుదెంచి చక్రవర్తికి దన విద్యానైపుణ్యముం గనుబఱిచి మన్ననలంది యతనినానతి గొన్ని దినము లక్కడనేయుండి నృపులకు వేదానుకూలమగు రాజనీతు లుపదేశించుచు మైత్రిసిసంపాదించి యేకాంతముగ గొన్ని నూతనవృత్తాంతము లెఱుకపఱిచి నిదర్శనములఁ జూపింపఁ జక్రవర్తియు నాశ్చర్యమగ్నుఁడై వెంటనేబైరాగి మార్గదర్శిగాఁ గొంత సైన్యమునంపి

రాజ్యముఁ బ్రధానుల కొప్పగించి జాగ్రత్తగలిగియుండుడని నియమించి తానును మఱింత సైన్యమును గొందఱు దాసీలను వెంటఁగొని వెడలి పోయెను. దుష్టద్వయము రాజునగరమున లేనితరిఁ గొన్ని యల్లరులు చేయఁ గడఁగిరి. కాని ధీవిశారదులగు మంత్రిప్రముఖులచే నవన్నియు నడఁచివేయఁబడెను. కుతుబుద్దీను నడంచిన దిబ్బైరాగి మార్గదర్శిగఁ బోయిన సేనయే. తరువాత వారికి సహాయపడవచ్చిన రాజపురుషుండు చక్రవర్తియని చెప్పనక్కరలేదు. అప్పుడట్లు కుతుబుద్దీను నోడించి సంపూర్ణజయముతో మూఁడువేలమహమ్మదీయ ఖైదీలవెంటగొని చక్రవర్తి రాజధానిఁ జేరవచ్చినవార్త కరీమునకుఁ దెలిసినవెంటనే యతనికిఁ గలిగినయారట మింతింత యని చెప్పనలవికాదు. మొట్టమొదట సైన్యవృత్తాంత మరసివచ్చుటకై పంపఁబడినచారులు తిరిగి రానందున నేలకో జాగుసేసిరని కరీము మఱియిద్దర నంపెను. వారును సమాచారముఁ గొనిరారైరి. అందులకనుమానగ్రస్తుఁడై రేయింబవళ్లు చింతించుచు నాకులుఁడై యున్నతరుణమునఁ జక్రవర్తి కుతుబుద్దీను నోడించి ఖైదీలఁ దెచ్చినాఁ డన్నవార్త చెవింబడ దొంగలు పడిన కొంపకు నిప్పంటుకొన్నటులయ్యెను. పాపమామ్లేచ్ఛుఁడు నిలిచినచోట నిలువక తనవారితోఁగూడ మాటలాడుటమాని యెవరేమడిగినను బరధ్యానముగనుండి సరియగు ప్రత్యుత్తరమీయక పిచ్చియెత్తినవానివలె శరీరమునం దంతట వేలకొలది తేళ్ళు జెఱ్ఱులు ప్రాకినట్లగుచుండ నేమిసేయుటకును దోఁపక పరస్థలమున కేగి వచ్చుచున్న చక్రవర్తి కెదురుబోయి కొనివచ్చుట యటులుండఁ గొలువున కేతెంచినప్పుడైన నతనిదర్శనార్థము వెళ్ళుటమాని విచారశోకములకుఁ దావలుఁడై రెండుమూఁడు దినములవఱకు సెలవుగైకొని యింటనే వసించి యుండెను. చక్రవర్తి రాజధానిఁ జేరిన మఱుసటిదినమున నొంటరిగఁ గరీ మొక గదియందు గూరుచుండి భట్టుగారిఁ గొనిరమ్మని సేవకుల

నంప వాఁగుపోఁగవచ్చి భట్టుగారు గడచినరాతిరినుండి గాన్పింపనందున నింటివారంద ఱేడ్చుచున్నారని తెలుప దిగ్భ్రమనంది చెంతనున్న వారి నందఱి నావలకంపి తనకోరిక లన్నియు వ్యర్థములగు సమయము ప్రాప్తించినదని చింతించుచుఁ గూరుచుండియుండెను. అట్లు మతిపోయి కూరుచుండియున్న సమయమున మఱియొక సేవకుఁ డరుదెంచి రాజ భటులు దేవిడీచుట్టుఁ గ్రమ్మి తన్ను వెదకుచున్నారని వచింప నులిక్కి పడి లేచి చెంతనున్న బాకునొకదానిఁ గైకొని సారంగమార్గమునఁ బారిపోవుటకు దిడ్డిగుమ్మము దగ్గరకుఁ బోఁబోవ నప్పటికే యచట భటులు నిలిచియుండిరి. మఱియొక ద్వారముకడ కేగి చూడ నక్క డల్లే మూగియుండిరి. వేఱొండు కవాటమువద్ద కేగ నక్కడ నంతకన్న మిక్కుటముగ నుండిరి. ఇట్లు మందిరము నాల్గువైపుల రాజభటు లావరించియుండుట దెలిసికొని యొడలెల్లఁ జెమ్మటలు గ్రమ్మ గజ గజ వణఁకుచు నిశ్చేష్టితుఁడై నోటమాటలేక నేలకొరగెను. తోడనె యక్కడకు వచ్చినభటులు లాపిఱికిపందను విఱిచికట్టి తమయేలికయొక్క యాజ్ఞానుసారము గావింపఁ గొంపోయిరి.



# పదునాఱవ ప్రకరణము.



అటఁ గన్యాకుబ్జనగరమందు జయచంద్రుఁడు తనకూఁతురు చేసినపనికి మండిపడుచు నంతఃపురముఁ జేరి రోషసంభ్రమములు ముప్పిరిగొన "హా! తానొకటితలఁచిన దైవ మొకటితలఁచుననుట తథ్యమయ్యె. ఆ నిర్భాగ్యునెడల నేసలిపినదానికి నాకూఁతు రిట్లు వ్యతిరేకముగ మన్నించుననికలయందైనఁ దలఁచితినా? దీనికిట్టి దుర్బుద్ధి పొడమ నేల? సాటిరాజులలో నాకు తలవంపులు తెచ్చినదిగాదా యీరాకాసి. దీని నేమికావించినను పాపమగునా? దీని నింతింతకండలుగఁ గోసి కాకులకు వైచినను పాపము కలుగదు. దీనికి నే నేమి విషము పోసితిని. ఇది పుట్టకుండిన నా కీచింతయు లేకపోవుఁగదా? ఇదినఱకుఁబోయిన దట్లు పోక మరల నేటికి దాపరించినది? ఆహా! నాహృదయమంతయు రవులుకొనిపోవుచున్న దేమిసేయుదు?" అని తలపోసికొనుచు తన భార్యం బిలచి కూఁతురుసమాచార మెటులున్నదో కనుగొనిరమ్మని పంపెను. ఆమెయు నటులేయనిపోయి కొంతసేపునకు మఱలివచ్చి, "ఆర్యా! అది మూర్ఖపుఁబట్టు బట్టియున్నది. ఎంతచెప్పినను బృథివీరాజును దక్కనన్యువరింప ననుచున్నది. పోనిండు. దాని యిష్టప్రకార మేలఁ జేయరాదు? ఆచక్రవర్తియెడల మీకుమాత్ర మింతవైర మేల?" అని యింకను నేమో చెప్పఁబోవుచుండ నడుమనడ్డమువచ్చి "ఓసీ! నిన్ని వెధవశిఫారసులు చేయుమని యెవరు మొఱపెట్టిరి. పాపము కూఁతును వెనుక వేసికొనివచ్చుచుంటివా? మీరిద్దఱుఁ గలసి యేగంగలోనైనఁ బడుఁడు. అంత నాప్రాణము నెమ్మదిగ నుండును." అని తన ప్రియురాలిఁగూడ గసరికొట్టి బిరబిర సంయుక్తయున్న స్థలమునకుఁ బోవఁజొచ్చెను. ఆహా! అసూయాపరుండగువాఁ డెట్టిదుష్కృత్యము

లోనరింప సమకట్టునో యోచింపుఁడు. పృథ్వీరాజుపైఁగల యీర్ష్యయే గదా! జయచంద్రు నింతదురాత్మునిగఁ జేసినది. అసూయ స్వార్థపరత్వమునకు జన్మకారణమని చెప్పవచ్చును. కన్నబిడ్డలయందును, ప్రియురాండ్రయెడలనుగల మోహమునుగూడ బాఱఁదోలుఁగదా! ఈపాపగుణము. ఈదౌర్భాగ్యపుగుణ మున్నంతవఱకు మన దేశము మంచిస్థితికి రాదనుట నిర్ధారణము. జయచంద్రుఁ డట్లుపోవుచుండ రాణియు'హా! కూఁతురాయని యాక్రందనము సేయుచు నతనివెంటనే యరిగెను. మందిరములోకేగి పరధ్యానముతో నొకసోఫాపై గూరుచున్నకూఁతు నొక్క-చరుపుజరువ నులికిపడిలేచి సంయుక్త తలిదండ్రులకు వందన మొనరింపఁబోవ మరల నొకతన్నుఁదన్ని "ఓసి! దౌర్భాగ్యురాలా! నీ కేమిపోవుకాలము వచ్చినది? నావంశమునఁ జెఱుప దాపురించితివటే? ఇన్నినాళ్లు పోషించినందులకుఁ దుదకు నీతల్లిదండ్రులతోడనే వైరమూనసాహసించితివా? ఓసి పాపిష్ఠిదానా! నీచదువుఁజట్టుబండ లేమన్న గలసిపోయినవి? ఇంతవఱకును గుణవంతురాలవనితలఁచి యుంటినిగాని యింతగయ్యాళివని యెఱుఁగనైతి. నే వలదన్న వానివరించి నామీఁదనే కత్తిఁగట్ట సాహసించితివా? నాహృదయమునకు జిచ్చిడితివిగదే. నిన్నే మొనరించినను నాకసితీఱ" దని యదివఱకెంతో మృదుమధురముగ మాటలాడు స్వభావము కలవాఁడయ్యు, నదంతయుఁబోయి రోషమువలన నోటవచింపరాని యశ్లీలవాక్యంబుల బుత్రికను దూషించి తుదకు "ఓసీ! ఇంతవఱకైనది కానిమ్ము. క్షమించెద. ఇఁకనైన నాదౌర్భాగ్యునివదలి నాయాజ్ఞానుసారము వర్తించెదవా? లేదా?" అన నాకన్నియతలవంచుకొని తిన్ననిమెలుంగున "తండ్రీ! నీ కింతకోపమేటికి? మనస్సుచే వరించినవానినే చేపట్టుట యుత్తమపతివ్రతాలక్షణముగదా! అందులకు వ్యతిరేకముగ నడుచుకొనుమని తండ్రివగు నీవేబోధించుచున్న నిఁక నేనేమనుదానను? అది

యుంగాక నన్ను ఘోరకష్టములనుండి గట్టెక్కించి ప్రాణముల నిలిపిన వాఁడు చక్రవర్తి. అట్టి ప్రాణదాతయగువాని వలదని వేఱొకని నెట్లువరింపఁగలను? పోనిమ్ము! నీ కామహానుభావుని యెడగలవైరము నావల నిడి యాతనియందే సుగుణములు కలవో నిదర్శనపూర్వకముగఁ జూపింపుము. అప్పుడు నీయిష్టానుసార మువశ్యము వర్తిల్లెద." అని పలికిన "ఓసీ! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవు నాకు బుద్ధులగఱపుచుంటివా? నీ కాతనిదుర్గుణములఁ గనుబఱుపవలయునే? అట్టే చూపెదనుండు" మని పలుపలుకుచుండఁ గోపమున నచ్చోటువదలి వెళ్లెను. అప్పటినుండి రాజు రహస్యాలోచనాసభలయందుండు కొందఱ తగువారలరావించి వారితో జరుగుచున్న సంగతులెల్లఁ జెప్పి యెట్లైనఁ జక్రవర్తిపైదండెత్తి యతనిఁగడతేర్పవలయునని పలికెను. అందులకందఱు సమ్మతించి యేదైన నొకచిన్న నెపము వెట్టుకొని యుద్ధమునకుఁబోవుటయుచితమనిరి. కారణము దొరకునా యని విచారించుచున్న సమయమున దౌవారికుఁడరుదెంచి యెవఁడో ఢిల్లీనుండివచ్చి తమదర్శనార్థము ద్వారముకడ వేచియున్నాఁడన వానివెంట నేకొనిరమ్మని రాజుగారు పల్కిరి. వాఁడు నట్లేపోయి వచ్చినమనుజుని వెంటగొని తెచ్చి వీరివద్ద విడచిపోయెను. ఆవచ్చిన పురుషుఁడక్కడనున్న వారలకందఱకు నమస్కారములుసేసి యిట్లువచింపసాగెను. "మహారాజా! నేను ఢిల్లీనగరమునందొకముఖ్యాధికారిని. నే నాచక్రవర్తి యెడ విశ్వాసముగలిగి నాకార్యములన్నియు న్యాయానుకూలముగ నెఱవేర్చుకొనుచుండ నాశత్రువులగు తక్కిన కొంద ఱధికారులవాక్యములాలించియతఁడు నాయెడ నిరాదరణయే చూపుచు వచ్చెను. అటులయ్యు స్వామిద్రోహము సలుపరాదని యతనికెన్నివిధముల నుపకారములు గావించుచువచ్చినను మహాప్రభో! తుదకతనిమనోవాంఛ నన్నుఁజంపి నాకాంతం జెఱపట్టవలెనని తలఁచునంతదుస్థితికి వచ్చినది. జనుల నందఱ న్యాయమార్గాను

గాములుగ నొనర్చి పాలింపఁదగినరాజే యిట్టిక్రౌర్యములు చేయ నెడిగట్టిన నిఁక నానగరమున వసించుట ప్రాణాపాయకరమని యెంచి యొకనాటిరాత్రి నిల్లువెడలి తమవంటి మహాత్ములదయయున్న యెడల నెక్కడనైన నింతపొట్టబోసుకొనవచ్చునని యిట్లు వచ్చినాఁడను. ఇఁక దేవరవారి చిత్తానుసారము దాసుఁడనై మెలఁగ సిద్ధముగా నున్నా"నని వచించెను. జయచంద్రుఁ డతనిఁదన దగ్గఱ నుంచుకొనుటకు శత్రువువద్దనుండి చనుదెంచినాఁడే యని సంకోచించుచున్న సమయమున, నతనివలెనే ఢిల్లీనంతయుఁ బాడుచేసి కనూజిఁజేరి యారాజుగారి దయకుఁ బాత్రులై యున్న మఱియిద్దఱావచ్చినమనుజుని వృత్తాంతము సరియనిచెప్పిరి. దాన సంశయనివృత్తి యగుడు జయచంద్రుఁడతనిఁగూడ నాయిరువురితో సమానముగనుంచుకొంటకు సమ్మతించెను. పైప్రకరణమున నీశ్వరభట్టు కన్పింపలేదని కరీముతో సేవకులు వచించినట్లు చెప్పియుంటిగదా. ఆభట్టుగారే యీవచ్చినక్రొత్తమనుజుఁడు. ఇతనికిని నాసాక్ష్యమొసంగిన సిరువురుమనుజులకును ఢిల్లీయందున్నపుడే పరిచయముండెను. వారు ఢిల్లీని వదలునపుడే భట్టుగారును విడచియుందురుగాని వారికివలెగాక రాజ్యము సంపాదింపవలెనను వాంఛ యితనిమనసున దృఢముగ నాటుకొనియుండెను. ఆకారణముచేతనే ఢిల్లీ నింతవఱకు వదలక పైకి చక్రవర్తితో నిష్టముగ నున్నట్లు నటించుచు లోలోపలఁ గుట్రలు పన్నుచుండెను. చక్రవర్తి మ్లేచ్ఛుల జయించివచ్చిన దినమున తమగుట్టంతయు నతని కెఱుకపడెనని విని కరీముగారితోనైన వచింపక మధ్యరాత్రి బయలుదేఱివచ్చి యిటఁజేరెను. ఇటు లీనగరముఁజేరి చక్రవర్తిపై నెపము వెదకుచున్న జయచంద్రునకు మహోపకారము గావించినవాఁడయ్యెను. మఱునాఁడు కొలువుదీఱియున్న సమయమునఁ జక్రవర్తివ్రాసినది కాకపోయినను అతనిహస్తలిఖితమని జాబు నొకటి జయచంద్రునకుఁ జూపింప దానియం దిట్టులుండెను.

"స్వస్తిశ్రీ జయచంద్రునకు.

నీ గారాబుకొమార్తె సంయుక్త నన్ను వలచియున్నదని యనేకులవలన వినియుంటి. నాకును నామెపై మిక్కుటమగు మోహముకలదు. నాతో మైత్రిఁ బాటింపఁదలఁచితివా శీఘ్రముగ నామెను నాకొసంగి వివాహముఁజేయుము. లేకున్న రాక్షసవివాహమునకైనఁ జేకొన నిశ్చయించియున్నాను." అని చదువుకొన్న వెంటనే దెబ్బతిన్న త్రాఁచుపామువలె దీర్ఘనిశ్వాసాన్వితుఁడై కన్నులెఱ్ఱచేసి లేచి "ఔరా! వీనిదుర్మదము. వీనికినాగారాబుగూఁతు నర్పింపవలయుగా లేకున్న రాక్షసవిధి గైకొనుపాటివాఁడా? చక్రవర్తిపదవి లభించెనని కన్నులు నెత్తికెక్కినవిగాఁబోలు. ఇంతవఱకుఁ దగుకారణములేనందున నూరకుంటిని." అని యవలోకనమాత్రమున రణమునకు వెడలివచ్చునంతటికఠినముగఁ బృథ్వీరాజునకు లేఖవ్రాసిపంపించి యుద్ధమునకు సంసిద్ధులై యుండవలసినదని దండనాయకుల కాజ్ఞాపించి వెడలిపోయెను.



# పదునేడవ ప్రకరణము.



యమునాతీరమున గలిగిన యుద్ధజయము వలన బైరాగికిని జక్రవర్తికిని మైత్రి ప్రబలముకాసాగెను. పృథివీరాజతని బ్రాణస్నేహితునిగ నెంచుకొనుచుఁ బ్రధానులతో సమానముగఁ గారవించుచుఁ దనవద్దనే యుంచుకొనెను. ఇట్లు కొన్నిదినంబులు జరుగ నొకనాఁ డా యోగి చక్రవర్తి నేకాంతస్థలమునకుఁ గొనిపోయి యతనితో "మహారాజా! నేను తమయెడలఁ గావించిన యీచిన్న నేరమును క్షమింపుఁడు. దేవరవారితోడ నేనన్ని సంగతులు వచించితినిగాని యొకటి మాత్రము చెప్పక దాచితిని. ఆనాఁడు కాళికాలయమున మీరు రక్షించినకన్య జయచంద్రునికూఁతు రనిమాత్రము వచించియుంటిఁగాని యామె విషయమై మఱేమియుఁ జెప్పలేదు. ఆచిన్నదాని పేరు సంయుక్తయందురు. ప్రపంచమునందంతట సౌందర్యమున నగ్రగణ్యలని ప్రఖ్యాతిఁగాంచిన కన్యకారత్నములలో నొకతెయైయున్నది. ఆమె గుణగణంబుల నేమని వర్ణించితును. గురులయెడల నమ్రతయుఁ, దోడివారలయెడ విశ్వాసమును, బేదవారలయందుఁ గరుణయు, నందఱపై సమదృష్టియుం గలిగి మూర్తీభవించిన సద్గుణపుంజమో యన నొప్పుచుండును. విద్యయం దామెతోఁ దులఁదూఁగఁగలకాంత లిక్కాలమున లేరనియే వచింపనగును. ఇంతియేగాక శత్రుసమూహంబులు పురుషుఁడని భ్రమనొందునట్లు యుద్ధమున రణప్రావీణ్యముఁ జూపఁగలదు. మఱియు చిత్రలేఖనమునఁ గడునేర్పరి. చూపరులు ప్రకృతిసిద్ధములని భ్రమించుగతి పలురకముల వస్త్రావళి నిర్మించుటలో ముందామెనుజెప్పి తరువాత నింకొకరిఁ జెప్పవలయు. ఆకన్నియ యిప్పుడు సుమారు పదునాఱుసంవత్సరములది. అట్టి సంపూర్ణకళానిధియై రాజిల్లు

నాజవ్వని తన పంచప్రాణముల మీాపైనిడుకొని కేయింబగళ్లు మీా నామస్మరణయే చేసికొనుచు నిద్రాహారములు సైతము మాని కృశించి పోవుచున్నది. జయచంద్రుఁడు స్వయంవరవిధి నామెకు వివాహముఁ గావింప నెంచియున్నాఁడు. ఈవార్తనే మీాతో నవుడు చెప్పకదాచితి. వామమార్గులనుటంకోడనే మీారు కత్తిగట్టి బయలు వెడలుదురనియుఁ దన్మూలమున నాకన్నియకు రక్షణగలుగు ననియు సావకాశముగ నీవార్త దెలియపఱచెదఁగాక యని యూహించి యప్పటి కూరకుంటిని. ఎటులైన నాకన్నియ మనోవాంఛితంబు నెఱవేర్పుఁడు. మీాకును జయచంద్రునకునుగల వైరము నెంచి యుపేక్షచేసినచో నిక్కముగ నా కన్నియ యాశాభంగమయ్యెనని ప్రాణములఁ ద్యజించుంగాని బ్రతికియుండ నేరదు. ఈవృత్తాంతము మీాకెఱుకపఱుచుటకై నే నెన్నియో కష్టము లందివచ్చితి. ఇఁక నాలుగుదినములుమాత్ర మీానగరమున నుండెద. అనంతరము నాకు సెలవొసంగ వలయు”నని వేడెను. ఇంత వఱకుఁగను తెప్పలు వాల్చక బైరాగివంకనే చూచుచు నతఁడు వచింమదానిని వినుచున్న చక్రవర్తి దిగ్గునలేచి యతనిహస్తములు పట్టుకొని “మహాత్మా! నీవు కేవలము నాపాలిభాగ్యదేవతవుగాని వేరొండుగాదు. కొంచె మెడమైనచట్టేటు గలిసిపోవునట్టి నారాజ్యానను నుద్ధరించి పుణ్యంబుగట్టుకొంటివి. సంయుక్తగుణసౌందర్యాదులఁగూర్చి వినియున్నందున నిదివఱకే ప్రేమంపుబీజము మొలకలెత్తియుండెఁగాని యాకోరిక యీానకును నాకన్నియమనంబు తెలియమిని, మారెండురాజ్యములకుఁ గల వైరమునను నించుక వాడఁబారియుండెను. ఇత్తరి మీావాక్యామృతధారలచే మఱల రేకెత్తుచున్నది. మీావంటి యుత్తము లేకడ కేగిన నేకొదువలు గలుగవుగాని మైనను నామనవిఁ జిత్తగించి నారాజ్యమందే వసింపుఁడు.” అని నెయ్యముతొలుకాడఁబలికిన యజువాక్యములకు సంతుష్టమానసుఁడై బైరాగి మరలనిట్లనియె.

"రాజచంద్రా! నీరాజ్యమునం దుండుటకు నాకేయాటంకములు లేవు గాని నేనింకను గొన్ని కార్యములు నెరవేర్పవలసియున్నది. నే మరల మిమ్ముఁ గలసికొనియెదను. నీవుమాత్రము జాగరూకుఁడవై సకలసైన్యముల నాయత్తపఱచుకొని యుంచుకొనుము. మహమ్మదీయుల యార్భాటములుచూచినను జయచంద్రుని మూర్ఖత్వముఁజూచినను నీయార్యావర్తమునకు ఘోరసంగ్రామంబు పొడమునను యూహ కలుగుచున్నది. ప్రస్తుతము నిలువయున్న సైన్యములనే నమ్ముకొనియుండక నీరాజ్యమందలి యౌవనవంతుల నందఱరప్పించి వారికి యుద్ధశిక్ష నేర్పించి యుంచుకొనుము. నేనెట్లును పోవకతప్పదుగాన నాకు సెలవొసంగు"మన నెట్టకేలకు నాలుగుదినము లుండిపోవుటకు సమ్మతించెను. సంయుక్తసమాచారము వెలిబుచ్చినపిమ్మట నారాజునకామెపైననురాగము కలిగినదిలేనిది తెలిసికొనుటకై నాలుగుదినములనఱకు నుండి యతనిరహస్యవృత్తములవలన నామెయందు బద్ధానురాగుఁడైనట్లు గ్రహించి యావల నతని యనుమతంబు గొని బైరాగి వెడలిపోయెను. అతఁడేగిన దాది జక్రవర్తియు జింతాకులుఁడై మనమునంతయు సంయుక్తమీఁద నిడుకొని యామె నెట్లుబెండ్లాడవలనుపడునా యనితలపోయుచుండెను. ఇట్లు దీర్ఘాలోచనపరుండై కాలమెట్లోగడపుచుండ నదివఱకే దేశములమీఁదఁ బోయియున్న చారులు కొందఱరుదెంచి కన్యాకుబ్జమున జరిగిన సమస్తవృత్తాంతముల నెఱుకపఱిచిరి. అత్తరి జయచంద్రుఁడు చేసినపనికిరోషమును సంయుక్తకావించినదానికి మహానందమును గలుగ మఱునాఁడు కొలువుకూటమున మంత్రులు, దండనాయకులు మొదలగు వారందఱు పరివేష్టించియుండ వేగులవారుతెచ్చిన సమాచారముల వెల్లడించి యేమిసేయుదమన గొందఱు దండనాయకులు జయచంద్రునిపై దాడివెడలుద మనిరి. అత్తరి వారినావిప్రథానియగు విజ్ఞానశీలుఁడులేచి "రాజా! పట్టుపట్టుమని తలఁచుకొన్నపుడెల్ల

యుద్ధమున కేగుచుంటిమా యందువలన నమితమగు నష్టమగును. గౌరవము చెడును. అనుకొన్న పుడంతయుం బోవుచుండుటవలన నొకవేళ నపజయముగలిగినను గలుగవచ్చును. సామదానభేదదండము లందు సామమున నెప్పటికిం గార్యములు చక్కపఱుచుకొననగును గాని ముందుగ దండమునకు దిగుటుచితముకాదు. మఱియు రణకారణమున ద్రవ్యనష్టమును వేలకొలంది ప్రజానష్టమును గలుగును. మొన్న మొన్న నే మహమ్మదీయులపై నెత్తివచ్చితిరి. మరల నింతతొందరపడ నేల? అదియుంగాక స్వదేశమందలిరాజు లొకరితోనొకరు పోరాడుకొనుచున్న పరదేశములవారికి మిక్కిలి యలనగును. కావున జయచంద్రుని సమాచారమేమో యింకనుం గనుగొందము. ఇంచుక యోపికపట్టియుండుఁడు. అని వచింపఁ జక్రవర్తి వేరొండు వలుక నోడి యూరకున్న సమయమున బ్రతీహారి యొకఁడేతెంచి కన్యాకుబ్జమునుండి రాయబారివచ్చి ద్వారమునం గాచుకొనియున్నాఁడని తెలుప నతని గొనిరమ్మనం బ్రతీహారి యట్లేయొనరించి వెడలిపోయెను. వచ్చినరాయబారి యుచితాసనం బంగీకరించి జయచంద్రుఁడంపిన లేఖ రాజుగారి కొసఁగెను. చక్రవర్తి తనదగ్గరనున్న వేరొకని కిచ్చిచదువుమన నాతఁ డిట్లుచదువ నారంభించెను.

"నూతనముగ ఢిల్లీనింగొని చక్రవర్తియను పేరుపెట్టుకొన్న పృథివీరాజుగారికిఁ గన్యాకుబ్జ నగరాధీశుండగు జయచంద్రుఁడు తెలియపఱుచు విషయములు:—

నీవు రాజ్యమం దల్లరులుసాగించి జనసంచయముల హింసించుచున్నావని వినియు, వానికి నాకు నేమాత్రము సంబంధములేనందున నూరకుంటిని. ఇప్పుడు నాకడ కంపిన లేఖవలన నీసమాచారమంతయుం బూర్తిగ వెల్లడియైనది. "నీవు నాతో మైత్రిఁ బాటింపఁదలచితివా సం

యుక్తను నాకొసంగుము. లేకున్న రాక్షసవివాహమున నైనఁ గైకొనెద,"నని బింకములువలికి వ్రాసియున్నావు. నీతో మైత్రివాటింపకున్న నాకుఁ బ్రతుకుదెరువు లేదనిదలఁచితివా? చేతనైనపక్షమున వట్టిమాటలతోఁగాక క్రియఁగనుంబఱచి నాకూఁతుఁగైకొనుము. అందులకు నే వెనుదీయువాఁడఁగాను. సర్వసిద్ధుఁడనైయున్నాను.

" జయచంద్రుఁడు. "

అని చదువుచున్నంతసేపు నక్షౌహిణీపతులు రోషావేశులై చూచుచుఁ గూరుచుండిరి. చక్రవర్తియు నాగ్రహవ్యగ్రుఁడై కోపము బైటరాకుండ నాపుకొని "విజ్ఞానశీలా! ఇప్పుడు నీవేమనియెదవు?" అన "నిత్తరి నే మఱియొకవిధముగ విన్నవింతునే? దేవరచిత్తానుసారము చేయవచ్చును. ఇంతకు మనదేశమున కిడుములు ప్రాప్తింపనున్నవి కాఁబోలు? అందువలననే జయచంద్రున కిట్టిబుద్ధిపుట్టినది." అని వచించి విజ్ఞానశీలుఁ డూరకుండెను. అంత జక్రవర్తిలేచి యక్షౌహిణీపతుల నవలోకించి "మీమీసేనల సన్నాహపఱుచుకొని యప్రమత్తులరై నే లేనికాలమున మనదుర్గమతిజాగ్రత్తతోఁ గాపాడుచుండుఁడు. ప్రస్తుతము నాతోఁగూడ నాతతాయి చనుదెంచు"నని మంత్రులవంక దిరిగి "మీరు యుద్ధమునకు వలసిన వస్తుసామగ్రుల ముందుఁబంపి దారియందచ్చటచ్చట నాగియుండవలయునని సేవకులకుఁ జెప్పిపంపుఁడు. నే లేనితరి మహామ్మదీయఖైదీలను, కరీమును జాగ్రత్తమై కాపాడుఁడు. అని తగినట్టు లందఱకాజ్ఞాపించి మూఁడుదినములకు యుద్ధప్రయాణ మేర్పఱిచి వెడలిపోయెను.

---

# పదునెనిమిదవ ప్రకరణము.

ఈశ్వరభట్టు కన్యాకుబ్జముఁజేరి కొన్ని దినములు జననిచ్చి మరలఁ దనపూర్వపు దుర్మార్గములఁజేయ నారంభించెను. ఎటులైన జయచంద్రునిచేత బృథివీరాజు నోడించి యతనిచే డిల్లీనందు కొంత భాగము బహుమానముగఁ బడయు నభిలాషఁ గలిగియుండెను. అట్టి యుద్దేశముతో ననారతము జక్రవర్తిపై లేనిపోనివార్తలఁ గల్పించి చెప్పుచు జయచంద్రునకుఁ గోపమెక్కించుచుండెను. వీసనడతగుఱించి సాక్ష్యమొసంగిన తక్కిన యిద్దఱు వీనితోఁగలసి పనిచేయుచుండిరి. ఈదుష్టత్రయము రాజుచే నమితముగఁ బ్రేమింపఁబడుచుండుటవలన రాజ్యమందలి గొప్పగొప్పయధికారులు సహితము వీరికి వెఱచుచుండిరి. అధికారులసంగతియే యటులుండ నిఁక తక్కినప్రజలగుఱించి వచింపనేటికి? దుష్టత్రయము గనూజియందంతటఁ దమప్రభావమే సాగుచుండ మెలంగుచున్నతరి వారికడనున్న నొకముదుసలి కంచుకి మాత్రము వారలుకావించుపనుల కిష్టములేనివాఁడై యుండెను. లోపల నిష్టములేనివాఁడయ్యుఁ బైకిమాత్రముగుపడక శాంతమువహించి యుండి యాదుష్టుల కెఱుకలేకుండ చేతనైనంతవట్టుకు వారికుట్రలకు విఘ్నములఁ గల్పించుచుండెను. బహిరంగముగను నీదుష్టులయెడల వైరమూని రాజు నన్యాయముగ నాశనముసేయుచున్నారని తలఁచి ప్రధానమంత్రియగు వినయశీలుఁడనేకపర్యాయములుజయచంద్రునకుమంచిమార్గముపదేశించుచు వచ్చెఁగాని చక్రవర్తియెడ రోషమువహించి యసూయాపరుఁడై యున్న నతనిమనసున నామాటలునాటవయ్యెను. దుష్టత్రయమును బ్రధానమంత్రి తమయెడఁజేయుచున్న ద్రోహమున కతని దొలఁగించుమని రాజుతో ననేకపర్యాయములు వచించిరిగాని తండ్రి

నాఁటినుండివచ్చుచున్న మంత్రిని దీసివేయుట కతఁడును సమ్మతింపఁడ య్యెను. అట్టియెడ వీరలుగావించుతంత్రము లెప్పటివప్పుడు వినయశీలు నకుఁదెలియపఱిచి యతఁడు చెప్పునట్లు విఘ్నములు కల్పించుచు దుష్ట త్రయమునకుమాత్ర మావంతయైనఁ దనపై సందేహము పొడమకుండు నట్లు కంచుకి ప్రవర్తించుచుండెను. ఈసమయమునందే గ్రామాంతరమున కేగి కొద్దిదినములలో మఱలివచ్చెదనని చెప్పి కొన్నిమాసములు కడచి నను రానట్టిదేవశర్మయను బ్రాహ్మణుఁ డేతెంచెను. ఈదేవశర్మయే సంయుక్త విద్యాగురువు. ఇతనియెడ నామె కమితముగు ప్రేమయు, భక్తి యుగలదు. జయచంద్రుఁడుసహిత మితనివిద్యానైపుణ్యమునకు మెచ్చి యందఱికన్న నెక్కుడుగ గౌరవించుచుండెను. ప్రధానమంత్రికి నితనికి నమితస్నేహము. దేవశర్మమున్ముందు వినయశీలుని మందిరమున కేగ నతఁడును గాంచినంతనే లేచివచ్చి యాలింగనమొనరించుకొని లోనికిఁ గొంపోయి కూరుచుండఁబెట్టుకొని యాదరణ పూర్వకముగ క్షేమస మాచారము లడిగి తెలిసికొని కొంతతడవునకు "దేవశర్మా! నీవింతకా లమైనను రాకుండుటవలన నా కేమేమోయాలోచనలు పోయినవి.నిన్ను సురక్షితముగ మరలనాకగపఱచినందులకా దైవమునకు నేకవందనములు. నీ వే యే స్థలములందింత కాలమువఱకుఁ గుర్గుమ్మరుచుంటి"వన "నావృత్తాం తమంతయునిపుడు చెప్పుటగాదు. సావకాశముగఁదెలిపెదను.నగరమం దలివిశేషము లేమి?సంయుక్త బాగుగనున్నదా"యని దేవశర్మయడిగెను. అంత వినయశీలుఁడు " రాజ్యమందలి వృత్తాంతములన్నియుఁ బెద్దభార తముగనున్నవి. నీవుపోయిన తరువాత నీశ్వరభట్టనునతఁ డొకఁడు డిల్లీనుండివచ్చి మన జయచంద్రునిదయకుఁ బాత్రుఁడై దుష్టద్వయము తోఁ గలిసి యనేకదుష్కార్యములుఁ గావించుచున్నాఁడు. వారు ముగ్వురుఁగలసి చేయుచున్న కుతంత్రము లిట్టివని వచింపఁజాలను. నే నేమిచేయుదును. జయచంద్రుఁడును వారిస్తోత్రపాఠముల కుబ్బి

పోయి వారియిష్టానుసారమే నడచుకొనుచునుగాని నామాటఁ బాటింపఁడు. ఏమో పూర్వకాలపువాఁడను గావున నుంచినాఁడుగాని యనేకుల కిదివఱకే యుద్వాసనమైనది. ” అని యీశ్వరభట్టునుగుఱించి వచించుటతోడనే దేవశర్మ యాశ్చర్యమగ్నుఁడై “ ఆహా! ఆదుష్టుఁడు డిల్లీనంతయు నాశనముఁజేసి యిక్కడఁ జేరినాఁడా? ఇఁక జయచంద్రుఁడు బాగుపడుట దుర్లభమే. ఈ క్రూరుఁడిదివరకే ప్రాణహత్యఁగావించుకొనె ననితలఁచియుంటిని. ఇప్పు డీవార్తవలన నా కమితము చింతఁగలుగుచున్నది. ఆముష్కరను రాజున కెఱుక లేకుండ నెటులైనఁ గడముట్టింపవలయును. ఇప్పుడు వారుచేయుచున్నపనియే” మన “ ఏమున్నది? ఆభట్టుగారు చక్రవర్తి లిఖించినదని యొకజాబునుఁదెచ్చి జయచంద్రునకిచ్చినాఁడు. దానిఁజూచుకొని నృపుఁడు కోపోద్దీపితుఁడై వెంటనే చక్రవర్తికొడలు మండునట్టులొక లేఖ వ్రాసిపంపినాఁడు. అది చక్రవర్తికిఁ జేరియేయుండును. రేపోమాపో మననగరముపై దండెత్తిరాఁగలఁడు. అందుకొఱకే జయచంద్రుఁ డిప్పుడు రణమునకు వలయు సన్నాహంబులఁ జేయించుచున్నాఁడు. ” అని వినయశీలుఁడు వక్కాణించెను. ఇక్కడవీరిరువు రిట్లు మాటలాడుకొనుచున్న సమయమున బయటద్వారముకడ నెవరోపిలుచుచున్నట్లు శబ్దమురా వినయశీలుఁడు చనితలుపుఁదీసి చూడఁ గంచుకివచ్చి నిలచియుండెను. అంత వారిద్దఱు మరల దలుపుపెట్టుకొని దేవశర్మదగ్గరకు వచ్చిరి. కంచుకి దేవశర్మను గాంచుటతోడనే యానందమునుం బొంది యతనికి నమస్కరించి నిలువ నావిప్రుఁడు ను నతనిక్షేమసమాచారమడిగి కూరుచుండ నియోగించెను. అత్తరి వినయశీలుఁడు దేవశర్మతో “ ఈకంచుకిమనకు బరమాప్తుఁడు. ఇతఁడు పైకిదుష్టతియమునకు మిత్రుఁడుగనుండి వారిసమాచారములన్నియు నాకుఁదెల్పుచుండును. ” అని కంచుకివంకఁదిరిగి “ నేఁడేమైన నూత్న వృత్తాంతములున్నవా? నీవెప్పుడును రాని యకాలమునవచ్చితి ” వన

"మహాప్రభో! వారు చివరకు జయచంద్రునకే మోసముగావింపఁ బూనుకొన్నారు. ఇఁకేమున్నది ? వారు సంయుక్తాదేవివిం జంపు ప్రయత్నములు చేయుచున్నారు. "అని కంచుకి పలుక "ఎట్టు! సంయుక్తనే! నాప్రాణములుండ నా ముద్దుబిడ్డ కట్టియపాయము రాసిత్తునా? యని దేవశర్మ ధీరముఁగ వక్కాణించెను. అంత నాసంగతులేమోవివరముగ వచింపుమనఁ గంచుకి యిట్లనియె:—

"కడచినరాత్రియందాదుష్టులుముప్వురు నొకరహస్యంపుఁ జోటఁజేరి మూఁడుగంటలసేపు సంయుక్తను గడదేర్చుపన్నుగడలు పన్నకొని యెవరిండ్లకు వారు వెడలిపోయిరి. ఈశ్వరభట్టు తెల్లవారినతోడనే నన్ను వెంటఁగొని సంయుక్తయుండు నంతఃపురమందిరములోనికిఁ జని ద్వారముకడ నన్నుంచి తాను లోపలికరిగెను. నేనును వానికిఁదెలియకుండ వెంటనేపోయి తలుపుచాటున దాగుకొనియుంటిని. సంయుక్త యొంటరిగ నొకసోఫాపైఁ గూరుచుండియుండెను. భట్టుగారామెను గాంచినంతనే సాగిలఁబడి నమస్కారము చేసెను. అత్తరి సంయుక్త "భట్టుగారూ! ఏ మిట్లుదయచేసితిరి? చక్రవర్తిగారివద్దనుండి మాతండ్రికడకు మత్తేవైనజాబులు వచ్చినవా ? యని నిష్ఠురముగఁబల్కనితఁడు ముసిముసినవ్వులునవ్వుచు "అమ్మా! మీనాయనగారికి నే నగుపఱచినలేఖను నీవును నిజమని నమ్మితివా? నాపై నెట్టులైన నమ్మకము కలుగుటకుగా నట్టి లేఖలఁగల్పించి చూపించితిగాని వేరొండుకాదు. ఇప్పుడు నీకడ ప్రమాణపూర్వకముగ నిక్కమగుదాని వచించెద వినుము. చక్రవర్తికిని నాకును బరమమైత్రి. అతఁ డహోరాత్రంబులు నిన్నుగూర్చితలఁచుకొనుచుఁ దుదకు నన్నుఁ బిలచి "మిత్రమా! నాకెటులైన సంయుక్తనుగూర్చి నావంతఁ దీర్పఁజాలవా? నీవంటినెయ్యుఁడు నాకు మఱియొకండు దొరకఁడుగాన నీతో వచించుచున్నాను. అతిస్వ

వీక్షింపకున్న నాయసువుల భరింపనోప" నని దీనత్వము తోఁబలికిన నతనిమాటలకు నాహృదయము కఱఁగి 'ఛీ! మిత్రునభీష్టంబు దీర్పఁ జాలని నాజన్మమేల' నని కొంతతడవు విచారించి యతనితోఁ 'గానిమ్ము నీకోరిక నెరవేర్చెదను. ఇటులే యింకను గొన్ని దినములవఱకు నోపిక బట్టియుండుము. నే గన్యాకుబ్జనగరమున కేగి సంయుక్తం గొనితెచ్చెదను. జయచంద్రుని దగ్గరనుండి యొకవేళ నీ కేవిధమైన యుత్తరములు వచ్చినను వాని లెక్కగొనకుము.' అని యతని సమ్మతిపఱిచి యీ పురముం జేరితిని. మొదలే చక్రవర్తిపై వైరమూనియున్న నీతండ్రికి దగినట్లు మాట్లాడనిచో నాకీరాజ్యమున నిలువ వీలుకలుగదనియు, నిలువకున్న నీతో నామిత్రుసమాచారముఁ దెల్పుటకు వలనుకలుగదనియు, నీతో మాటలాడి నిన్నుఁగొనిపోవకున్న నామిత్రునికోరిక నెరవేరదన్న భయమునను నీతండ్రికిఁ గల్పితలేఖనొక దానిఁగనుబఱిచి మఱికొన్ని యిచ్చకములు పలికి యితనిదయకుఁ బాత్రుఁడనైతిని. నీతండ్రి చేయుచున్న సన్నాహములఁ జూచి చక్రవర్తి దాడి వెడలివచ్చునని తలఁచెద వేమో? జయచంద్రుఁడు వ్రాసిపంపిన యుత్తర మప్పుడే యే పెంటలోనో కలిసిపోయియుండును. చక్రవర్తి మనయిద్దఱిరాకకొఱకై యెదురుచూచుచుండును. ఇప్పుడు నీతో నున్న సంగతులన్ని యువచించితి. ఇఁక నీ యిష్టానుసారమేమి చేయుమన్న నట్లు చేయుటకు సిద్ధముగనున్నా" నని నమ్మకము కలుగునట్లు తియ్యనిమాటలతోఁ జెప్పెను. "ఆకన్నియ తా నదివఱకు బూనియున్న కోపమును విడిచి మెల్లన "యయ్యా! మీరిదివఱకుఁ గావించుచున్న కార్యములవలన నే నన్యముగ భావించితి. కాని యిప్పుడు మీరు చెప్పినదంతయు నిక్కువమే కదా? యని యడిగెను భట్టుగా రామె దారిలోనికి వచ్చుచుండుటఁ గనిపెట్టి మరల "తల్లీ! చక్రవర్తినివి కాఁబోవుచున్నావు కాన నీవు కేవలము ధీరమాతవగుదువు. నీయెడ ద్రోహముఁ దలపెట్టినవాఁ డెట్టిఘోర నరకమైన

నోఁదుఁగాక. నామిత్రునివాంఛ దీర్పనెంచి నే నెన్నియో టక్కులఁ బన్నితిని. అమ్మా! అట్లుచేయనియెడల నా కిచటఁబ్రవేశముఁగలుగనే కలుగదు." అని నుడివి యొకకమ్మ నామెకొసంగి 'అమ్మా! దీనిని మీరు నానెయ్యునకు వ్రాసిపంపితిరఁట. దీని నానవాలుగఁ గనుబఱచి మిమ్ముఁ దోడ్కొనిరమ్మని పంపినాఁ'డనెను. ఆలేఖనుఁజూచుకొని సంయుక్త సంతోషభరితయై భట్టుగారితో 'అయ్యా! మీయిష్టానుసారము నడచుకొన సిద్ధముగ నున్నా'నని పలికెను. (కాముకజనంబులకు యుక్తాయుక్తవివేచనము శూన్యంబుగదా!) అంత మరలనతఁడు 'అమ్మా! మనమీరాత్రియే బయలుదేరిపోవలయును. సుమారు పండ్రెండుగంటలకు వెడలుదము. అప్పటికి సంసిద్ధురాలవై యుండు' మని చెప్పి తానువెన్కకు మరలెను. అతఁడు వచ్చువేళకు నేను ముందుఁ జని యతఁ డుంచిపోయిన ద్వారముకడనుండి నన్నుఁ గలిసికొని రహస్యముగ రాత్రికొకబండిని గుదుర్చుకొని రమ్మనిచెప్పి తనదారిం బోయెను. ఇందుకు మీ రేమిప్రతీకారము చెప్పెదరో యని వెంటనే యిక్కడికివచ్చితి,' నని యావద్వృత్తాంత మెరుకపఱుప "ఔరా! కుట్రముండవాఁ డెంతపనిఁజేయఁబూనినాఁ డని యాశ్చర్యపడుచు దేవశర్మ బండిని గుదుర్చుకొనివచ్చితి నని భట్టుతోఁ జెప్పుమని కంచుకింబంపి "వినయశీలా! మననగరమం దెట్టి రాజద్రోహులున్నారో చూచితివా? కానిమ్ము. ఆదుష్టులు మువ్వురువచ్చుట తటస్థించినచో నేఁడే కడముట్టించెద"నని మఱికొన్ని రహస్యములతనిచెవిలోఁ జెప్పి తాను వెడలిపోయెను.



# పందొమ్మిదవ ప్రకరణము.

దేవశర్మ వచించినప్రకారము కంచుకిపోయి భట్టుగారింగోఁబండిని గుదుర్చుకొని రాత్రిపదిగంటలైనపిదప మనమందిరమువద్దకుఁ గొనిరమ్మనివచ్చితి నన నతనిబంపి దనకుఁ జేదోడుగనున్న మిత్రులనిరువురను బిలిపించి జరిగినసంగతులన్నియు వారితోఁ జెప్పి చేయవలసిన కార్యమునకై వారిద్దఱికి మాఱువేషముల వేయించి ప్రొద్దుగ్రుంకిన పిదప బదిగంటలైన దాది బండికొఱకై కనుపెట్టుకొనియుండెను. అత్తరి సూతుఁడొకఁడు బండిఁదోలుకొనివచ్చి బయటనున్నాఁడని సేవకు లెఱిఁగింప నాయిద్దఱు మిత్రులతోవచ్చియెక్కి బండి సంయుక్తయుండు ప్రాసాదమువైపునకు నడిపించి యక్కడ నాపి సూతునియొద్దకేగి వానిచేత కొంతధనమిచ్చి "ఓరీ! నీ కింకను గావలసినంత ధనమిచ్చెదను. నేఁడు నీబండియందు జరుగు సమాచారము లెక్కడను దెలియనీయవలదు. అటు లొనర్చితివా నీప్రాణములు నీవికా" యన "మహాప్రభో! ఏలినవారియాజ్ఞకు భిన్నముగ నడుచుకొందునా?" యని సమ్మతించెను. పండ్రెండుగంటలగుఁడు సంయుక్త మేడమీఁదనుండి బండి వచ్చి సిద్ధముగనుండుటఁ దెలిసికొని తానదివఱ కేర్పఱుచుకొని యుంచుకొన్న రహస్యమార్గమునఁ జనుదెంచి బండికడ నిలచెను. నిలచిన వెంటనే భట్టుగారుచూచి నమస్కరించి లోపల నొకప్రక్క నాసీనంజేసి మిత్రులనుసూతునిస్థలమునగూరుచుండఁజేసి దీపములఁదీయించి తానును లోపలనొకవైపునఁ గూరుచుండి బండిని మధురాపురముదారి బోనియ్య నాజ్ఞాపించెను. మైలుదూర మరిఁగినపిదపఁ దానొకవస్తువు నింటికడ మఱచి వచ్చితి ననియు నొకనిమిషములో దానిఁ జేకొనివచ్చెద ననియు సంయుక్తకుఁజెప్పి బండినిమెల్లగఁ బోనిచ్చుచుండుమని సూతున కాజ్ఞా

పించి తాను వెనుకకుమరలిపోయెను. భట్టుగారుచనినపిమ్మట మఱియొ కమైలువఱకుఁ బండినిబోనిచ్చి యప్పటికి నతఁడు తిరిగి రానందునఁ దన ప్రక్కనున్నవారి “ ఏమి ! మీయజమానుఁడుగా రింకనురాలే ” దని సూతుఁడడుగ నాయిద్దఱు రహస్యముగ “భట్టుగారిఁక రారు.నీవు త్వరిత ముగ బండినింకొకమైలు దూరము పోనిమ్ము. మన మీ బండియందలి కన్నియను జంపవలయు”నన సూతుండు తనలో“ఔరా! దుర్మార్గు లారా! మీయూహ” యని భట్టుగారు తప్పించుకొని పోయినందులకు లోలోపల నొచ్చుకొనుచు ముందేగిన నేమగునో యనుతలఁపున దాన క్కడ దిగవలయునని వారితోఁజెప్పి దిగి యించుక వెనుకకేగి బట్టమొదలగునవి బాగుగసవరించుకొని బండివెనుకనుండి వచ్చియొక ప్రక్కనున్నవాని తల నెగరగొట్టెను. రెండవవాఁడు క్రిందికి దుమికి యెదురింప వచ్చుచుండ వానిని బట్టుకొని నేలంబడదన్ని గొంతుకపైఁ గాలువైచి “ దుష్టాత్ములారా ! రాకుమారిక నన్యాయముగఁ జంప నెంచితిరా ! పరుల కెగ్గుసేయఁ దలపెట్టితిరి గావున నాప్రాప్తిమీకే చేకూరినది చావుఁ” డని వానినిగూడఁ గడదేర్చెను. ఇంతలో నీకల్లోలమంతయుం గాంచి బండిదిగివచ్చి సంయుక్త విస్మయాక్రాంతయై నిలచియుండెను. సూతుఁ డామె సమీపింపఁబోవఁ గోపమూని “దురాత్మా! ఇట్లేలఁజేసితివిరా” యని తనదగ్గఱనున్న యొకచిన్న కత్తితో నతని పొడువం బోవగా “ఆ! ఆగుము. నే దేవశర్మ” నని నిజ కంఠస్వరమునఁ బలికెను. దేవశర్మ యనుట కోడనే కత్తినాపి “యీ చీకటిలో నేనెట్లు గుర్తిడఁగలను. దేవశర్మయైన నాకింతద్రోహముఁ గలుగఁజేయఁ”డని యాకన్ని యపలుక బండిముందరిదీపమును వెలిఁగించి చూడుమని సూతుఁడు వక్కాణించెను. సంయుక్త దీపము వెలుఁగున సూతవేషముతోనున్న తనగురువును దేవశర్మం గుర్తించి తనచేత నున్న ఖడ్గము నవతలఁబారవైచి యతనిపాదములపైఁబడి “మహాత్మా!

ఎన్ని దినంబులకు భవదీయదర్శన మబ్బెను! మీచరిత్రముంజూడ నా కాశ్చర్యముఁ గలుగుచున్నది. మీకీబండివాని వేషమేల చేకూరె? వీరల నేటికిట్లువధించితి” రన “బిడ్డా! నేనీదినముననే యీగ్రామమున కేతెంచితిని. వచ్చినవెంటనే యీశ్వరభట్టు మొదలగువారు చేయు చున్న కుట్రలు తెలిసినవి. వీరలు నిన్ను వధింపఁ గొంపోవుచున్నా రనువార్తవిని సూతుని వేషమూని వచ్చితిని. అమ్మా! దుర్మార్గులు వచించు కల్లమాటలకులోనై యంతఃపురమువిడిచి యొంటరిగ నిట్లు రానగునా? నేను సమయమునకు వచ్చియుండ నిన్ను రక్షింపఁగలిగితి. లేకున్న నీవేమగుదు”వన నాశ్చర్యకలితయై యాదుష్టుఁడగు భట్టు పన్నినపన్నుగడకు విస్మయమందుచు “మహాత్మా! చక్రవర్తిపైఁగల మోహమున నిట్టియకార్యముం జేయఁ బొల్పడితిని. అదియుంగాక చక్రవర్తికడకు మీరు కొనిపోయిన లేఖను దెచ్చి యీశ్వరభట్టు నాకుఁగనుబఱచుటవలన రూఢియనినమ్మి మోసపోయితిని” మీరు కైకొనిపోయిన లేఖ యాదురాత్మునికడ కెట్లువచ్చినది?అని సంయుక్త యడుగ దానిసమాచారము సావకాశముగ దెలిపెదఁగాని నీ విఁక ముందెన్నటికి నిట్లురాకుము. ఈశ్వరభట్టు నీతో మాటలాడిన సం గతులన్నియు వానికడనుండు కంచుకివలన వినియున్నాను. వాఁడు చెప్పినదంతయు వట్టి యబద్ధము. చక్రవర్తి రేపోమాపో యుద్ధ మునకు రానున్నాఁడట. ఘోరసంగ్రామంబు జరుగనున్నది. పురుష వేషమూని నీవాచక్రవర్తిసేనకు దోడ్పడుచు సంగరమున నీమనో కాంతుం డు మెచ్చుకొనుకార్యమేదైన సలిపితివా యతఁడు నిన్ను డిల్లీకిఁ గొనిపోవును. నేను మరల డిల్లీ కేతెంచి నీ మనోవాంఛితంబు నెర వేర్చెదను. నేనువచ్చువఱకు నీవృత్తాంతమెవరికిఁ దెలియపఱుపవలదు” అని బోధించి మరల నాబండియందే కూరుచుండఁబెట్టుకొని యామె నంతఃపురముఁజేర్చి తాను వెడలిపోయెను.



# ఇరువదియవ ప్రకరణము.

చక్రవర్తికి లేఖనంపినదినము మొదలు కనూజియందు జయచంద్రుఁడు దుర్గము బాగుచేయించుట మొదలయిన రణసన్నాహములగు కార్యములలో మగ్నుఁడైయుండెను. ఈనగరమందలి కోట చదరమై పండ్రెండుమైళ్ళచుట్టుకొలతఁ గలిగియున్నది. ఇది పెద్దపెద్ద నల్లరాళ్లచే నిర్మింపఁబడి నేలమట్టమున నాలుగుగజముల వెడల్పును నగ్రమున గజమున్నర వెడల్పునుఁ గలిగి పరిఘాసమావృతంబగు పదునొకండు గజముల యెత్తుఁగల ప్రాకారపుగోడచేఁ గూడుకొనియుండెను. గోడలచుట్టు పదిగజములయెత్తున తుపాకులు ఫిరంగీలు మొదలగునవి ప్రయోగించుట కనువగు గవాక్షము లడుగడుగునకుఁ బెట్టఁబడియుండెను. ఈగోడలతోఁ గలిసియే లోపలిభాగమున మూఁడుగజముల మందమును తొమ్మిదిగజముల యెత్తునుగల మఱియొకరాతిగోడ కలదు. యుద్ధసమయమందు భటులీచిన్నగోడ పైభాగమున బారులుదీరి నిలచి పెద్దగోడ గవాక్షములగుండ శత్రుసేనలపై నగ్నివర్షముఁ గురిపించుచుందురు. మఱియు నఱపర్లాంగున కొకపెద్దబురుజుఁగలదు. బురుజులన్నియు బలిష్టములై యెల్లవేళల ఫిరంగులతోఁగూడియుండును. ఈకోటలోపల నుచితస్థలంబుల నెనిమిది చిన్నకోటలుఁగలవు. జయచంద్రుని సైన్యమంతయు చిన్నకోటలందనారతము నివసించుచుండును. కోటయొక్క బహిర్ద్వారము బలవత్తరమై నాల్గుబురుజుల మధ్యనుండెను. ఈద్వారమారుగజముల వెడల్పును పండ్రెండుగజముల యెత్తునుఁగలిగియుండెను. దీనితలుపులు స్వచ్ఛమగు నినుముతోఁ నిర్మింపఁబడి మూరెడున్నర మందముగలిగి ముందఱిభాగమున దీక్ష్ణములగు గుబ్బలచే దాపటములైయుండెను. ఈద్వారముపైవిశాలమగు నొకరాతికట్టడముఁగలదు. అందుఁ

ప్రవీణులగు ఫిరంగులఁగాల్చువారు జాగరూకులై యెల్లపుడుఁ గాచుకొని యుందురు. దీనితరువాత నిట్టివే మఱిరెండు ద్వారములుకలవు.ఇట్టిశాత్రవుల కభేద్యమగు నాదుర్గమునందంతట సైన్యముల నిలిపి కోటగోడల యగ్రములందుఁగూడ నక్కడక్కడ ఫిరంగులఁబెట్టించి జయచంద్రుఁడు జాగ్రత్తమైయుండెను. ఇతనివద్ద నెల్లవేళలందు నొకలక్షయిరువదివేల కుంజరములును, నూటయేబదివేల తురంగములును, రెండులక్షల భటులును గలిగినసేన సిద్ధముగనుండును. ఈమూఁడువిధముల సేన నుగ్రవర్మ యనువాఁడు సకలాక్షౌహిణీపతి యనుపేరఁ బాలించుచుండును. వీనికిఁదోడుగ గహారకంఠీరవప్రచండు లనువారు పనిసేయుచుందురు. వీరి క్రిందనొక్కొక్కవిధమగు సైన్యమునకు నాధిపత్యము వహించినవారు ముువ్వురుఁగలరు. అందు సుబాహువుఁ డనువాఁడు కుంజరయూథమునకును, ప్రమాథుఁడనువాఁ డశ్వసైన్యమునకును, సిద్ఘాతుం డనువాఁడు పదాతిసేనకు నధిపతులై యుండిరి. వీరిక్రిందను నిట్టే యధికారక్రమమున ననేకనాయకులుకలరు.కడగొట్టువానియధికారమున నూర్గురుభటు లుందురు.జయచంద్రుఁడింతసేనతో దుర్గమును రక్షించుకొనుచు నొకవేళఁ జక్రవర్తిసైన్య మేతెంచుచున్నయెడల దారిలోనే యడ్డగించుటకుఁగాను ప్రచండునియాధీనమున నాలువేలకుంజరములు, పదివేలతురంగములు, నిరువదివేలభటులుగలవాహినిం బంపెను. సేనంతయునగరమువదలి యిరువదిమైళ్ళువచ్చినపిదప దమకెదురుగఁ దూర్పుదిక్కున మన్నుమిన్నేకమగునట్లులేచి వెనుక నేమియుఁ గానరాకుండఁ జేయుచు హోరుమను రావములతోఁ బ్రచండతరముగఁ దమవైపున కేతెంచుచున్న గాలిదుమారమును బ్రచండుఁ డవలోకించి గొప్పగాలివాన నచ్చుచున్న దను భ్రమను సేన నక్కడనే యాపెను. అత్తరి ముందుబోయియున్న వేగులవా రరుదెంచి యావచ్చునది చక్రవర్తిసైన్యమని ప్రచండున కెఱుక పఱిచిరి. తత్క్షణ మతఁడాస్థలము విశాలమగు బహిరంగప్రదేశ మగుట వలన శాత్రవులు చుట్టుముట్టిన నపాయకరమగునని తలపోసి సేనను వలయాకారముగ దీర్చి పద్మవ్యూహముఁ బన్ని జాగరూకుఁడై తాను నడిమిభాగమున నుండెను. ఇక్కడివార్తనంతయు నిగూఢముగ కొం

దేఱు చక్రవర్తి వేగులవారు వచ్చి తెలిసికొనిపోయి తమవారల కెఱుకపఱిచిరి. చక్రవర్తి సైన్యము నూరువేల గజములను, నూటయిరువదివేల గుఱ్ఱములను, నూటడెబ్బదివేల భటులనుఁ గూడియుండెను. యమునాద్వీపకల్పరణమునఁ గుతుబుద్దీను నోడించి ఢిల్లీయందనేక బిరుదలఁగాంచి ప్రఖ్యాతివహించిన యాతతాయియును యుప సకలాక్షౌహిణీనాయకుఁడిసార్వభౌమ సేనవంతయు నతిప్రావీణ్యమొప్ప నడిపించుకొని వచ్చుచుండెను. జయచంద్రు సేనయందువలెనే చక్రవర్తి సైన్యమునందును నూరురుభటుల కధికారులగు నాయకులుఁగలరు. వీరియనంతరమును నుద్యోగులు గలరు. అందుఁ గడపటియుద్యోగివశమున నిరువదిమంది భటులుమాత్రమే యుందురు. వీరందఱు క్రమముగు రణశిక్ష నలవర్చుకొనియుండిరి. ఆతతాయి ప్రచండునివార్త విన్నవెంటనే తనసైన్యమునఁ గొంతభాగము ప్రకంపనుఁడను సేనానికిచ్చి శత్రువుల కెఱుకరాకుండ దూరమునుండి చని వరాహవ్యూహమున బడమటిదిశను దాకఁబంపెను. సూకరములవలెఁ జిందరవందరగఁ బరుటెత్తుచుఁ శత్రువుల సమీపించిన వెంటనే యొక్కపర్యాయముగ నందఱు గుమిగూడుటే వరాహవ్యూహము. తరువాత గంకటుఁడను వానివశమున మఱికొంత సేనను సూచీవ్యూహమున నుత్తరము ముట్టడింప నంపెను. ఆదియందు సన్నముగనుండి వెనుకకుఁబోనుపోను విశాలముగునదియే సూచీవ్యూహము. తాము చనుచున్నమార్గమున కెదురుగ ఫిరంగులు మొదలగునవి పెట్టించియుండుట తెలిసికొని మహామాయుఁడనువానికిఁ గొంతసేననిచ్చి సర్పవ్యూహమున వాని శాసనముఁ గావింప బంపెను. వైరుల కెఱుకలేకుండ నేలపైఁ బడియుండి ప్రాకిపోయి పట్టుకొనుటే సర్పవ్యూహమున ముట్టడించుటందురు. ఇట్లు మూఁడు ప్రక్కలకు మువ్వుర నంపి మిగిలిన సేనను వజ్రవ్యూహముక్రింద మార్చి నడిపించుకొనుచు నాతతాయి దక్షిణముదాకఁ జనుచుండెను. వీరందఱకు వెనుక నిపుణులగు సేనానులు కొందఱు సేనతోఁ జుట్టుగొలువఁ జక్రవర్తి పోవుచుండెను. అత్తరిఁ బ్రభాతకాలమున నాలుగంటలైనను సేనలపాదఘట్టనముల

వలన లేచిన ధూళియంతయు నుదయింపఁ బోవు సూర్యునిగప్పి ప్రొద్దుదెలియకుండఁ జేయుచుండెను. అప్తీశగుణమున నాతతాయి వలన నేర్పఱుపఁబడిన నాలుగుసేనలు నొక్కపర్యాయముగఁ బ్రచండు నిఁదాఁకి బందూకుల బ్రయోగించిరి. శత్రువులు కంటఁబడినవెంటనే ప్రచండుని సేనాభటులును సాహసధైర్యములతోఁ బోరాడఁదొడఁగిరి. ఒండొరుల బందూకు ప్రయోగములవలన ననేకులు భటులు కూలుచుండిరి. ప్రచండునిసేన సార్వభౌమవాహినికంటె నెన్నియోరెట్లు చిన్నదయ్యుఁ జక్రవర్తి మొదలగువారు సహితము మెచ్చుకొనునట్లు రణముచేయుచుండెను. ఈగతి పగలు పదిగంటల పర్యంతము నందీక పెనఁగుచుండెఁగాని యొంతటికిఁ దఱుగక తండతండములుగనున్న వైరిసేనలఁగాంచి దిగులుపడ నారంభించెను. ఎంతైనను ప్రచండుఁడు ధైర్యమువదలక ప్రోత్సాహంపు వచనములఁ దనవారిఁ బురికొల్పుచునే యుండెను. పదునొకండు గంటలగునప్పటికి యుద్ధము మఱింతఘోరమయ్యెను. తుపాకులు ఫిరంగులు మొదలగువానివల్ల లేచు పొగయును నేలయందలి ధూళియునులేచి యేకమై గగనతలమునుఁగప్పి చీకట్లు గ్రమ్మఁజేయుచుండెను. అట్టియల్లకల్లోలమగు సమయమున మహామాయుండతి చాతుర్యముతోఁ దనసేననుఁ దూర్పుప్రక్కనున్న ఫిరంగులనద్దకుఁజేర్చి వానినన్నిటిఁ బ్రచండుని సేనవైపునకే ద్రిప్పించి కాల్పింప నారంభించెను. ఇటు లీప్రక్కన వైరులకు పంపుదొరకుటచేఁ బ్రచండుఁ డించుకవిచార మందసాగెను. అయినను జావృనకుఁ గొఱవక తనవారిఁ బురికొల్పుచునే యుండెను. అత్తరి బడమటిదిశనున్న సేనను నాశముఁజేసి ప్రకంపనుఁడు వ్యూహములోపలఁ బ్రవేశించి ప్రచండుని మార్కొనెను. వారిరువురు బందూకులమాని ఖడ్గములఁబూని ద్వంద్వయుద్ధమునఁ బోరాడఁగడఁగిరి. అట్టిస్థితిలో నెక్కడనుండియో తుపాకి గుండొకటివచ్చి ప్రకంపను నెడమభుజమునకుఁ దగిలెను. ఈ

వార్త నాతతాయి విన్నవెంటనే యతని రణమునుండి తొలగింప నాజ్ఞాపించెఁగాని యతఁడెవ్వరిమాటలను బాటింపక నాప్రాణమున్నంత వఱకు నే రణమొనర్చుట మాననని పెచ్చుపెరిగినరోషమున మఱి యొక దీర్ఘమగు ఖడ్గముఁబూని ప్రచండుని శిరోవేష్టనము నేలఁబడఁ గొట్టెను. వేష్టనహీనుఁడైనను ప్రాణముల కాశింపక తెగించి ప్రచం డుఁడు వెన్నీక నిలచి రణమొనరించుచు వేఱొక బారకత్తిఁగొని ప్రకంపను బొడువఁబో దాని దప్పించుకొని యతని నొక్కపోటుఁ బొడిచి ప్రకంపనుఁడు విజృంభించెను. ఆదెబ్బతో జయచంద్రుని సేనా పతి నేలకొరిగి పడిపోవ నదివఱకే నాశనమైయున్న తక్కినసైనికు లును బలాయితులు కాసాగిరి. మఱికొంద ఱంత్యసాహసముంజూపి మడియుచుండిరి. రణరంగమంతయు బీనుంగుపెంటలతో నిండు కొనిపోయి భీభత్సము గొల్పుచుండెను. రక్తము కాలువలు గట్టి పాఱుచుండెను. అంత రణరంగమంతయుఁ జరమాశాఫలకంబునఁ బ్రతిఫలించుచున్నదో యన శోణమరీచులు రాజిల్లుసూర్యుఁ డస్తమిం పఁబోవుచుండెను. ప్రచండుని సేనయందలి తుపాకులు ఫిరంగు లాది గాఁగల యుద్ధసామగ్రు లన్నియుఁ జక్రవర్తిపాలఁబడెను. సంగరము పూర్తియైనపిదపఁ జక్రవర్తియానతి నాతతాయి గాఢమగుగాయముచే వేదనపడుచున్న ప్రకంపను దగువారలచే నచటికిఁ గొంతదూరమున నున్న రాజవైద్యశాల కనిచి తక్కుంగలభటుల నెల్లర మఱియొక వైద్యశాలకుఁజేర్పఁ బరిచారకుల కాజ్ఞాపించెను. వారునుజావక బ్రది కియున్న ప్రతిక్షతదేహుని వైద్యశాలకుఁ జేర్చుచుండిరి. అక్షతదేహు లగు తక్కినసైనికులెల్లరు రణరంగమునకు దూరముగఁబోయి యటనున్న నొకచిన్న ప్రవాహమునందు దేహముల శుభ్రపఱుచు కొని యుచితాహారంబుల భుజించి కన్యాకుబ్జ నగరపుముట్టడినిగూర్చి మాటలాడుకొనుచుఁ బ్రొద్దుగడపుచుండిరి.

# ఇరువదియొకటవ ప్రకరణము.



అటు లార్యావర్తమునకంతయు నాధారభూతములైన డిల్లీ కన్యాకుబ్జరాజ్యములు రెండును బరస్పరవైరంబులు హెచ్చుపెరుగఁ బోరాడుకొనుచున్న తరుణమందే కుతుబుద్దీనుచేఁ బ్రేరితులగు మ్లేచ్ఛులు దేశమందుఁ జేయఁగడగిన క్రౌర్యములుఁ గణింప నలవికాకుండెను. ఆనాఁడట్లు చక్రవర్తిచే నోటువడి కుతుబుద్దీన్ పరువెత్తిపోయి యమునాతీరమున నొకదట్టమగు పొదరింటిలోపల బగలంతయుఁ బరులకంటఁ బడకుండ దాగుకొని చీఁకటిపడినపిదప బయటకేతెంచి నది నీది యావలి గట్టుఁజేరి తనకు సంభవించిన దురవస్థంగూర్చి తలఁచుకొనుచు రోషావేశుఁడై యార్యావర్తము ధ్వంసముఁజేయఁ బట్టుపట్టి మఱియొక ప్రదేశమం దిటు లేని గూఢముగనున్న మహమ్మదీయుల దండును జేరెను. అచటనున్న వారంద ఱితఁ డిట్లొంటరిగఁ జనుదెంచుట కేమి హేతువో యని సంభ్రమ మందసాగిరి. కొందఱు మనము జాగరూకతతోఁ బ్రవర్తించుచున్నామో లేదో యని పరీక్షింప నిట్లాకస్మికముగ వచ్చియుండునని యూహించిరి. అనంతరము కొన్నిదినంబు లేగినపిదప యమునాతీరమున జరిగిన సంగతులన్నియు గుతుబుద్దీన్ వారికెఱిఁగించెను. తోడనే వార లందఱు నుగ్రులై హుంకారములొనర్చుచు లేచి యిప్పుడే డిల్లీపైఁ దండెత్తుదమని వక్కాణించిరి. అయిన వారిని శాంతపఱిచి కుతుబుద్దీను మెల్లన ఇట్లనియె.

“సోదరులారా! ఆర్యావర్తరాజులపై నొంటిగ దండెత్తఁదగు తరుణ మింకనురాలేదు. మీ కేకాదు. మన సేననోడించినవాఁడు చక్రవర్తి యని తెలిసిననాఁటినుండి డిల్లీ నెప్పుడు మ్రింగుదునా యను నభిలాష నాకును మిక్కుటమై యున్నది. వీరింకను వారిలోవారు పోరాడుకొని

నాశనము కావలయును. పదునొకండవ శతాబ్దారంభమున మనసుల్తాను మహమ్మద్ గజినీ యీదేశముపై దండెత్తివచ్చి జయించి లెక్కలేని ధనమును గొంపోయి లాహోరున స్వతంత్రరాజ్యమేర్పఱిచిన నాఁటి నుండియు నీరాజులెల్ల రదివఱకున్నటులే యుండక శాస్త్రానుకూలమగు రణశిక్ష సైనికులకు నేర్పించి సైన్యముల బాగుపఱుచుకొనియున్నారు. ఇప్పుడీ రాజుల సేనలకు రెండింతలు మనపక్షమున నున్నను మనము వారి జయింపఁజాలము. ఏడెనిమిదేండ్లక్రిందట జయచంద్ర జీవనసింహులు లాహోరునుండి మనసుల్తాను గారిని వెడలఁగొట్టుటకుఁ బ్రయత్నముసేసి మరల నేకారణముననో మానివేసిరి. ఇప్పుడా రెండురాజ్యములు పరస్పర వైరము గలిగియున్నవి. మఱియు మన కరీమునకు బదులుగ భట్టుగారేమనకొఱకనేకప్రయత్నములు చేయుచు నాకు వార్త లంపుచున్నారు. అందువలననే మనకిక్కడనింత మాత్రము నిలుచుట కవకాశముదొరకినది. మొన్న చారులు కొందఱరుదెంచి కనూజియందు జయచంద్రుని పుత్రికకు వివాహము జరుగుచున్నదనియుఁ జక్రవర్తి కవమానముగలుగఁజేసినందున నతఁడాపురముపైనెత్తిరానున్నాఁడనియు వచించిపోయిరి. మరల నేసమాచారముఁదెలియలేదు. ఇత్తరి మీర లిదివఱకువలెగాక పెద్దపెద్దగుంపులుగఁగూడి బయలుదేరిపోయి గ్రామముల ధ్వంసముగావింపవలయును. మఱియు నీయార్యావర్తము సమస్తశాస్త్రములకుఁ బ్రసిద్ధికెక్కినదనివిందుము. పూర్వకాలమున నన్యఖండములవారు సహితమిచ్చటికేతెంచి విద్యలనేర్చుకొని పోవుచుండువారఁట. ఈకాలమున నీదేశప్రజనులు వానివిలువను దెలిసికొననేరక రెండువందల సంవత్సరములాదిగఁ జదువుట మానివేసిరి. గ్రంథములుమాత్రము మిగిలియున్నవి. ఒకవేళముందు వానినెవరైన జదివినచో మరల మననెత్తికెక్కుదురు. కావున మీకంటఁబడిన ప్రతి పుస్తకభాండాగారమును దగులఁబెట్టి యార్యావర్తమును శాస్త్ర

విహీనముగఁ గావింపుఁడు. రెండు శతాబ్దములనుండి వారి మొగముఁ జూడకుండ నున్నారుగాన నీతరుణముననే ధ్వంసముఁ జేయుటమంచిది. ఇఁక మీకుఁజెప్పవలసిన దేమున్నది? మీయిష్టమువచ్చినట్లు రాత్రియనక పగలనక కృషిచేసి జనుల నందఱఁ బ్రతిహింసఁ బెట్టుఁడు. ముఖ్యముగ శాస్త్రములనువారి భాండాగారములను వేరులేకుండఁ జేయుఁడు. అప్పుడుమన శాస్త్రములే వన్నెకెక్కును. వీరందఱు మనకే దాసులై వర్తింతురు"

ఆమాటలువినియెల్లరు పరమానందభరితులై చప్పటులుచరచుచు లేచిరి. తమయేలికయొక్క యాజ్ఞానుసారముగ గుంపులుగఁగూడి గ్రామములపైఁబడి నాశనముగావింపఁ జొచ్చిరి. కొందఱు మ్లేచ్ఛులు వృద్ధులనకఁ బాలురనక, స్త్రీలనక, పురుషులనక కంటబడిన ప్రతిప్రాణిని గత్తికెరఁజేయుచుండిరి. కొందఱు యౌవనవతులగు కాంతలఁ గొంపోయి తమయిష్టానుసారము బాధింపఁగడఁగిరి. కొందఱు పురుషుల నందఱఁ బెడరెక్కలు విఱిచికట్టి యొకచోట నిలువఁ బెట్టి వారి కనులయెదుర వారివారితల్లుల నక్క సెల్లెండ్ర భార్యలఁ జీరలవిడిపించి భీభత్సము సేయుచుండ నాఘోరములఁ జూడనోడి కన్నులుమూసికొనువారి గ్రుడ్లను నారసములతోఁ బెరికి పారవైచుచు దలలువంచుకొనువారి ఖడ్గప్రహారములఁ గడదేర్చుచుండిరి. మఱికొందఱు వృద్ధులు పడుచువారలు నగు స్త్రీపురుషుల దిగంబరులగావించి దండతాడనంబులతోఁ బరుగెత్తించుచుండిరి. కొందఱు పెండ్లికాని పడుచుల దమచిత్తమువచ్చిన చోట కెక్కడికో కొనిపోవసాగిరి. మఱికొందఱు మాంసఖాదనులు సృష్ట్యాదిగ వచ్చుచున్న సత్యగ్రంథముల ధ్వంసముకావింపసాగిరి. ప్రఖ్యాతికెక్కిన భాండాగారములందలి గ్రంథ సంచయుంబుల విశాలములగు నగ్నిగుండముల దీసి వాని

యందువైచి తగులఁబెట్టుచుండిరి. ఒక్కొక్క పుస్తకాగారము దినముల కొలఁది దగులఁబడుచుండెను. సత్యములగు నార్యుల శాస్త్రసమూహంబులన్నియు నాశనమైపోయెను. శిల్పశాస్త్రములన్నియు నడవిపాలయ్యెను. ప్రకృతిశాస్త్రంబులు మన్నుఁగలసె. వైద్యశాస్త్రంబులు రూపుమాసె. భూగోళ ఖగోళశాస్త్రంబు లేటగలసిపోయెను. సత్యశాస్త్రములన్నియు నట్లువినాశములై పోవుటవలననే యిప్పుడు ప్రబలియున్న యసత్యశాస్త్రములు మనకు గతియైనవి. మఱికొందరు కఠినాత్ములు పసిబిడ్డలగొంతులఁ బిసికి చంపఁగడఁగిరి. తల్లులహస్తతలంబులం బరుండి పాలుద్రావు పసికూనల బలవంతముగలాగుకొని "తండ్రులారా! మాకన్నబిడ్డల రక్షించి మమ్ముఁజంపు" డని శిరంబులందించుచున్నను వినక మాతలఁబడదన్ని వారికన్నులముందునాశిశువుల లేతకంఠముల నరటితూండ్లవలె ద్రుంచి మొగమునవిసరిపారవైచిపోవ దల్లులు "హా" యని గుండెలుపగిలి చచ్చుచుండిరి. మఱికొందఱు క్రూరులు కొంచెము మాటలాడనేర్చినబిడ్డ లమ్మాయని వెనుదగిలి వచ్చుచుండ వారితల్లుల నఱకి పారవైచుచుండిరి. కొందఱు రాక్షసులు చక్కగ బండికోతకు సిద్ధముగనున్న నిండుపైరుల నెక్కడివక్కడ నాశనము సేయఁజొచ్చిరి. గ్రామములందలి ధాన్యపుకొట్లకు నాముదముపోసి నిప్పంటింపఁగడఁగిరి. మఱికొందఱు దయాశూన్యులు గృహోపయోగములగుఁ బశువులఖండించి వానిమాంసము యజమానుల యెదుటనే పక్వముచేసుకొని భుజింపసాగిరి. అకృత్యములకు రోతపడువారి గ్రిందఁబడదన్ని వారినోళ్ళయందు బచ్చిమాంసపుముద్దలదెచ్చి క్రుక్కుచుండిరి. బిడ్డలఁజంప నేడ్చుపితరులయొక్కయు,బితరులఁజంప నేడ్చుబిడ్డలయొక్కయు,మగలఁబరాభవింప మూర్ఛిల్లుకులాంగనలయొక్కయు,హాహాకారంబులును,రోదనంబులునుగలసి భూనభోంతరములునిండ దేశమంతయు నల్లకల్లోలముగ గావింపఁజొచ్చిరి. ఈదుష్టాత్ములధాటికి వెఱచి కొంపలవిడ

నాడి యడవులకుఁబరువెత్తువారును, మానముగా పాడుకొనఁబ్రాణహత్య గావించుకొనువారును, తమభార్యల బెట్టుగాముల దిలకింపనోడిముందు వారిఁజంపి పిదప దమజీవంబులఁగోల్పోవు మానధనులునునై మనుష్యులు భీభత్సమగుచుండిరి. చదువరులారా! మనదేశంబున శిశుహత్యలు, బాల్యవివాహములు, సహగమనములు మొదలగు దురాచారములు ప్రబలుట కివియే కారణములు. కట్టా! ఇన్ని యాక్రందనములలోఁ గూడిన యార్యావర్తము నప్పటియవస్థఁ జూచినను, విన్నను, నెట్టివారి కైన మనస్సు కలుక్కుమనక మానదుకదా! అట్లు మ్లేచ్ఛులు విసుగు జనించు నంతదాక దేశమంతయు ధ్వంసము చేసిపోయి తమ జయమును కుతుబుద్దీను కెఱుకపఱుప సంతోషభరితుఁడై యతఁడు వారల కనేకబహుమతులొసఁగి మన్నించెను. ఆసమయమున మఱికొందఱు చారు లరుదెంచి ప్రచండునకుఁ జక్రవర్తికి జరిగినసంగరమును గూర్చి యుఁగొన్ని నూత్నవిషయములఁ గూర్చియుఁ దెలిపిరి. అందుపైఁ గొంతసేన నంపవలసినదిగ సుల్తానుగారికిఁ దెలిపి దానికొఱకుఁ గుతుబుద్దీన్ నిరీక్షించుచుండెను.



# ఇరువదిరెండవ ప్రకరణము.



ప్రచండుని నోడించిన మఱునటి దినమునఁ దెల్లవారినతోడనే చక్రవర్తి నానతి నాతతాయి తమసైన్యమును గన్యాకుబ్జముముట్టడింప నడిపించెను. ప్రచండుని పరాజయంబు విని జయచంద్రుఁ డత్యంతరోషమూని చక్రవర్తిం జంపిగాని రణముమానఁగూడదని తనసేనాపతులఁ బురికొల్పుచుండెను. వినయశీలుఁడు చక్రవర్తితో సంధిగావింప ననేక ప్రయత్నములు సలిపెఁగాని యవన్నియు నిష్ఫలములై నందునఁ దాను గయ్యమున సంబంధము గలుగఁజేసికొనక దూరముగనుండి సమయమువచ్చిన రాజునకుఁ దోడ్పడఁదలఁపూనియుండెను. చక్రవర్తి నగరమున కెనిమిదిమైళ్లదూరమున డేరాలవేయించి సేనను విడియింపఁ జేసి దాని మూఁడుభాగములుగ విభజించి యందొకభాగమునకు గంకటుఁ బతినిజేసి తూర్పుదిశయందలి ద్వారమునుబంధింప నంపెను. కుంభీలకు నాయకత్వమున మఱియొక భాగము నుత్తరము ముట్టడింపఁ బంపెను. తక్కినభాగమును మిహిరుఁడనువాని యాధిపత్యమున దక్షిణము దాకనంపి వీరందఱకుఁ దోడుపడ నాతతాయిం బసిచెను. చక్రవర్తియాజ్ఞానుసారము సైనికులెల్లఱు బందూకులుగాల్చుచు వెడలి కోటకు ముట్టడివేసిరి. లోపలనున్న జయచంద్రుసైనికులు చెలరేగి యెడతెరిపి లేకుండ ఫిరంగులను, బాణములను శత్రువులపైఁ బ్రయోగింప సాగిరి. బహిర్ద్వారంబు భేదింప వెడలిన కంకటుఁడత్యుత్సాహమున దనసేనను ముందుకు నడిపించుచుండెను.

విధివిరామము లేకుండ వచ్చుచున్న బందూకుల గుండ్లవలనఁ బెక్కుమంది చచ్చుటవలోకించి కంకటుఁడు సందులేకుండ దనసేనకడ్డముగ కుంజరయూథమున నిలువఁబెట్టించి వాహినినత్యంత పరాక్రమ

మున ముందుకు నడిపించి ఫిరంగులఁ బెట్టించి ద్వారములఁ బగులఁగొట్టిం
చుచుండెను. ఒక్కొక్క ఫిరంగితాకుడునకు పిడుఁగుపడినభంగి గొంతత
డవువఱకును హోరుమనుమ్రోత మ్రోఁగుచుండెఁగాని తలుపుమాత్ర
ము స్వాధీనము కాకుండెను. దక్షిణాశయందున్న సేన గోడలపైకెక్క
సాహసముసేసి యగాధముగ నున్న కందకమును మనుజాశ్వకుంజర
కళేబరవారంబులఁ బూడ్చి కోటగోడల కెగఁబ్రాకసాగెను. లోపలివా
రలు శత్రువులు దరికిరాకుండ నిప్పులవర్షముగురిపింపఁజొచ్చిరి. ప్రాణము
లకాశింపక సార్వభౌమసైనికులు తమవారలు కుప్పలుగఁ గూలుచున్న
ను ధైర్యమువీడక గోడల కెగఁబ్రాకుచుండిరి. వీర లిక్కడ నిట్లుపో
రాడుచుండ మిహిరుఁడు తనవారిచే నుత్తరపుగవను నాశనముజేయించు
చుండెను. ఫిరంగుల గోడలచివరలకు గురిపెట్టించి కొట్టించుచుండెను.
అందువలన నాభాగమంతయు ధ్వంసము కాఁజొచ్చెను. వందలకొలఁది
ప్రాణము లొక్కనిమిషమునఁ బోవుచున్నను వెనుదీయక చక్రవర్తిసే
న నాలుగువారములపర్యంతము హోరాహోరిగఁబోరాడుచుండెను.
అప్పటికిని గోట స్వాధీనముకాకుండెను. అంతఁ జక్రవర్తిదుర్గమునుగై
కొనికాని యావల నడుగిడనని శపథముపట్టి డిల్లీనుండి మఱికొంత సేన
ను గొనిరమ్మని వేగులవారి నంపెను. ప్రాగ్దక్షిణోత్తరపార్శ్వములే
శాత్రవులు ముట్టడించియున్నందున లోపలివారలు పడమటిదిక్కున
నించుక నజాగ్రత్తఁగనుండిరి. చక్రవర్తియీసంగతి నెఱిఁగి పడమటి
భాగమున రెండుఫర్లాంగుల దూరమునుండి కందకము మట్టమున కేట
వాలుగనుండునట్లు గోతిని ద్రవ్వి కోటగోడల యడుగున సొరంగములు
దీసి మందుగూరి కాల్చ నాజ్ఞాపించెను. గాతములుతీసి మందుఁగూరు
సమయమున నీసంగతి లోపలివారలు కనుఁగొని యాప్రక్కకేగి శత్రు
వులపై నిప్పులగురిపింప మొదలిడిరి. ఆతరుణమునఁ దూర్పుదిశయందలి
సార్వభౌమసేన విజృంభించి మొదటిద్వారపుఁ దలుపులను శకలములు

కావించెను. వెంటనే రెండవదాని భేదింప గడగిరి. పడమటిదిశయందలి వార లెట్లో తమపని బూర్తి జేసికొని ముందునకు నిప్పంటింపఁగా సంవర్తకాలమందలి పిడుగులంబలె భయంకరధ్వానంబులు మిన్నుముట్ట లేచి గోడలరాళ్లు కొన్ని గూలెనేగాని పూర్తిగఁ బడవయ్యె. అంతమరల గాతములఁదీసి మందుఁగూర నారంభించిరి. కోటగోడ లీరెండవపర్యాయము గూలునను భయంబున లోపలివారెల్లరు నీవైపునకే చేరి శత్రువుల దగ్గరరాకుండఁ జేయుచుండిరి. వేలకొలఁది గూలుచున్నను వీడక కోటను నాశనముసేయవలయునని పట్టుఁబట్టి చక్రవర్తి సైనికులు గుండ్లకు వెఱవక బందూకులదెబ్బలఁదప్పించుకొనుచుసురంగములఁద్రవ్వి మరలమందుఁగూరసాగిరి. ద్వారములు భేదింపనున్న వారుతమకించుక పైధాటి తగినందునఁబూర్వముకన్న నెక్కువగఁ బనిచేయుచుండిరి. ఎడతెరిపి లేకుండఁ బ్రయోగింపసాగిన ఫిరంగిదెబ్బలచేనా రెండవద్వారపుదలుపులును వకావకలయ్యెను. అనంతరము మూఁడవకవాటము నాశనమొనరింపఁ గడఁగిరి. పశ్చిమదిశయందలివారతిప్రయత్నముమీఁద గాతముల మందుతో నింపిమరలనగ్నినిడఁ బ్రథమమునవలెనే భీకరధ్వనులుప్పతిలి నేలయంతయు గదలి గోడలకతికిన రాళ్ళన్నియు నెక్కడివక్కడ జారిగోడలు శిథిలములయ్యెను. వెంటనే యాప్రక్కనున్న వారెల్లరు చొరవఁజేసికొని లోపలఁ బ్రవేశింపసాగిరి. ఈతరుణమందే తూర్పుదిశయందొక్కపర్యాయముగఁదాకిన నిరువది ఫిరంగులదాకున దలుపులు భిన్నంబులయ్యె. ఈప్రక్కనుండియుఁ జక్రవర్తిసేన లోపలఁ బ్రవేశింపసాగెను. అంతనాతతాయి దక్షిణోత్తరములవారికూడ లోపలఁ బ్రవేశపెట్టెను. చక్రవర్తిసైన్యమంతయు లోపలఁజేరి శత్రువులు నిప్పులఁకురిపించుచున్నను దాళుకొనుచు గోడలమీఁదికెక్కి యచ్చటివారిఁగొందఱఁగ్రిందికిఁద్రోయ నందఱునుదిగిరి. అత్తరి పోరు మహాఘోరమయ్యెను. బందూకనక, కత్తియనక, బాణములనక, లాఠీలనకయిష్టము

వచ్చినయాయుధములతో నాదటుఁబోరాడఁగడఁగిరి. చక్రవర్తిసేన కోవలికేగి యుద్ధమారంభింప జయచంద్రుని వాహినినాశనము కాసాగి తుదకు మూడువంతులు పూర్తిగ నాశనమయ్యెను. మిగిలినవార లించుక ధైర్యము చెడి పనిచేయుచుండుటఁజూచి జయచంద్రుని యుపసకలాక్షౌహిణీపతియగు కహారకంఠీరవుఁ డనువాఁడు తనసైన్యమునుమరల బురికొల్పుచుఁదాను యుద్ధమునకుదిగెను. కోటముట్టడివలనను లోపలియుద్ధమువలనను, జక్రవర్తిసేనయందును మూడువంతులకన్న నెక్కువయే నాశనమయ్యెను. ఎంతనాశనమైనను ఆతతాయి మొదలగువారువలుకు ప్రోత్సాహంపు వచనంబుల శత్రువులకు లొంగక రణమొనరించుచుండిరి. కహారకంఠీరవుఁ డొక్కుమ్మడి సెలరేఁగి చక్రవర్తిసేనయందు నడ్డమువచ్చినవారినెల్ల నఱకుచునాతతాయిని సమీపించెను. అత్తరి వారిరువురకు ఘోరమగు ద్వంద్వయుద్ధము జరిగెను. కొంతవడికి బందూకు గుండొకటివచ్చి యాతతాయి యెక్కియున్న గుఱ్ఱపుఁగాలికిఁ దగుల నది యాక్షణమందే నేలకొరఁగెను. ఆతతాయి వెంటనే నేలకురికిశత్రుప్రహారములఁ దప్పించుకొనుచు మరలనొకగుఱ్ఱమునారోహింపఁబోవుసమయమున కహారకంఠీరవుఁ డతనిశిరమును నేలగూల్చెను. అతిప్రతాపవంతుఁడగు సేనాధిపతికిట్టి పాటుకల్గుటవలోకించి సైనికులుధైర్యము వీడసాగిరి కాని యింతలోసీవార్తఁ దెలిసి పృథ్వీరాజుపరువెత్తుకొనివచ్చి మరలఁ బురికొల్పఁగడఁగెను. చక్రవర్తివచ్చినాఁడని విని కహారకంఠీరవుఁ డతనిపైకురికెను. ఆత్తరిసైనికులందఱుఁ దమరాజును గాపాడుకొనుటకై తెగించి కహారకంఠీరవుని మీఁదఁబడిరి. కానియాకలిఁగొన్న శార్దూలముభంగి వారినందఱ నురుమాడుచుఁ గహారకంఠీరవుఁడు చక్రవర్తిని సమీపించి యతనితలఁదెగవ్రేయఁగత్తినెత్తెను. ఆసమయమున యౌవనవంతుఁడగు రాకుమారుఁడొకఁ డుత్తమాశ్వముపైవచ్చి చక్రవర్తింజంపనెత్తియున్న హస్తముం దెగటార్చి తోడనేవానిశిరముంగూల్చి

భీతినందియున్న పృథివీరాజుసేనను మరలఁబురికొల్పెను. కహారకంఠీరవుని మరణమువలన జయచంద్రుని సేన పరుగిడఁజొచ్చెను. క్రొత్తగనే తెంచిన రాజపుత్రునియొక్కయుఁ జక్రవర్తియొక్కయు నుత్సాహంపు వచనములచే సార్వభౌమసేన మరల నుప్పొంగి యుద్ధము సేయఁగడఁగెను. ఈతరుణమందే చక్రవర్తి కొనిరానంపిన క్రొత్తసేన డిల్లీనుంచివచ్చి వీరలకుఁదోడ్పడి రణమొనరింపసాగెను. అనంతరము రెండుదినములకు జయచంద్రుని వాహినిపూర్తిగ నాశన మయ్యెను. లెక్కలేని బందూకులు, బాణములు మఱియు రణమునకు వలసిన యితరశస్త్రాస్త్రములన్నియుఁ జక్రవర్తిపాలయ్యెను. జయచంద్రునికొఱకు వెతకగా నతఁడెచ్చోటను గాన్పింపడయ్యె. ఇట్లు సంపూర్ణజయముఁ గాంచి చక్రవర్తి సంయుక్తను దోడితెమ్మని కొందఱు భటుల నంప వారుపోయివచ్చి యంతఃపురము పాడుపడియున్నదనియు, సంయుక్తయెక్కడఁగానరాలేదనియు వచించిరి. తన ప్రియకాంత గానరాలేదని వచింప నత్యంతవిచారమగ్నుఁడై పృథివీరాజేమిచేయుటకుఁ దోఁపకయుండ బైరాగివచ్చెను. చక్రవర్తి యతనిఁగాంచినవెంటనే సంతోషమునుబొంది యుచితసత్కారంబు లొనర్చి సంయుక్తనుగుఱించి యడుగ "రాజా! ఆమె యిప్పుడీనగరంబున లేదు. నీవు విచారింపకుము. ఆమె కేవిధమైన భయమును లేదు. ఇత్తరి నీవు నీ రాజధాని కేగుము. ఆమె నచటనే పెండ్లియాడఁగల" వని నోదార్చి బైరాగి వెడలిపోయెను. అనంతరము చక్రవర్తి సేనాసమేతుఁడై తన్నుఁగాపాడిన రాకొమారుని వెంటఁగొని నిజరాజధానికిఁ బయనమై పోయెను.

---

# ఇరువదిమూఁడవ ప్రకరణము.

కన్యాకుబ్జనగరమున రణము జరుగుచున్నంతకాల మీశ్వరభట్టుగా రాపురమునకుఁ బదిమైళ్ళదూరమున నొక చిన్నయడవిలోనుండి సేవకులవలన నేనాఁటివార్తలానాఁడు తెలిసికొనుచుఁ దుదకుఁ జక్రవర్తి జయమంది దుర్గము నాశనముగావించి పోయినాఁడన్నవార్తవిని యటనుండి బయలువెడలి పట్టణములోనికేతెంచిచూడఁ గోట యెక్కడిదక్కడ శిథిలమై యుండెను. హతశేషులగు సైనికులతనిఁగాంచి యాప్తురుమని యేడువసాగిరి. వారినందఱ నోదార్చి 'జయచంద్రుఁ డెక్కడ' నని యడుగుడు బ్రతివాఁడును దనకుఁ దెలియదని వచించెను. అంత వారినందఱఁ గొలువుకూటంబున నుండ నాజ్ఞాపించి తా నొంటరిగ నవరోధసౌధముల కేగి యందు రహస్యమందిరముఁ బ్రవేశించి వినయశీలునితో సంభాషించుచున్న జయచంద్రునిఁగాంచి యగ్గలమగు నోర్వలేమి నతఁడు వినయశీలునివలలోఁ జిక్కితన్ను పాటింపఁడను భయంబున మెల్లమెల్లనఁ జేరబోయి నమస్కరింప నతఁడు కూరుచుండుమని మఱేమియు మాటలాడక తలవంచుకొని యూరకుండెను. అత్తరి భట్టు రాజు మనసు నిశ్చయముగఁ దిరిగిపోయినదనితలఁచియెటులైన మరల దనమార్గమునకుఁ ద్రిప్పుకొనన నెంచి యిట్లువచింపసాగెను.

"రాజా! ఇట్టిసమయమున మీ రిటు విచారపడుచుఁ గూరుచున్నఁ గార్యమేమయినఁ గలదా? ఎటువంటివారికైనఁ గాసిమ్ము; ఒకానొకవేళఁ గష్టములు రాకమానవు. కష్టములు కలిగినతరి దుఃఖించుచు సౌఖ్యములు కలిగినతరి సంతసమయంతవారు తేరసి పొంగిపడుట సజ్జనుల లక్షణముగాదు. నీకిత్తరి నపజయము కలిగినదని నిరుత్సాహుఁడవు కాకుము. రణమందు జయాపజయంబు లొకరి స్వాధీనములుకావు. ఇప్పుడోడినవాఁడు రేపు గెలుచును. రేపు గెలిచిన

వాఁడు మరల మరునాఁడోడును. క్షత్రియులగువారికి జయాపజయంబులు కాక వేరేమున్నవి ? కాని యుత్తమక్షత్రియుం డగువాఁ డపజయముకలిగినప్పుడే యెక్కువ ధైర్యము నవలంబించి యుండవలయును. ఇంతమాత్రమునకే జడుపునొంది నీవిట్లూరక కూరుచుండియుండుట యుక్తముకాదు. ఇత్తరి మనకుఁగలిగిన పరాభవమునకు వెఱచి చక్రవర్తి నింతటితో వదలెద నని తలఁచెదవేమో ! కలయందైన నట్లు తలఁపకుము. చక్రవర్తి నాశనముజూచికాని నేప్రాణముల వదల నని నిక్కముగ నమ్మియుండుము. మనసేనమూలముగనే యతఁడు చచ్చునని తలఁచి తక్కినవిషయములు నీతో వచింపలేదు కాని యిప్పుడు నాపన్నుగడలన్నియు దెల్పెదవినుము. ఢిల్లీయందు గరీమునకును నాకును కలిగినమైత్రివలన గుతుబుద్దీన్ అను మహమ్మదీయ సేనానాయకునకు నాకు స్నేహముకలిగినది. నేను ఢిల్లీనివదలి ఇక్కడకు వచ్చిన తరువాత నక్కడి సంగతులేమో కనుగొని రమ్మని నా సేవకులఁ గొందఱఁ బంపితిని. వారువచ్చి కరీమును జెరవైచిరని తెలిపిరి. అనంతరము గొన్ని దినములకుఁ గుతుబుద్దీన్ వద్దనుండి మాకొఱకిరువురుభటులు లేతెంచి యట గరీమువార్త విన్నపిదప నాకొఱకై వెదకికొనుచువచ్చి యిక్కడ గలిసికొని కుతుబుద్దీనుకపజయము కలిగినందున నతఁడు వేరొకస్థలమున నున్నాఁడనియు మఱియు గొన్ని నూత్నవృత్తాంతము లెఱింగించిరి. ఢిల్లీపతిని రాజ్యభ్రష్టునిఁ జేయ వారు నన్నాలోచనయడుగ నన్యమతస్థుల నేల ప్రోత్సాహపఱుపవలె ననియు మనమే చక్రవర్తినినోడించిన నారాజ్యము మనకేదక్కగలదనియు నూహించియెటువోయి యెటువచ్చునోయని వారితో వైరముమాత్రము పెట్టుకొనక మంచిమాటలతో నింతవఱకు నాపియుంటిని. అదియుంగాక యతనిమనస్సును సంతోషపఱుప దేశమున గొన్నియల్లరులు గలుగఁజేయుమని చెప్పిపుచ్చితిని. అతఁడు మరలఁ

గొండజుచారులఁ బంపియున్నాఁడు. చక్రవర్తి నెదురింపఁదగిన ప్రబల సైన్యమునుంచుకొని దేశమును బాడుచేయుమని యిప్పుడుమరలఁ జెప్పిపుచ్చెదను. గ్రామములం దల్లరులు సాగించినచో నట్టివారి దండించుటకై వచ్చి వారిచేతులలోఁజిక్కును. చక్రవర్తి దుర్గముననుండ జయించుట మనతరముకాదు. కావున నీవు దుఃఖముమాని బయటికే తెమ్ము" అని కుతుబుద్దీనుఁ దనకు జరిగినవిషయములు దెలిపి కొన్ని లేఖల గనుపఱుప జయచంద్రుఁ డించుక కలఁకఁదేరి మాటలాడ నారంభించెను.

అసూయాపరుఁడగు మూఢుఁడు తన కెంతనష్టము గలుగుచున్నను దనవైరి నాశనసూచకములగు బలుకులు పల్కినంతనే మరల దుర్మార్గములు సేయుటకే కడఁగుఁగాని బుద్ధిగలిగి యూరకుండుననుటకల్ల.) చక్రవర్తిజయమువలనఁ బట్టరాని యార్తాశోకములకు దావలుఁడై రహస్యమందిరము శరణుఁజొచ్చిన జయచంద్రునకీశ్వరభట్టుగారి కుత్సితంపువాక్యంబు లమృతోపమానము లయ్యెను. పురమంతయు నల్లకల్లోల మగునట్లు రణము జరుగుచున్నంత కాలము నిటు మొగమైనఁ జూపక పారిపోయి యెక్కడనో తలఁదాచుకొనివచ్చిన పిరికిపందలలో నగ్రగణ్యుఁడగు నీభట్టుగారి నీతివాక్యములచే రాజన్యాయముగ మోసపోవుచువచ్చెను. భట్టుగా రెంతకైన మాటకారియే కాని క్రియాశూన్యుఁడు. సమయమువచ్చినదన్న నంతఃపురదాసీల కాళ్లనైనఁ బట్టుకొనును. కాని జయచంద్రుని దగ్గరమాత్రము ధీరత్వము తోపఁ గోటలుదాటునట్లు వచించుచుండును. భట్టుగారు వచించిన మీఁద నారాజు మరల "అయితే మీరిప్పు డేమిచేయ నెంచియున్నా" రని యడిగెను. అందుమీఁద నతఁడుతిరుగ దారిలోనికి వచ్చుచున్నాఁడని తలఁచి "చక్రవర్తినెదురింపఁ దగినసేనను సుల్తాను వద్దనుండి తెప్పిం

చుకొని యీచుట్టుప్రక్కల నాశనముకాఁగా మిగిలిన గ్రామముల వెం డియుఁగొల్ల గొట్టించుమని చెప్పివంపెద" ననిమఱియు నిట్లు వక్కాణింపసాగెను. "రాజా! నీవెంతమాత్రమధైర్యపడకుము. బయటికేతెంచి యథాప్రకారముగ నీరాచకార్యములఁ జక్కఁబెట్టుకొనుము. హతశేషులగు సైనికులు నీకొఱకై యంతటను వెదకుచున్నారు వారి నందఱ నూరడిల్లఁబలికి నీమిత్రుఁడగు పురిహారరాజకులునకు వర్తమానమంపుము. అతఁడు తత్క్షణమతనిసేననంతయు దీసికొని నీకు సహాయపడఁ జనుదెంచును. ఇంకను నీకు మిత్రులైయున్న యితరరాజులఁ బిల్వనంపుము. వారును సేనాసహితులై నీకుఁదోడ్పడఁ జనుదెంతురు. నే నింతలో సుల్తానుగారినికూడ బిలుపించుకొని చక్రవర్తి నెదురింపుమని కుతుబుద్దీనుకు వ్రాసిపంపెదను. ఒకవేళసుల్తానున కపజయము గలిగినచో మనము ద్రోహముఁజేసినరాజుల నందఱివెంటఁగొనివారికి సహాయులమైపోవుదము. అప్పటికి మనకే పరాజయముగలిగినతర్వాతఁ జూచుకొందము. అవివేకులగు నీముసలివారలమాటల లెక్కగొనకు" మని భట్టుపల్కెను.

ఇంతవఱకును బైకిపొంగివచ్చుచున్న కోపమునంతయు నణఁచుకొని యూరకకూరుచుండియున్న వినయశీలుఁడు రోషపూరితుఁడై చివాలునలేచి "మూఢుఁడా! జయచంద్రు నింతటితోనైన బాగుపడనీయ దలఁచుకొనలేదా? మీమూలముననేగదా యితని కీగతి పట్టినది. దుర్మార్గుఁడా, మీఁదుమిక్కిలి నన్నే యెత్తిపొడిచెదవా? చక్రవర్తిపై లేనిపోనివి కల్పించిచెప్పి యుద్ధమునకుఁబురికొల్పి సేననంతయు ధ్వంసము కావించితివి. ఆరణమున నీవెక్కడఁ జచ్చితి" వన భట్టుగారు రుగ్రుఁడై "అయ్యా! ఈ లేనిపోని కంఠశోష తమకేటికి? మే మిరువురము దగవులాడుకొని మావాదము దీర్పుడని మిమ్ము వేడుకొంటిమా

జరుగవలసిన రాచకార్యములగుఱించి మేమేమో మాటలాడుకొను చుండ నడుమమీ రేటికి సంబంధము గలుగఁ జేసికొనెదరు? చాలు నీపా పాటికిఁ దమరూరకుండుఁడు." అన మితిమీరివచ్చుచున్న యాగ్ర హమునాపుకొని "జయచంద్రా! బాగుపడఁ దలఁచుకొంటివేని నేనింతకుముందు చెప్పినట్లఁ జేయుము. లేకున్న నీయిష్ట"మని వినయ శీలుఁడు వెడలిపోయెను. అతఁడు వెడలిపోవుటతడవుగ భట్టుమఱికొన్ని యిచ్చకములువల్కి రాజును బయటకుఁగొనివచ్చెను. జయచంద్రుఁడు సభకేతెంచి హతశేషుల మన్నుపడిపోయినచోట్ల దుర్గమును బాగు పఱుప నాజ్ఞాపించి మఱియు నితరసమాచారములఁ గూర్చి ముచ్చటించు కొనుచుండ పరిచారిక లేతెంచి సంయుక్తయెక్కడను గానరాలేదని వచించిరి. అగ్గలమగు నీర్ష్యాగ్రస్తుఁడై యహరహము జక్రవర్తినాశన ముగావింపఁ దత్పరుఁడై యున్న యాతనిమనస్సుకుఁ బ్రియకుమారిక పోయినదని వచించినను నావంతయుఁ జింతకలుగదయ్యె. కానరాలే దని వచించినతోడనే యుగ్రుఁడై "పోనిండు గతించినదని యూరకుం డెద. దానిచింత యేల? మీరుపొం" డనికూతురుపైఁ గలకోపంబునఁ బరిచారికలసహితము కసరికొట్టిపంపెను. అనంతరము భట్టుగారి సల హాప్రకారము బురిహారరాజకులునకు లేఖవ్రాసిపంపి యానాఁటికిఁగొలు వుఁజాలించి వెడలిపోయెను.

ఇక్కడ నిట్లుండ రాజధానియందు జక్రవర్తిప్రవేశించినదినమున ననేకములగు వేడుకలు జరిగెను. పురమెల్లెడల నలంకరించి నల్లడల జక్రవర్తిజయము జాటించిరి. చక్రవర్తి నెదురింపవచ్చువారలిట్లే చెల్లా చెదరుగ నెగరగొట్టఁబడుదురని సూచించుభంగి కోటబురుజులపై నాడిన జయస్తంభములకుఁ గట్టిన శ్వేతవసనంబులు మిక్కుటముగఁ గొట్టుకొనుచుండెను. మఱునాఁడొకగొప్ప సభజరిగెను. అందుసకలా

క్షౌహిణీపతులు, సేనాపతులు, మంత్రులు మొదలగువార లాసీనులై యుండిరి. అత్తరి చక్రవర్తి సంగరమున తన్ను రక్షించిన రాకుమారుని రప్పించియుత్తమాసనం బొసంగి మన్నించెను. సభయందలివారెల్ల నతని వేయిగతులం బ్రస్తుతింపసాగిరి. స్నిగ్ధమై కళకళలాడు నాకుమారుని మోము చక్రవర్తి కడుతడవుపీక్షించి యనురాగ మధికముకాంగా నతని పేరడిగి కమలాకరుండని తెలిసికొని వివిధములగుంబతకముల బహుమానముగనిచ్చెను. అత్తరి నారాజపుత్రుండులేచి వినయమొప్ప "రాజచంద్రా! నన్నింతఘనముగం గొనియాడనేల? మీదయకుం బాత్రుండ నగుదునేని యియ్యెందగిన మీవ్రేలియుంగరము నొసంగవేఁడెద" నన "కమలాకరా! మృత్యువునోటంబడనున్న నన్ను రక్షించి పుణ్యంబుగట్టుకొంటివి. అట్టియెడల నాశరీరమే నీస్వత్వమైయుండ దాని పైనున్న భూషణములయెడ నీకుస్వతంత్రములేదా? నీకువలసినది పుచ్చుకొను"మని తనవ్రేలియుంగరము నిచ్చి చక్రవర్తి యతని విడిచి యుండఁజాలక నాఁటినుండియు దనదగ్గరనే యుంచుకొనెను.



# ఇరువది నాల్గవ ప్రకరణము.



అట్లు చక్రవర్తి కమలాకరు నొకనిముసమైన విడిచియుండఁజాలక యతనియం దత్యంతానురాగము కలవాఁడై తుదకు భోజనశయనాదులయందు సహితము తనవద్దనే యుంచుకొని యొక్కొక్క పర్యాయ మహా! ఇతని బురుషునిగ నిర్మించిన యా పరమేశ్వరు నేమనవలయు? వీని ముఖలక్షణములు కేవలము సంయుక్తనే పోలియున్నవి. సిక్కముగ సితసవదనంబు లక్ష్మీవిలాసమున కాటపట్టయియుండుటచేఁ గమలాకరుఁ డను నామము సార్థకమగుచున్నదఁట? అని వానికులగోత్రాదుల నడుగ నుంకించి యతఁడేమనిభావించునో యని యడుగమానుచు నడుగకున్న మనసుసిలువమిఁ దనలో నెవనిగాని నీకులగోత్రాదు లేమని యడిగిన దప్పగునా యనుకొని వెండియు నిప్పు డడిగినయెడల నిన్నిదినంబుల నుండి నాచేష్టలగాంచుచు సందేహము నొందియున్నందున నేమను కొనునో యని తుట్టతుద కడుగుటమాని సంయుక్తాకృష్టహృదయుఁడై దినములు గడపుచుండెను. ఇంతలో బైరాగిచనుదెంచెద నని చెప్పిన గడువును మీరిపోయెను. అంతఁ బృథివిరాజగ్గలమగు మోహంబున "హా! నాప్రియురాలి సమాచారం బెఱుంగక దుఃఖించుచుండ నాకడ కేతెంచి నన్నోదార్చి కొద్దిదినములలో వచ్చి నిన్నుఁ గలిసికొనెదనని వచించిన బైరాగి యింతవఱకు రాకతడయుట కేమికారణము? అతండు రావలసినదినంబు నిన్నటితో గడచిపోయెను. ఆహా! ఆసొగసులాడిం జేపట్టి సుఖించుభాగ్యంబు నాకేనాఁటికైన లభించునా? ఆ తన్వంగి కర స్పర్శనంబున మేనుగరుపార నుల్లాసమునొందు భాగ్యము నాకెప్పటి కైనఁ జేకూరునా? లజ్జానతాననయై మందహాసమొలుకఁబలుకు నా చిలుకలకొలికి వాక్యామృతధారలచే నామనోరథతృష్ణను బాపుకొను

పున్నె మేనాటికైన సంభవించునా! ఆవన్నెలాడికై కదా! అంత ఘోర రణము గావించితి. తుదకాకన్నెను కన్నులారగాంచు భాగ్యమునకైన నోచుకొననైతి. కట్టా! మే మందఱము రణంబున మునిఁగియుండ దుర్మార్గులెవరైనను నామెం గడదేర్చియుండరుగదా ? కాకున్న నామె జనకుండు నన్నంతనీచముగ రాతిబొమ్మను జేసి యవమానపఱిచినతరి నా విగ్రహము మెడను బుష్పహారము వైచి నాయవమానమునంత యుఁ బోఁగొట్టిన యాజగన్మోహిని రణమున జయముగొనియున్న నన్నువీక్షించుట కేలరాకుండును. తా నవరోధముఁబాసి రాకున్న మానె; నాయందంత ప్రేమగలిగియున్న వనిత నాసమాచార మర యుటకై దాసీజనంబునైన నంపదా? నిక్కముగ నామె కేదోకీడు మూఁడి యుండవచ్చును. నన్ను వలచియున్నదను రోషంబున నొకవేళ జయచంద్రుండే యామె కపకారముగావించి యుండఁడుగదా?అయ్యో! నాప్రేమంపుఁదొయ్యలి కట్టియపకారమే కలిగియుండిన యోగి నావద్ద కేతెంచి యట్లేల వచించును?'ఆమె కేవిధమైనభయము లేదు. నీవిప్పుడు రాజధాని కేగుము.ఆమె నచటనే పెండ్లియాడగల'వనిక దాఁబైరాగి చెప్పి నాఁడు. అతఁడు నాతో నబద్ధములెన్నటికైన వచించునా! వచింపఁడు. అతనినప్పుడే నావెంటగొని రాకపోవుట నాదే తప్పిదము. పాపమతఁ డేయిక్కట్టులఁజిక్కెనో? ఆ యిందువదన సుందరలావణ్యాంబురాశినిఁ దేలని నాజన్మము నిరర్థకము" అని పెక్కుగతుల విచారించుచు బైరాగిపోవునపు డిచ్చిన సంయుక్తచిత్రపటముం గైకొని "ఆహా! పటమునందే యింతకళావిలాసమైయున్న నీ మోహనాంగిరూపము బ్రత్యక్షముగఁ జూడఁగల్గిన నెటులుండునో కదా? దీని చిత్రించిన చిత్ర కారునకుఁ బ్రాణముఁబోయు సామర్థ్యము లేకుండు టెంతయు విచారకర ము. తెప్పలల్లార్పక సరసీమధ్యమందలి రాయంచలవిహారములు గాం చుచున్నట్లీబాలికెంతయో నిపుణముగఁ జిత్రింపఁబడెనది. ఔరా! మంద

యానంబున నీవనీతలవిహారము లొనర్చు మలయమారుతుఁడు నాకన్న నెన్ని మడుఁగులో ధన్యాత్ముఁడుగఁ గాన్పించుచున్నాఁడే. లేకున్న వంకరలై ముఖసరోజము నావరించియున్న యాకన్నియముంగురుల స్పృశించి యేల చలింపఁజేయును ?" అని మిక్కుటమైన మదనోన్మాదంబునఁ జిత్రపటమనుమాటమఱచి "మారుతాధమా ! నేనుకట్టెదుట నుండ నాప్రియురాలివదనమేలస్పృశించెద" వని దండింపఁబోయి మరలఁ దెలివిదెచ్చుకొని తానుగావింపఁబోయిన పనికి సిగ్గుపడుచు నిట్టూర్పుఁబుచ్చి యిటునటుఁ జూడఁ గమలాకరుఁడ చెంతనుండెను.

అత్తరి జక్రవర్తి మనస్సునిలుపలేక యతనిదరిజేరి "కమలాకరా! ఇటుఁజూడుము. ఈచిత్రపటమునందున్న కన్యకయొక్క-రూపవైఖరులు నీయందుఁ గన్పట్టుచున్నవి. ఈపె నీకేమైనఁ గావలయునా?" అని యడుగ "రాజేంద్రా! శైశవమాదిగ నీకన్యయు నేనును నన్నచెల్లెండ్రభావముతో నొకటిగనుంటిమి. మాయిరువురరూప మొకటియే. ఇందు నీ వేమియుఁ దప్పుదలంపలేదు. రూపమొక్కటి యగుట వలననే జయచంద్రుఁడు మొదలగువారు మాయిద్దఱ నొకరీతిగఁ జూచుకొనుచువచ్చిరి. ఇప్పుడీమె మారువేషముతో నెక్కడనోయున్నదని నా కొకయోగిచెప్పినాఁడు. మగల కొద్దిదినములలో మేమిద్దఱ మొకటియగుదు మనుధైర్యము నాకున్నది." అని కమలాకరుండు పలుక "బాలకా! నీయీచెల్లెలిం గాంచకున్కి నాకన్నులు వాచియున్నవి. ఎటులైన నీమెదర్శనలాభముఁ నాకుఁగలుగఁజేయుము ఇన్ని దినంబులనుండియు నీవదనసందర్శనమునఁ బ్రాణంబుల నిలుపుకొనియుంటి. ఈమె ప్రస్తుత మెచ్చటున్నదో వచింపు" మని దీనముగ వేఁడుకొనుచున్న చక్రవర్తి యవస్థనంతయుఁ గాంచి కమలాకరుఁడేమియుఁ జేయఁజాలక యూరకనిలచియుండెను. అత్తఱిఁ జక్రవర్తి యుస్స్రని నిట్టూర్పులువిడచుచు "హా! మనోహారిణీ! నన్నిట్టిబెట్టిదములకుఁ

బాలు జేసి నీ వెచటి కేగితివి? ఇంత యవస్థపడుచున్న నన్నుఁగాంచిన నీకు భయముగలుగదా? నాహృదయస్థురాల వైననాటినుండియుఁ దిన్నగ నిద్రాహారంబులుగూడ లేవు. రమ్మా! ఏల జాలముఁ జేసెద" వని యొక సోఫాకుఁ జేరగిలంబడి కనులు మూసికొనియుండఁ గమలాకరుండు చెంతకేగి యతనిశరీరము నిమురుచు "రాజ చంద్రా! లెమ్ము! ఇట్టి దీనాలాపంబు లాడుట నీవంటిధీరులకుఁదగునా?" యన స్పర్శసౌఖ్యమునంది చక్రవర్తి దిగ్గున లేచి చెంత గమలాకరుండు దక్క పరులెవ్వరు లేకుండుటఁజూచి విషణ్ణుఁడై "కమలాకరా! నీ కర స్పర్శనంబున నాకమితమగు నానందము గలిగినది. ఆహా! నీహస్త మెంతమృదువుగ నున్నది? ఇటురా" మ్మని చేరువఁ గూరుచుండబెట్టు కొని యేమేమో వచించుచుండ నూకొట్టుచు "నయ్యో! నాయుపా ధ్యాయుఁడే తెంచి యితనిమనోరథ మెప్పుడుదీర్చునోగదా" యని కమ లాకరుండు తలపోయుచుండెను.

ఇట్లు చక్రవర్తి చింతాకులుఁడై యుండ రెండు రాత్రులు గడ చెను. మూఁడవనాఁడు తెల్లవారి యేడుగంటలగునప్పటికిఁ గమలా కరుండు నిదుర లేచి ప్రాతఃకాలకృత్యముల నెరవేర్చుకొని చక్రవర్తి యప్పటి కింకను లేవనందున దానొంటరిగ బయటికేతెంచెను. ద్వార ముబయట నడుగుబెట్టినతోడనే యతనికిఁ గల్గిన సంతసముఁగూర్చి యేమని చెప్పనగును! ఉత్కంఠుఁడై యెవరికొఱకు నింతకాలము గను పెట్టుకొనియుండెనో యతఁడెదురుగవచ్చుట సంభవింప నతనిపాదముల కెఱఁగి యేకాంతమగుచోటికిం గొనిపోయి పృథివీరాజువృత్తాంతమంత యు నెఱుకపఱిచి "తండ్రీ! ప్రతినిముసము నీరాకకై యెదురుజూచుచు న్నాను. వచ్చెదనని చెప్పిన గడువునాఁటికి రాకుండుటకు మీ కేమియా టంకములు సంభవించిన" వన నావచ్చిన మనుజుఁడు "కుమారీ! ఇల్లుబయలుదేరినది మొదల న్నియు నాటంకములే. చుట్టుపట్ల మ్లేచ్ఛులు

చేయుచున్న యార్భాటము లెక్కువైనవి. గ్రామస్థులున్న యూళ్ల వదలి యడవులపాలగుచున్నారు. ఎవరెట్లగుచున్నను ముందుజన్మింపఁ బోవువారలకు నాధారములగు గ్రంథజాలములు నాశనమై పోవుచున్నవి. నేనుమీతో వచించినప్రకారము మొన్నటికే రాకపోవుటకుఁ గారణము వినుము. ఇక్కడ కరువది మైళ్ళదూరమున నున్న యొక యూరిలోఁగల గొప్ప పుస్తకభాండాగారమును మ్లేచ్ఛులు తగులఁబెట్టి తద్గ్రామవాసుల నాశనముచేయుచున్నారని విని యాయూరికేగి నిరాధారులై విలపించుచున్న యక్కడివారి నందఱఁ బురికొల్పి మహమ్మదీయు లేతెంచిన నెదురింప సిద్ధముసేసితిని. అంతనానాఁడు ప్రొద్దుగ్రుంకిన యెనిమిదిగంటలకుఁ గొందఱుమ్లేచ్ఛులు మండుచున్న కాగడాలఁ బట్టుకొని గ్రామముఁ బ్రవేశింపఁదొడఁగిరి. అత్తఱి నే సిద్ధముచేసియుంచిన గ్రామవాస్తవ్యసంఘమును మ్లేచ్ఛులూరిబయటనుండఁగనే వారిపై నడిపించితి. గ్రామస్థులు నాయుత్సాహంపు వాక్యములచే ధైర్యమూని శత్రువులతోఁబోరాడి చివరకు నందఱివధింపఁ గొద్దిమంది తప్పించుకొని పరువెత్తిరి. మరల నట్టిసమయము తటస్థించినఁ బోరునకుఁ బురికొల్పుకొనిపోవుట కొఱకని నేర్పఱచి నేనిట్లు బయలువెడలివచ్చితి." అన "తండ్రీ! నాయెడఁ జక్రవర్తికిఁగల యనురాగమంతయు వెల్లడియైనది. అతఁడు నిద్రాహారంబులుమాని కృశించుచున్నాఁడు. ఎటులైననతనివాంఛితంబు ద్వరలోఁదీర్పు" మన కుమారీ! నేఁడ నీకోర్కె నెరవేర్చెదను. నీవిఁక నీపురుషవేషము నుజ్జగించి చెలికత్తెలఁ గూడుకొని చక్రవర్తి యుండు ప్రాసాదముచెంతనున్న కేళీవనిలో విహరింపుచుండుము." అని యానూత్నమనుజుఁ డాజ్ఞాపింప నామెయు నట్లనే యొనరింపఁబోయెను. అనంతర మతఁడు బైరాగివేషముదాల్చియప్పుడే సార్వభౌమ కేళీవనిం జేరి యేమిజరుగునో యని యొకపొదరింట డాగియుండెను.

అంతఁ గొంతసేపటికిఁ జక్రవర్తి సంయుక్తవచ్చి తనయంకతలంబునఁ గూరుచున్నట్లొక కలగని దిగ్గున నులికిపడిలేచి యెవరును లేకుండుటచే విభ్రాంతుఁడై పార్శ్వవర్తులఁ బిలచి కమలాకరుఁ డెక్కడనని యడుగ "నతఁడుదయమున నే లేచి యెక్కడకో పోయినాఁడు. ఇంతవఱకు మఱలిరాలే" దని వారు వచించిరి. చక్రవర్తి యామాటలకు విచారమూని ప్రాసాదము నల్గడల వెతకించి కార్యముగానక వెతంబడుచు "హా! మొన్న నడిగినందుల కలుకపొడమి కమలాకరుఁ డెక్కడికో పోయియుండునని " అయ్యో! నాప్రియురాలిదర్శనము గలుగకపోయినను నతనిగాంచుటవలన నింతసంతసింపుచుంటి. ఇఁక నెవ్వరిఁగాంచి మోదమందుదు" నని వంతనొందుచు నటనుండ మనసొప్పక వనముం బ్రవేశించి యందొక మూల సంచరించుచున్న స్త్రీసంఘముంగాంచి యెవరోయని యించుక దగ్గర కేగి యందఱు తన పరిచారికా జనంబులైయుంట గుర్తించి వారి నచ్చోటుఁజాసి పొండని చెప్పుటకు మఱింత దగ్గర కేగి వారిమధ్య నవకళానిధిబోలెనున్న సంయుక్తంగాంచి పెన్నిధిం గన్న పేదవోలె సంభ్రమాక్రాంతచిత్తుఁడై కొంతతడ వామెను గనురెప్పలువ్రాల్పక గనుంగొనుచు నిలువఁబడి తుదకు"ఆహా! ఈతొయ్యలి యేమెకదా! నామోహంపు మొలక. ఎన్ని దినంబులకు నానేత్రసాఫల్యము గలిగినది. ఈలావణ్యగాత్రి యీయుపవన మెట్లుప్రవేశించెనో" యని యాశ్చర్యపడుచుండ సంయుక్తయు వాల్గన్నులఁదనప్రియుని వీక్షించుచుఁ దన్నతఁడు గాంచినతరి మరియొకవైపున జూచుచుఁ దలవంచుకొని నిలువఁబడియుండెను. చక్రవర్తి యామెవిలాసముంగని పట్టరాని తమకంబునఁ జేరవచ్చుచుండఁ జెంతనున్న పరిచారికలు పొదలమాటున కేగిరి. తోడనే యతఁ డామెపాణిగ్రహణము గావించెను. అప్పుడు వారిరువురకుఁ గలిగిన యానంద మింతింతయని వచింప నలవికాదు. ప్రస్వేదముద్భవింపఁ బులకలునిండార నిరువురు గొంతసేపటివఱకు

దేహములు మఱచియుండిరి. అప్పటివారిసౌఖ్యము కేవలమనుభవైక వేద్యమే గాని వేరుకాదు. చక్రవర్తిస్నిగ్ధమై కళలదేరుచున్న యాబాలికమోమునుగాంచి మోహమగ్గలమై త్రిప్పి ముద్దుకొనఁబోయెనుగాని యామె తటాలున ముఖము నవతలకుద్రిప్పుకొని చేయివిడిపించుకొని యించుకదూరమునకేగి నిలచెను. అంత నతఁడుమరల నామెను గలిసికొనఁ బోవుచుండఁ బొదరింటడాగియున్న బైరాగి బయటికేతెంచి యెదుట నిలచెను. చక్రవర్తి యతనిగాంచుటతోడనే తత్తరమంది నమస్కరించి నిలువ "రాజేంద్రా! నీపై మోహముగలిగియున్న ను నీపెయింతవఱకుఁ గన్యకయేగదా. గురుజనంబులు లేనియెడ నీమెనొంటరిగఁ జేపట్టుట యుక్తమగునా? ఇప్పు డీమెం దగినపరిచారికలతో నంతఃపురముఁ జేరఁబంపుము. నీవు నీమందిరమున కేగియుండుము. పురమంతయు నలంకరింప నాజ్ఞాపించి రేపే మీవివాహము నెరవేర్చెద"నని బలుక యోగికి మాఱుబల్కనోడి యభీప్సితకార్యసిద్ధికాటంకము లెన్నైనగలుగుచుండు ననుకొనుచుఁ జక్రవర్తి యచ్చోటు విడిచిపోయెను. సంయుక్తయుఁ దరువాతఁదన్నుఁ జేరవచ్చిన పరిచారికలంగూడి రాణివాసమున కరిగెను. బైరాగి వివాహప్రయత్నము లొనరింప వెడలిపోయెను.



# ఇరువదియైదవ ప్రకరణము.



యోగి తానువచించినప్రకారము మఱునాఁడు మహావైభవముతోఁజక్రవర్తికిని సంయుక్తకును వివాహముగావించి నూతనదంపతుల దీవించి మరలవచ్చెదనని సెలవుపుచ్చుకొని వెడలిపోయెను. చక్రవర్తియు గమలాకరుండు సంయుక్తయేయని తెలిసినపిమ్మటఁ బట్టరాని యానందము నొంది తనకట్టియుత్తమసతి యర్థాంగి యగుటచే గర్వము నొంది యుండెను. కొలువుకూటమున కేగుటమాని సదాయంతఃపురమందే యుండుచువచ్చెను.

రాజుఇట్లున్నను మంత్రియగు విజ్ఞానశీలుండు మాత్రమేమరక జాగరూకుఁడై రాచకార్యములఁ జక్కబఱుచుచుండెను. మ్లేచ్ఛులదాడి కోర్వఁజాలకున్నామని పరగ్రామములనుండి యనుదినము లేఖలువచ్చుచుండెను. ప్రధానియుఁ జక్రవర్తికిలభించిన నూత్న సౌఖ్యమునకుఁ బ్రతిబంధకము గలిగింప నిష్టములేనివాఁడై తానే యన్నింటినవరించుకొని పోవుచుండెఁగాని దినములు గడచినకొలఁది బత్రికలెక్కువై తమరాజ్యమంతయు నల్లకల్లోలమగుచున్నట్లు తెలియవచ్చుచుండెను. అత్తరి మెల్లనఁజక్రవర్తిం బిలిపించి సంగతులన్నియు విశదపఱుపగాఁ దనరాజ్యమునందట్టి హాంతకు లుండరాదని మ్లేచ్ఛులకుఁ దెలియపఱుపవలసినదిగానాజ్ఞాపించి యతఁడూరకుండెను. ఎన్నియుత్తరవులుపోయినను మహమ్మదీయు లారాష్ట్రిము వదలకుండిరి. తుదకుఁ బ్రజలందఱు డిల్లీ రాజ్యమును విడిచిపోవుచున్నామని చక్రవర్తికడకు లేఖలనంపిరి. పృథివీరాజా లేఖఁగాంచి తానంతవఱకు నుపేక్షఁజేసినందులకు నొచ్చుకొనుచు నాక్షణమున శాత్రవుల సమాచారము తెలిసికొనిరాఁ గొందఱి వేగులవారి నంపెను. వారును వెడలిపోయి మరల జనుదెంచి

మహమ్మదీయులు లెక్కకు మీరిన సేనలతో హిస్సర్ పురమునద్ద నున్నారనియు వారినుండి కొందఱు గుంపులై బయలుదేరి గ్రామములఁ గొల్లబెట్టుచున్నారనియు వచించిరి.

అందుపైఁ జక్రవర్తి కిక్కవహించి కుంభీలకుఁడనువాని సకలాక్షౌహిణీపతిగ నేర్పఱిచి దుర్ధరభీములనువారి వానికిఁ దోడిచ్చి యొకలక్షసైన్యము హిస్సర్ పురమువైపున కంపెను. చక్రవర్తియాజ్ఞం దలఁదాలిచి కుంభీలకుండు నడుమ దటస్థమగునట్టి మ్లేచ్ఛులయొక్క బందిపోటు మూకల నాశనముగావించుచు హిస్సర్ పురమున కఱుగుచుండెను.

సార్వభౌమసైన్యము వచ్చుచున్నదనివిని మ్లేచ్ఛసేనానాయకుఁడగు కుతుబుద్దీన్ సుల్తాన్ గారిని దత్క్షణము కొనిరమ్మని చారుల నంపి తాను జాగరూకతతోఁ గాచుకొనియుండెను. మఱియు గ్రామములపైఁబడి దోచుకొనఁబోయిన గుంపులును వచ్చి యతని గలిసికొనెను. కాని కుతుబుద్దీన్ లక్షసైన్యము వచ్చుచున్నదని విని తన వద్ద నేబదివేలసైన్యమే యుండుటవలన యమునాతీరమునందువలెనే మరల నపజయము కలుగునేమోయని భయమందుచుండెను. సుల్తాన్ గారి కొఱకు ప్రతినిమేష మెదురు చూచుచుండెను. ఇంతలో సార్వ సేన దృష్టిగోచరమై ప్రబలాట్టహాసంబున జనుదెంచుచుండెను. మ్లేచ్ఛులును దమతమ యాయుధములదాల్చి రణమునకు దిగిరి. సుమారు పగలు రెండుగంటలవేళ యుద్ధము ప్రారంభమయ్యెను. తమ కదివఱకుఁ గలిగిన పరాభవము దీర్చుకొననెంచి మహమ్మదీయు లత్యంత పరాక్రమముతోఁ బోరాడఁగడఁగిరి. కాని తగినట్టి రణశిక్షలేనివారగుటచే వందలకొలఁది నాశనమగుచుండిరి. ఆర్యులత్యంత నిపుణముతో నొక్కొక్కవ్రేటున కనేకమందిని నేలకు బలియిచ్చుచుండిరి. రణము మహాఘోరముగ నుండెను. నిమిషనిమిషమునకు సుల్తాను వచ్చుచు

న్నాఁడో లేదోయని కనుఁగొనుటకుఁ జారులనంపుచు కుతుబుద్దీన్ సేన నుత్సాహపఱుచుచుండెను. మరునటిదినము పగలు పదునొకండు గంటలవఱకు మహమ్మదీయు లత్యుత్సాహముతోఁ బోరాడుచుండిరి. అప్పటికిని సుల్తాన్‌గారిజాడ లేమియు లేవయ్యె. అంతఁ గుతుబుద్దీన్ తాఁదలఁచినంత యైనదని చింతించుచు వైరిసేన ప్రబలముగ నుండుట వలనఁ దన కపజయము గలుగుట రూఢియని తలఁచి కొంచె మించు మించుగ నొంటిగంటవేళ సేననంతయు వెనుకకు మఱలవలసినదని యుత్తరవుజేసెను. కుతుబుద్దీ నాజ్ఞాపించిన మ్లేచ్ఛవాహిని వెన్నిచ్చి పాఱుచుండు టవలోకించికుంభీలకుఁడు వారివెంటఁదగిలితరుమఁదనవారి కాజ్ఞాపింప నార్యులువిజృంభించి మహమ్మదీయుల దఱుముకొనిపోవసాగిరి. ఇటులు సార్వభౌమసేనచే వెంబడింపఁబడినవారలై మ్లేచ్ఛులు స్థానేశ్వరమువద్ద కేగునప్పటికి సుల్తాన్ ప్రబలసేనాపరివృతుఁడై యెదురుగఁ జనుదెంచుచుండెను. సుల్తాన్ పఱుగెత్తుకొనివచ్చుచున్న తనసేననాపి మరల యుద్ధమునకుఁ బురికొల్పెను. సుల్తాన్ మహమ్మద్ గోరీ వెంటవచ్చిన సైన్యమునందు బదివేల యాఫ్‌గన్లును, నెనిమిదివేల యరబ్బులు నిరువది వేలతురుష్కులు, మొగలాయిలునుండిరి కుంభీలకుఁడు వైరిసేన మిక్కుటముగ నుండుటగాంచి తనసేన నర్థచంద్రాకారవ్యూహమున దీర్చి శాత్రవులఁ దాఁకఁబంచెను. అంత మరల పోరుమహాఘోరమయ్యెను. వివిధశస్త్రాస్త్రతాకుడులముల వేలకొలఁదిసైనికులు మడియుచుండిరి. ఇట్లిక్కడ ఘోరసంగ్రామము జరుగుచుండ నీవార్తలన్నియు కుంభీలకుఁడు చక్రవర్తికిఁ దెలియబఱిచెను.

కుంభీలకుని లేఖలవలన సుల్తాన్ తనయావత్తుసేనను గైకొని లాహోరు దుర్గమును విడచివచ్చినాఁడని తెలిసికొని, చక్రవర్తి, తనప్రాణస్నేహితుఁడును, బావమఱఁదియు మేవాడ్ పరిపాలకుఁడునగు సామర్సికి లాహోరును ముట్టడింప వర్తమాన మంపెను. సామర్సియుఁ జక్రవర్తి యాజ్ఞాపించినట్లు తనవద్దనున్న యేబదివేలసైన్యమును వెంటఁగొని లాహోరును ముట్టడించెను. ఆదుర్గమును సుల్తాన్ లేనికాలమున వస్రాఫ్ అనువాఁడు నలువదివేలసైన్యముతోఁ గాపాడు

చుండెను. సామర్సి దండెత్తి వచ్చుటవిని యష్రాఫ్ తన సేనను దగుస్థల
ములందు నమర్చి రణమొనర్చి శాత్రవులఁ బారఁదోలవలయునని
యాజ్ఞాపించెను. వారునట్లే యుద్ధమొనరింపసాగిరి. సామర్సిసైనికులు
ఫిరంగులఁ గోటగోడలచివరలకు గురిపెట్టికాల్చుచు గోడలపైకి మహ
మ్మదీయులురాకుండఁ జేయుచుండిరి. మ్లేచ్ఛులును సుల్తాన్ లేనితరి
నెటులైన మాటదక్కించుకొననెంచి పరాక్రమముమీర వైరులకుదారి
దొరకకుండఁ బోరాడుచుండిరి. సామర్సి యెటులైన లాహోరును
మరల నార్యులవశముచేయ నదను కలిగెనని తనవారల కత్యంత
ప్రోత్సాహమొసఁగుచు రణము సేయించుచుండెను. ప్రాణముల
కాశింపక సాహసధైర్యములతో నార్యసైనికులు పోరాడుచు వారము
దినములకుఁ గోటబహిర్ద్వారములభేదించుకొని లోపలఁబ్రవేశించి రిపుల
నురుమాడఁగడఁగిరి. ఇక్కడ థానేశ్వరమువద్దనున్న మ్లేచ్ఛులు కుంభీ
లకుఁ జేర్పఱచిన యర్ధచంద్రాకారవ్యూహమును భేదింపఁజాలక వేల
కొలఁది మడియుచుండిరి. ఒకవారమగునప్పటికి మహమ్మదీయసేన
సగమునాశనమయ్యెను. అత్తరి కుంభీలకుఁడు కపిలుఁడనువానికిఁ
గొంతసేననిచ్చి శత్రువుల వెనుకవైపునఁ దాకఁబంచెను. మహమ్మ
దీయులార్యసేన సకలము దమముందున్న దనియే భావించిరిగాన
నిపుణులగు సేనానులు మొదలగు వారలీప్రక్కనే యుండిరి. అత్తరి
నాకస్మికముగఁ గపిలుఁడు వెనుకఁదాకెను. గోరీ సంభ్రమాన్వితుఁడై
బాక్షా, షాప్దర్ జంగులను నిరుపురునిపుణులగు సేనానులఁ గపిలుని
నెదురించి పోరాడఁబనిచెను. నల్దిక్కులనార్యులు ముట్టడివైచియుండుట
వలనమ్లేచ్ఛవాహినియల్లకల్లోలమగుచుండెను. అఁటలాహోరుదుర్గమున
నార్యులుక్కుమీరినరోషమునఁ దెగఁబడి మహమ్మదీయులనఱకి పార
వైచుచుండ వారిధాటికి ోరువఁజాలక తుదకు మఱియొకవారమగునప్పటికి
నష్రాఫ్ కాలికిబుద్ధిచెప్పి పారిపోయెను. సేనానాయకుఁడు కానరాకుం
డుటవలన మిగిలియున్న మ్లేచ్ఛసైనికులు నిరుత్సాహులై యంత్యసా
హసముఁజూపి మడియుచుండిరి. మరికొంద అష్రాఫ్‌మార్గము నవలం
బించుచుండిరి. మూఁడువారములు కడచునప్పటికి మహమ్మదీయులు

పూర్తిగనాశనమై కోటసామర్థ్య స్వాధీనమయ్యెను. తనవిజయవార్తచక్రవర్తికి దెలియఁబఱిచి, దుర్గముయొక్క శిథిలములైనగోడల బాగుచేయించి వానిపై ఫిరంగులనెక్కించి మరల దన్నెవరైన నెదురింపవచ్చిన నోడించుటకు సామర్థ్య సంసిద్ధుఁడై యుండెను.

ఇట స్థానేశ్వరమువద్ద నొకమాస మగునప్పటికి మ్లేచ్ఛసేన విస్తారభాగము నాశనమయ్యెను. అంతసుల్తాన్ దాను లాహోరునుంచివచ్చిన సైన్యముం గొనిరమ్మనిచారులవల్ల సమాచారమంప వారు తిరిగివచ్చి యక్కడిసమాచారము నెఱిఁగించిరి. సుల్తాన్ మహమ్మద్ గోరీ లాహోరు శత్రువులపాలైనదని విని భయోపేతుఁడై యిఁక నట నున్నఁదనకు మరణము సంభవించుట నిశ్చయమని తలఁచి చతురులగు నూర్గురుసైనికులను, గుతుబుద్దీనును వెంటగొని యొకరాత్రివేళ పాఱిపోయెను. మఱునాఁడు రణమునందుసుల్తాన్ గానరాకుంటచే నతఁడు రణములోఁ జచ్చియుండఁబోలు నని మహమ్మదీయులు శౌర్యహీనులై పరుగిడఁజొచ్చిరి. ఆర్యు లొకనినైన దప్పించుకొనిపోకుండ మట్టుపెట్టుచుండిరి. కొన్నిదినము లగునప్పటిక సుల్తాన్ సైన్యము సంపూర్ణముగ ధ్వంసమయ్యెను. హతశేషులగువారిఁ బట్టించి ఢిల్లీకఖైదీలుగఁబంపి కుంభీలకుఁడు తనజయ వార్తను జక్రవర్తికిఁ దెలియఁబఱిచెను. శాత్రవుల యుద్ధోపకరణములన్నియు నార్యులపాలఁబడెను. కుంభీలకుఁ డట్టి మహాజయముతో ఢిల్లీనిప్రవేశించెను. అతఁడు రాజధానిఁ జేరినదినమున ననేకములగు నుత్సవములు జరిగెను. చక్రవర్తియు మహోల్లాసమునొంది రణప్రావీణ్యము గనుబఱిచిన సేనానులకనేక బహుమతులొసఁగిమన్నించెను. సంయుక్తయు దననాయకునకుఁ గలిగిన జయమువలనఁ బరమానందభరితయై రణమునగతించినశూరుల కాంతల రప్పించి వారిననేకగతులనోదార్చి మన్నించుచు నట్టివారలకుఁ దగిన జీవనోపాయంబులఁ గల్పించెను. మ్లేచ్ఛుల యార్భాటము లడుగంటనందున దేశమంతయు నెమ్మదియై పౌరజనంబులెల్ల సౌఖ్యాంబురాశి నోలలాడుచుండిరి.

───✦───

# ఇరువదియాఱవ ప్రకరణము.

సుల్తాన్ షహాబుద్దీన్ మహమ్మదుగోరీ యట్లు ఆర్యచక్రవర్తి సేనచే నోడింపఁబడి లాహోరుదుర్గము సైతము వోయినందున విచారమగ్నుఁడై యార్యావర్తము జయించునాస యడుగంట సాకస్మికముగ నెవరైన నెత్తివచ్చిన నెదురింపఁదగిన సేనయు లేమి నిఁక నిఁటనున్న ప్రాణాపాయకరమని తత్క్షణము నాఫ్‌గన్ స్థానమునకేగ బయలువెడలి సింధునదిం జేరి కుతుబుద్దీన్ సలహాప్రకారము ఘాజీఘాటుయొద్ద విడిసెను.

ఈవార్తలన్నియుఁ గన్యాకుబ్జనగరమునఁ దెలిసినవెంటనే జయచంద్రునకుఁ గలిగిన కడుపుమంట యింతింతని వచింప నలవికాదు. ఇతనికి మఱింతరోష మెక్కించుటకుగా నీశ్వరభట్టు పూనుకొనియుండెను. ఆమఱునాఁడు సుల్తాన్‌గారికి సహాయ్యమొనరించుటంగూర్చి యొక పెద్దసభ గావించిరి. దానియందు ప్రధానులు, మంత్రులు, దండనాయకులు మొదలగువారందఱు బరివేష్టించి యుండిరి. ఈశ్వరభట్టుచే ప్రేరేపింపఁబడినవారలై సేనాపతులందఱు సుల్తాన్‌గారికి దోడుపడవలయుననియే వచించుచుండిరి. వినయశీలుఁ డొక్కఁడుమాత్రము వలదని వారించుచుండెను. అత్తరి రాజుగారు మ్లేచ్ఛులకు సహాయమొనరించియే తీరవలయునని వచింప వినయశీలుఁ డిట్లనియె. "జయచంద్రా! పూజనీయఁబగు నార్యావర్తమును గోహంతకులగుఁ గ్రూరులపాల నేలఁబడవైచెదవు? ఇదివఱకు మనప్రజ లనుభవించిన బాధలవినియు మరల నిట్లేలకావించెదవు? చక్రవర్తిపైగల ననూయ విడనాడుము. నికతఁడుచేసిన యపకారమేమికలదు? నీవే విచారహీనుండవై మున్ముందతనికి నిష్ఠూరముగ లేఖనంపిన పిదప నీపైదండెత్తివచ్చెనఁట గాని నీ

వలని నవమానపడిచిన సంగతి వినియు నూరకుండెనని వినియుంటిని. స్వార్థపరులును దురాలోచనాసంగతులునగు నీశ్వరభట్టు మొదలగు వారి పల్కులాలించి నిష్కారణముగ నేల చెడిపోయెదవు? ఇతఁడు నిన్ను నాశనముగావించి తానును నాశమగునట్టి కుయుక్తులే వచించుచుండుఁ గాని నీమేలుగోరి చెప్పుటలేదు. పరదేశముల రాజులు మనదేశముపై దండెత్తి వచ్చినపుడు మన కదివఱకున్న మనస్పర్థల సహితము వదలుకొని యందఱు మొకటిగాఁగూడి దేశమును రక్షించుకొను నుపాయముఁ జూడవలయుఁగాని పరులకు సహాయమొనరించు టెక్కడనైనఁగలదా? నీవును జక్రవర్తియుఁ గలిసి మ్లేచ్ఛులఁ బారఁదోలుటకునూరు నీవూరకుండనైన నూరకుండక మనదేశమందు నిలువ నీడలేక పాఱిపోవుచున్న సుల్తానును మరలఁ బిలిపించి యతనికిఁ దోడ్పడు టెంత వెఱ్ఱితనము. ఇదివఱకు లాహోరు వాస్తవ్యులగు నార్యు లెందఱు తమ దేశమును త్యజించి మనకడకేగుదెంచి మ్లేచ్ఛులు పెట్టిన బాధలఁ జెప్పుకొని యేడువలేదు. నీవు సహాయ్యమొనరింపకున్నను జక్రవర్తి యతనిఁ బాఱఁదోలినాఁడని వినుటకు నాకెంతయు సంతసముగనున్నది. నామాటఁ బాటించి నీవింతటితో నూరకుండుము. కుత్సితుఁడగు నీ భట్టువాక్యములు వింటివా నిక్కముగఁ జెడిపోదువు." అన భట్టుగారుగ్రుఁడై లేచి "రాజేంద్రా! మానాభిమానములు కలవా రెవ్వరు నిట్లువచింపరు. నీవు సుల్తానుకు సాహాయ్యపడఁ బోవుచున్నావనుటేల? అతనినే నీవు సాయముగఁ దోడ్కొని చక్రవర్తిపై దండెత్తనున్నావని యేల తలఁపరాదు. నేను నీనాశనముగోరి యొక్కనాటికి వచింపను. క్షత్రియుండగు వాఁడు తనవైరము దీర్చుకొనంజాలక యాడుదానివలె నింటఁగూరుచుండి యున్నచోఁ దనప్రజలకే తనపైఁగల యభిమానము దప్పిపోవును. అట్టియెడ నిన్ను బ్రోత్సాహము చేయుచుంటిమే కాని మే మేమియు నాశనము చేయుటలేదు. మీఁదు మిక్కిలి యీప్రధాని

వంటి వారలే నిన్ను నిరుత్సాహపఱుచుచు నడ్డంకులఁ గల్పించి చెప్పు చున్నా" రనెను. దండనాయకులు మొదలగువార లంతకుమునుపే భట్టుగారిచే బోధితులై యుండుటవలన వారును సుల్తానునకు సాహాయ్య మొనరింపవలయుననియే పలుకుచుండిరి. జయచంద్రుఁడు నట్టియుద్దేశమునే కలిగియుండెను. ఇంతమంది మూఢులగోపల నొక్క వినయశీలుఁ డేమిచేయఁగలుగును? అయినను వినయశీలుం డూరకొనక మరల "రాజచంద్రా! అనూయాపరుఁడవై కుమార్గగాములగు వారివాక్యము లాలించి యేల నిష్కారణముగఁ జెడిపోయెదవు? పక్షపాతవిహీనమతివై బాగునోగుల విచారించి చూచుకొనుము. ముందు నీవంశమున జన్మింపఁబోవు వారల కీదేశంబునఁ గాలునిలుపరాకుండఁ జేయకుము. అనేకవేల సంవత్సరముల నుండియుఁ బరదేశులవారిచే మన్ననలందుచు వచ్చుచున్న మనదేశమును ధ్వంసముచేయకుము. అదియుంగాక యీ భట్టుగారు నీయెడ నేవిధమైన ద్రోహము దలపెట్టియుండ లేదని వచించుచున్నాఁడుకదా? ఒకనాఁ డీమూఢుఁడును వీనియనుచరులిరువురును నీకొమార్తెను గడతేర్ప నిశ్చయించినారు. దేవశర్మమూలమున నీనిమిత్రుల కిరువుర కానాఁడే మృతిగలిగి సంయుక్త కాగండము గడచిపోయినది. ఇతఁడు నీయొద్ద దప్పించుకొనుటకై వారిని సుల్తాన్ కడకు బంపియుంటినని వచించినాఁడు. వీనిరహస్యము లన్నియు నితనివద్దనున్న కంచుకికి బాగుగఁ దెలియును. కావలయు నన్న నతనిదెప్పించి యడిగిచూడుఁ" డన గంచుకిని బిలుపించియడుగ నతఁడు వినయశీలుఁడు వచించినప్రకారమే చెప్పెను.

అత్తరి భట్టుగారు వినయమంతయు దనమొగముననే తాండవమాడ లేచి "మహాప్రభో! వీరల వచించునదియేమో నాకుఁ దెలియకున్నది. ఈ వినయశీలుఁడు మెల్లగ నాకడనున్న కంచుకిని లోఁబఱ

చుకొని వానిచే నిట్లు బలికించినాఁడు. అదియుంగాక నీతఁడు చెప్పిన దినమున నే నిల్లువదలి బయటఁబోకుండినట్లు మీకు సాక్ష్యమిప్పించెద" నని నల్గురు మనుజుల బిలువనంపి వారిచే నట్లే చెప్పించి వెండియు నిట్లనియె. "ఇతఁడు నామిత్రులనిరువుర దేవశర్మ చంపినట్లు వచించుచున్నాఁడు గదా! వారల నిద్దఱి గుతుబుద్దీఁ వద్ద కనిచి యుంటినో లేదో యతని దగ్గరనుండియే లేఖదెప్పించి మీకుఁ గనుపఱిచెదను." అని ఖండితముగఁ బలుక జయచంద్రుఁడును దనకూఁతురువిషయమై యంతగా విచారింపకున్నాఁడు కాన భట్టుగారి వాక్యములనే విశ్వసించెఁగాని వినయశీలునిమాటలఁ బాటిగొనఁడయ్యెను. అంత దా నెన్నిగతుల వక్కాణించినను దన్ను లెక్కగొననందున వినయశీలుండు కోపమూని "దుర్మార్గులారా! మీబోటివారలున్న రాజ్యమెన్నటికైనఁ గుదుటఁబడునా? మీ మూలముననే యిదివఱకు జక్రవర్తితో యుద్ధము కలిగి లక్షలకొలఁదిగనున్న సేనయంతయు నాశనమైనది. అనేకతరములనుండి ప్రఖ్యాతిమీరి వచ్చుచున్న గన్యాకుబ్జరాజ్యము నేఁటికి మీ కారణమున నిర్మూలము కావలసివచ్చినది." అని సభవారింగూర్చి పలికి నృపుని వంకకుఁదిరిగి "జయచంద్రా! నావాక్యముల నించుక విశ్వసింపుము. చక్రవర్తితో వైర మూనకుము. మ్లేచ్ఛులఁ జేరదీయకుము. అట్లు చేరతీయుటవలన నీమాతృభూమికంతయు నపకారము గావించినవాఁడ వగుదువు. నీమౌర్ఖ్యము విడువుము." అన జయచంద్రుఁ డేమియుఁ బ్రత్యుత్తరమీయకుండెను. అంత మఱల వినయశీలుఁడు "ఏమి! ఇంతగా వచించుచున్నను నామాటలయందు నీకించుకైనవిశ్వాసము గలుగలేదుగా. ఆసన్నకాలము సమీపించినవాఁడు తనమేలుగోరి చెప్పు మిత్రులఁ బాటింపఁడనుట కిప్పుడు నీవు నిదర్శనముగ నగపడుచున్నావు. అంత నామాటలయందు నీకు నమ్మకము గలుగనిచో నాకీకష్టమంతయు నేటి"కని తనప్రధానిత్వమునకు రాజీనామాయొసంగి వెడలిపోయెను.

వెంటనే భట్టుగారులేచి "రాజా! ఇతఁడు తానుబెదరించి పోయిన నీవుభయపడి మరల నతని కాళ్లు పట్టుకుందువని యిట్లు కావించినాఁడు. ఇప్పుడు నీ కెంతమాత్రము భీతికలుగుట కవకాశము లేదు. ఇతఁడు పోయిన నిన్ను నిరుత్సాహపఱుచువారు లేకుండఁబోయి రంతియే చాలు. నీ వింతకాల మితనిఁబ్రభానిగఁ బెట్టుకొని రాజ్య మెటు లొనరించుచుంటివో నాకాశ్చర్యముగ నున్నది. ఇటువంటి పిరికిపందల మంత్రులుగానుంచుకొనుట నీదేతప్పిదము. అందుకొఱకే యితనివిషయమై నీతో నెన్నిపర్యాయములో వచించియుంటి. అప్పుడు నామాటవినకపోతివి. ఇప్పుడెవరు పొమ్మనకుండఁ దనంతఁ దానే వెడలిపోయినాఁడు. శత్రువుపైకి నేతెంచి తల నరుక నున్నప్పుడుకూడ నూరకుండుమని వచించు నంతటివాఁడే. కానిమ్ము! ఇఁకనైన నీవు బాగుపడు నుపాయము చూచుకొనుము. మనమిదివఱకు వ్రాసిపంపిన లేఖలఁ జూచుకొని కొందఱు వచ్చిరికదా! తక్కినవారికి మరల వ్రాసిపంపుము. ఇంతలో నేను గుతుబుద్దీనుకు వర్తమాన మంపెదను. ఒకవేళఁ జక్రవర్తిచే నోటమికలిగిన మరల లాహోరునకుఁబోక సింధునదీతీరమున ఘాజీఘాటువద్ద నుండవలసినదని యతని కిదివఱకే తెలిపియుంటిని. ఇప్పుడు వారికి లాహోరుమార్గమునసహితము పోయినందున నక్కడనే విడిసి యుందురు. ఆఫ్గనిస్థానమునుండి నూతన సైన్యమును దెప్పించుకొనవలసినదిగా వారి కిప్పుడు తెలియపఱిచెదను" అన జయచంద్రుఁడు యుక్తాయుక్తముల విచారింపక భట్టుగారు వచించునదంతయుఁ దనకు లాభకరమేయని తలంచి పట్టియున్న యసూయాపిశాచమును వదలించు కొనఁజాలక రాకతక్కిన తనమిత్రులగు నితర రాజులకు మరల వర్తమానముల నంపెను. అంత నాఁటికి సభజాలించి యందఱు వెడలిపోయిరి. ఈశ్వరభట్టు వినయశీలుఁడు పోయినందుల కత్యంత సంతోషభరి

తుఁడయి తన నిలయమున కేగి కుతుబుద్దీనున కీక్రిందివిధమున లేఖ వ్రాసెను.

"ఆలీసర్కార్ కుతుబుద్దీన్ నవాబ్‌గారి దివ్యసముఖమునకు మిామిత్రుఁ డీశ్వరభట్టు విన్నవించుకొనున దేమనః—

ప్రస్తుతము మిాకుఁగలిగిన బరాజయమువలన నాకపరిమితమగు దుఃఖము గలిగినది. అయినది కానిండు. మిారెంతమాత్ర మధైర్యపడ వలదు. ఇక్కడ జయచంద్రునిఁ బూర్తిగ నా వలలో వేసికొన్నాఁడను. నాపలుకన్న జవదాటఁడు. మిాకుఁదోడ్పడి చక్రవర్తి నెదురింప నిశ్చయించుకొన్నాము. మఱియు వినయశీలుండు నేఁడు తనపనికి రాజీనామా యొసంగిపోయినాఁడు. ఇఁక జయచంద్రునకు నాకు విరుద్ధముగఁ జెప్పువారెవరును లేరు. మిారు మిాదేశమునుండి తగినంత సేనను దెప్పించుకొని నా కాసమాచారము దెలియఁజేసినతోడనే యితనివెంటగొని నే మిమ్ము గలిసికొనెదను. తమరు మిామాట జెల్లించుకొనుకాలము సమిాపించుచున్నది".

ఆయుత్తరములో ఘూజీఘూటువద్ద కేగి కుతుబుద్దీను కియ్యమని చారులచేతి కిచ్చిపంపెను. కతిపయదినంబుల కాచారులు ఘూజీఘూటు జేరి కుతుబుద్దీను కాజాబులనియ్య నతఁ డదిచూచుకొని సంతోషభరితుఁడై వానిసమాచారము సుల్తాన్‌గారి కెఱుకపఱిచెను. గోరీయు మరల నార్యావర్తమున నిలుచుటకు నీడ దొరికెనని సంతసించుచు గజినీయందున్న తనతమ్మునకు చేతనైనంత సేనను వెంటగొని ఘూజీఘూటు వద్దకు రావలసినదిగఁ దెలియఁబఱిచి పెన్పు పెరిగిన మచ్చరమున నెప్పు డార్యావర్తపుఁ జక్రవర్తిని గడతేర్తునా యని కాచుకొనియుండెను.



# ఇరువదియేడవ ప్రకరణము.

స్థానేశ్వరమునద్ద సుల్తానోడిపోయినపిదపఁ దనరాష్ట్రములలోని ప్రజ లెల్లరు వేనోళ్ళఁ బొగడుచుండఁ జక్రవర్తి రాజ్యమేలుచు సుఖముగఁ గొన్ని దినములు గడపెను. అనంతరము పరదేశముల మెలఁగుచున్న వేగులవారరుదెంచి జయచంద్రుఁడు జేయుచున్న కుట్రలఁ దెలియఁబఱిచిరి. చక్రవర్తి యందులకింతసేపు విచారించి యూరకున్న గార్యము లేదని మఱునాఁడొక గొప్పసభ జరిగించెను. అందు ప్రధానులు అక్షౌహిణీ పతులు మున్నగు రాజ్యమునకు సంబంధించిన గొప్పయధికారులందఱు వచ్చి పరివేష్టించియుండిరి. అత్తరి బృథివీరాజు తానున్న పీఠమున లేచి నిలువఁబడి "సభికులారా! నిన్న మనచారులు కొనివచ్చిన వృత్తాంతముల వినియేయుందురు. మరల నిప్పుడు చెప్పుచున్నాను. జయచంద్రుఁడు మనతోఁ బూనుకొన్న వైరము నుమానక మనదేశమునఁ గాలు పెట్టుటకైన వీలులేక పాఱిపోవుచున్న సుల్తానునకుఁ దోడ్పడి నాపై దండెత్తింపఁ బ్రయత్నములఁ జేయుచున్నాఁడఁట. మఱియు మనదేశంబునఁగల యితరసామంతులనుగూడ దోడ్కొని వచ్చెదనని మ్లేచ్ఛునకు వర్తమాన మంపినాఁడఁట. ఈజయచంద్రు నెంత బుద్ధిహీనుఁ డనవచ్చును. వీని మూలమున మనదేశ మన్యులపాలగుకాలము వచ్చినటులున్నది. ఈవిధముగ రణములపై రణములు చేయుచున్న నెన్నాళ్ళని నిలువఁగలము? ఇదివఱకైన యుద్ధములవలననే యమితమగు ధననష్టమును సేనానష్టమును సంభవించియున్నదికదా! ఈనిచునితోఁగల వామాద మొదలిడిన నాటినుండియు మనప్రజల కెక్కడలేని యిక్కటులు కలుగుచున్నవి. అయ్యో! ఈజయచంద్రున కింతమాత్రము యుక్తాయుక్త వివేచనజ్ఞానమెందులకు లేదా యని నాకుఁ జింతకలుగు

చున్నది. ఇంతవఱకును మనయార్యావర్తమునందలి రాజులేకీభవించి యుండుటచేతనే కదా పరదేశములవారు దీని మ్రింగివేయఁ గాచుకొని యుండియు నేమియుఁ జేయఁజాలక యూరకున్నారు. ప్రస్తుతపుస్థితినిఁ బట్టి విచారింప మనదేశ మన్యులపాలగుట రూఢియని తోఁచుచున్నది. తనకంత నాపైఁగోపమున్న స్వయముగఁ దానొక్కఁడె నాపైదండెత్తి వచ్చి జయముఁగొనరాదా! అటులొనరింపఁ జేతకాక మనకుఁ బ్రత్యక్ష వైరులగు మహమ్మదీయులకా తానుతోడ్పడుట. నీఁడు కావించు చున్న కృత్యములఁ దలఁచినకొలఁది నాయొడలు మండుకొని పోవుచు న్నవి." అనిబయటికి వచ్చుచున్న కోపము నాపుకొని మరల నక్షౌహి ణీపతులతో "సేనానులారా! మీ సేనాసమూహంబుల సన్నింటిఁ జక్కపఱచుకొని రణమునకేగ సిద్ధముగనుండుఁడు. మీదేశమును రక్షించుకొనవలసిన సమయము వచ్చుచున్నది. జీవముల కాశింపక పోరాడి ప్రఖ్యాతిఁగాంచవలయు. పిరికితనముఁ వహించి రణరంగమున వెన్నిచ్చి పారువార లిక్కడనే యూగిపొండు. అట్టివారల నేనెంతమాత్రము బలవంతపఱచను. ఇక్కడ ప్రగల్భములు పలికి రణమున బరువెత్తువారల కెట్టి కఠినశిక్షనైన విధించెద. భారతయుద్ధమైనతర్వాత నింతగొప్పసంగ్రామము జరిగినటు లెన్నఁడు వినియుండలేదు. కావున లేశమాత్రమైనఁ బ్రాణములపై నాసబెట్టు కొనక తుదవఱకు యుద్ధమొనరించి పాండవసేనానాయకులంబలె శాశ్వతకీర్తుల నందుఁడు."

ఇట్లు చక్రవర్తి పలుక సేనాధిపతులందఱొక్కపర్యాయమున లేచి "రాజేంద్రా! దేవరవా రింతగ సెలవియ్యవలయునా? మా రణ కౌశలము గాంచి మీరే యప్పుడు మెచ్చుకొందురుగాక. ఇప్పు డూరక వచించినఁ బ్రయోజనమేమి? శక్తిహీనమగుపర్యంతముఁ బోరాడు చుందు మని నిక్కముగ నమ్మియుండుఁడు." అని యేకవాక్యముగఁ

బలుఁడు చక్రవర్తి సంతసించినవాఁడయి "మీ నేర్పు నేనెఱుంగనా! అయినను జెప్పవలసినమాటలు చెప్పితి" ననెను. అత్తరి విజ్ఞానశీలుఁడు లేచి "మహాప్రభో! నాదొకచిన్న మనవికలదు. ఇప్పు డాజయచంద్రుఁడు చేయుచున్న కార్యములబట్టి యాలోచింప మనకెల్లను పోరు తప్పదు. అది నిశ్చయమే అయినను నేకార్యములు కాని సాధ్యమగునంతవఱకు సామ్యముననే చక్కపఱచుకొను టుచితముకాన మరల మిత్రబంధుభావములతో నాజయచంద్రునకొక లేఖవ్రాసి పంపుము. పిదప సంగతులన్నియు విశదములగును" అనెఁ జక్రవర్తి. "విజ్ఞానశీలా! నీవుచెప్పునవి యన్నియుఁ బక్షపాతరహితుఁడును నసూయావిహీనుండును నగువానియెడ ఫలించుఁగాని యీదుర్మార్గునియెడ సఫలములగునా? మఱియు మనమెంతసామ్యమున వేఁడుచున్న యంత మనతల కెక్కుఁగాని యతఁడు మంచిమార్గమునకు వచ్చుననుట కల్ల. అయినను నీమాటఁగాదనను. నీయాలోచనప్రకారమటులే పత్రిక వ్రాసిపంపెద" నని యొకలేఖ నీక్రిందివిధముగ వ్రాయఁదొడఁగెను:—

"స్వస్తిశ్రీ కన్యాకుబ్జపురాధీశుఁడగు జయచంద్రుని సన్నిధికి. నీ వార్యసంతతివాఁడవైనందున మనమందఱము బంధువులమైయున్నాము. అదియుంగాక మనకిద్దఱ కిప్పుడు మఱింత దగ్గఱబాంధవ్యము చేకూరినది. బాంధవ్యముమాట యటులుండనిమ్ము. పరస్పరకలహములులేక మన మందఱము గలిసియుండి మాతృభూమిని రక్షించుట మనకు విధియైయున్నది. పరదేశములవార లీదేశముపై దండెత్తివచ్చినప్పు డొక్కభావముతోనందఱ మేకమైవారిఁ దఱిమివేయకున్న మనకీరాజ్యములు నిలుచుట దుర్లభము. ఇదివఱకే మనలో మనము వైరముఁ బెట్టుకొని మనప్రజల కనేకగతులబాధలు కలుగఁజేసియున్నాము. అట్టివిషయములో నాచేనోటువడి యావల లాహోరుదుర్గమును బోగొట్టుకొని యార్యావర్తమునందు నిలువనీడలేక స్వదే

శమునకుఁ బరువెత్తి పోవుచున్న సుల్తానునకు నీవు తోడుపడుచున్నా వని వినుటకు నాకెంతయుఁ జింతగనున్నది. నీవింతటియజ్ఞాని కేటికైతివో యూహింపఁజాలకున్నాను. మన మందఱముఁగలసి పరులఁబారఁదోలుట లేకపోవఁ బరులకే సాహాయ్యమొనర్చి నాపైఁబంపు టెంత వెఱ్ఱితనము. మనచుట్టుప్రక్కలనున్న దేశములవా రిట్టియజ్ఞానపుగృత్యముల నలిపిరని యెన్నఁడైన వినియుంటివా? కావున నికనైన నిట్టియవివేకపుఁ గార్యముల నొనర్చుటుడిగి సుల్తానుతో మైత్రివదలుము. నీ భావిసౌఖ్యమునకు భంగము కలిగించుకొనకుము. నీకు భయపడి యిట్టిలేఖల వ్రాసితినని తలంపకుము. అన్యులేతెంచిన మనమెల్లర మేకీభవించి వారిఁదరిమివైచి మాతృభూమిఁగాపాడుకొనువిధి మనదైయుండుటవలన నిట్లు లిఖించినాఁడగాని వేరొండుగాదు. నాతోఁగలవైరమే ప్రధానముగఁ జూచుకొనకుము. మాతృదేశరక్షణోపాయ మరసికొనుము."

ఇట్లు వ్రాసి ధీయుతుండగు నొకరాయబారిచేతి కొసఁగి పంపి నాఁటికిఁ గొలువుఁజాలించి వెడలిపోయెను. రాయబారి కతిపయదినంబులకుఁ గన్యాకుబ్జమున కేగి రాజసభాద్వారముఁ జేరి లోపలికిఁ జెప్పిపంప నిపుడు సందర్శింపవలను కాదని జయచంద్రుఁడు ప్రత్యుత్తర మంపెను. మఱునాఁడు నట్లే జరిగెను. అనంతరము నాలుగైదుదినములు గడచిపోవ నప్పుడు నట్లే జరిగెను. వచ్చినప్పుడెల్ల రాయబారిం జూడ వలను కాదని తిరస్కరించుచు యుద్ధమునకుఁ బ్రయత్నములఁ జేయించుచుండెను. రాయబారి యిదంతయు గ్రహించి తత్క్షణమ ఢిల్లీ కేతెంచి కనూజియందు జరిగినసమాచారముఁ జక్రవర్తికిఁ దెలియఁబఱిచెను. అతఁడును రోషపూరితుండై యిఁక నాలస్యముఁ జేసిన కార్యము లేదని సేనాపతులనెల్లరఁ బిలిపించి యుద్ధమునకు సర్వసిద్ధులై యుండవలసినదని యాజ్ఞాపించి తాను సంయుక్తమందిరమున కేగెను. అట రాణివాసము ననున్న సంయుక్తయుఁ దనతండ్రిచేయుచున్న చేష్టలకుఁ జింతాకులయై కూరుచుండియుండఁ బరిచారిక లేతెంచి చక్రవర్తి వచ్చుచున్నాఁడని తెలిపిరి. తోడనే యామె లేచి మగనికెదురువోయి నమస్కరించి కొని వచ్చి తల్పమున నాసీనుం జేసి యతనిముఖ మించుక వన్నె దరిగియుండు

టవలోకించి మెల్లగ నిట్లనియె. "నాథా! నేఁడు మీవదనము క్రొత్తగ నున్నది. అందులకుఁ గారణ మే నెఱుఁగుదు. దీనికి మీరు చింతింపవల సిన పనిలేదు. నా తండ్రి యిట్టి కుమార్గగామి యయ్యెనని వినుటకు నాకెంతయో లజ్జగ నున్నది. యుక్తాయుక్తవివేచనలేక యతఁడు చేయఁగడగిన దుష్కార్యములఁగూర్చి విన్నకొలఁది నాకమితమగు రోషము గలుగుచున్నది. ఇతఁడు నాజనకుఁడైనమాట నె. ఇట్టిదేశ ద్రోహులు బ్రతికియుండుటకన్న మరణించుటయే మేలు. అయ్యో! అతఁడే సజ్జనుఁడై మనయందఱితోఁగలసియున్న నేనిప్పు డెట్టి యుల్లాస స్థితియం దుందునోకదా. అట్టిభాగ్య మీనిర్భాగ్యురాలి కీజన్మంబునఁ గలుగనేరదు. అతనివిషయమై మీ రాంతయైనఁ జింతఁ బెట్టుకొన కుఁడు. మీదేశక్షేమమునకై నాపైగల మోహముందృజించి సంగ్ర మున కరుగుఁడు. తమసెలవైనచో నాతండ్రియని శంకింపక నేనును దమకు సాయముగ జనుదెంచెదను. సంభవించిన మన కిరువురకు రణ ముననే మరణము సంభవింపనిండు. అందులకు నా కావంతయైన విచా రముకాని భీతికాని లేదు" అని ధీరత్వము తోఁపఁబల్కిన తనప్రియాంగ నవాక్యము లాలకించి చక్రిపుత్రి సంతోషపరవశుఁడై యామె నాలిం గన మొనరించుకొని "సతీ! నివంటియుత్తమసాధ్వీంజేపట్టిన నా కే కొఱంతయైన గలుగునా? నాపురాకృతపుణ్యవశంబున నివు నాకు లభించితివి కాని వేరొండు కాదు. పురుషునిమదికిఁ జింతకలిగినతరి సమ యోచితంబులగు మృదుమధుర వాక్యములచె సతిని దేర్చునదియే యతని బాలిటి భాగ్యదేవత యనం జెల్లుగాని లేకున్న మృత్యుదేవతయే యగు గదా. నీ విప్పుడు వచించిన పల్కులెంతయు నాదరణీయములు. చెలీ! నీ రణకౌశలము నే నిదివఱ కనేకపర్యాయములు గాంచియేయున్నాను. ఘోర సంగ్రామమున నాతలఁ దెగవ్రేయనున్న కహారకంఠీరవు నొక్క వ్రేటున దునిమి నన్నుఁ గాపాడినదానికంటెు వేరుగఁ జూడవలయునా? నీ వీ భూచక్రమునంతయుఁ బాలింపఁదగియున్నావనుట కెంతమాత్రము సందియము లేదు. అయినను యుద్ధమునకుఁ గొనిపోవుతలఁపున మన నగరమందలి యావనవంతు లందఱకు రణశిక్ష నేర్పించి యుంచినాను.

వారందఱిపుడు నాతో రా సిద్ధముగనున్నారు. మేమందఱము రణస్థలికేఁగ నగరమున నుండు కొద్దిసేనకును తక్కిన నీతోడి కాంతలకును నిఁట రక్షకు లెవ్వరు నుండరు అట్టి తరుణమున నాభారమంతయు నీయదియే.” అన సంయుక్తమరల “నాథా! నాసఖియగు మంజరిని మీరెఱిఁగియేయున్నారుగదా. ఆకన్నియ యేవిషయమందును నాతో దీసిపోవునదికాదు. నాకన్న మిన్నయనియే చెప్పనొప్పును. ఆమెను మనము లేనికాలమున నిక్కడ నుంచవచ్చును. ఆమె యిప్పుడు కన్యాకుబ్జనగరముననే యున్నది. ఆమెకడనుండి జాబురాని దినములేదు. మఱియు లేఖఁదెచ్చినవార లామె నాకొఱకై పరితపించుచు కృశించి పోవుచున్నదని వచించినారు. నాకు నామెం బాసియుండుటవలన నెట్లోయున్నది. ఇత్తరి బిలిపింపఁదగిన సమయమువచ్చినది కావున జాబునంపి రప్పించెద. నాయుత్తరముగాంచినవెంటనే బరువెత్తుకొని వచ్చును. ఆమె నిటనుంచిపోయిన మనకేమియు భయములేదు. నాకు మీతోయుద్ధమునకేతేరగడు నభిలాషగనున్నది కాన నింతగా వేఁడుకొనుచున్నదానను. కాదనక యనుగ్రహింపుఁ”డని పలుకుచున్న తన ప్రాణకాంతను వలదన నోపక చక్రవర్తి యామెధైర్యపరాక్రమముల స్వయముగఁ జూచియున్నాఁడు కాన నటులేయని సమ్మతించెను. అంత నామె మంజరి కొకలేఖవ్రాసి యొకనికిచ్చి మాతండ్రిగారి పట్టణమున కేగి యీయుత్తరముఁజూపి మంజరి వెంటగొనిరమ్మని పంపెను. పరిచారకుఁడు లేఖఁగైకొని చనినపిదప నాదంపతు లిరువురు రణమును గూర్చి మఱికొన్ని సంగతులు మాటలాడుకొని వేరొక మందిరములోని కరిగిరి.



# ఇరువదియెనిమిదవ ప్రకరణము.

అంట జయచంద్రుఁ డంపిన లేఖలఁ జూచుకొని యార్యావర్త మునంగల కొద్దిమంది సామంతులు దప్పఁ దక్కినవారందఱు స్వార్థపరత్వమూని స్వతంత్ర రాజ్యములు లభించునను కోరికఁ దమతమ సేనల వెంటగొని కన్యాకుబ్జముఁ జేరవచ్చిరి. అందు జయచంద్రుని ప్రాణస్నేహితుఁడు మందూరు పాలకుఁడును నగు పురిహార రాజకులుండు నలువదివేల సైన్యముతోడను నేపాల కోసల వంగ దేశాధిపతులు తొంబదివేల సేనలతోడను, కాశ్మీరపతి ముప్పదివేల బలముతోడను, మగధనాథుఁడు నలువదివేల సైన్యముతోడను జనుదెంచిరి. వీరందఱిరాకకు జయచంద్రుఁడు సంతసమందుచు నందఱ ననేకగతుల మర్యాదలొనర్చి మన్నించుచుండెను. ఇఁక నీశ్వరభట్టుగారి సంతోషమునకు పరిమితియే లేదు. రాజ్యకార్యదురంధరుండగు వినయశీలుఁడు దనపనికి రాజీనామా యొసంగి చనినపిదప నతనిస్థానమున భట్టుగారే యుంచబడిరి గావున రాజుగారికి మంత్రాలోచనములన్నియు నితఁడే బోధించుచుండెను. జయచంద్రునకుఁ దోడ్పడఁ జనుదెంచిన రాజులకుఁ జక్రవర్తిపై లేనిపోని ద్రోహములఁ గల్పించిచెప్పి యసూయ బుట్టించుచుండెను. సమస్తసామంతులువచ్చినపిదప గుతుబుద్దీన్ వద్దనుండి సమాచార మెప్పు డేతెంచునా యని భట్టుగారెదురుచూచుచుండిరి. అంతలోఁ గొందఱుమ్లేచ్ఛభటు లేతెంచి కుతుబుద్దీనొసంగిన లేఖల భట్టుగారికియ్య నవి చూచుకొని పరమానందమునొంది వానినన్నింటి జయచంద్రునకుఁ జూపింప నతఁడును మోదమగ్నుఁడై యలీఘురువద్దకు వచ్చి తమ్ము గలిసికొనవలసినదిగా మ్లేచ్ఛులకు వర్తమానమంపెను. ఆమరుసటి దినమున వచ్చిన రాజమండలి గూడుకొని యలీఘురునకుఁబోవు ప్రయాణమును గూర్చి ముచ్చటించు

కొనుచుండ దేవశర్మయే తెంచి నృపునిచే మన్ననలంది యొకపీఠమున నాసీనుఁడై మెల్లన నిట్లనియె. 'జయచంద్రా! ఈసంరంభమంతయు నేటికి?

జయ:—అయ్యా! మీకన్నఁ దెలిసియేయుండును తెలిసియుండియు నిట్లేల యడిగెదరు? చక్రవర్తిపై దండెత్తఁబోవుచున్నాము.

అని నృపుఁడు పలుక దేవశర్మ యెక్కడవచ్చెనాయని విసువు కొనుచు మొగము మాడ్చుకొని కూరుచుండియున్న భట్టుగారాఖండి తంపువాక్యములకు సంతుష్టులైరి. దేవశర్మ రాజుదిక్కు మొగంబై "జయచంద్రా! నీ వింతట యవివేకుండ వేటకైతివో తెలియఁజాలకు న్నాను. ఇంచుకైన యుక్తాయుక్త విచారమొనరింపవా? అయ్యో" యని యింకను నేమియో వచింపఁబోవుచుండ నతఁడు విసువుకొనుచు "అయ్యా! ఈనీతివాక్యముల వినివిని నాచెవులు తడకలు కట్టిపోయి నవి. మరల మీకీ శ్రమయెందుకు? క్షమింపుఁడు. ఇత్తఱుణమున మా త్రము తమవాక్యముల మన్నింపనోప"నని మొగమోటమించుకైన లేక నిష్ఠురముగఁ బలుక దేవశర్మమనస్సు కలుక్కుమన వేరొండువచింపనో డి "యటులనా" యని కొలువు వెడలిపోయెను.

నిజపురోహితుఁ డట్లుకోపమున బోవుచుండఁ జూచుచునూరకుం డెనేకాని జయచంద్రుఁ డావంతయు లెక్కఁగొనడయ్యెను. ఈర్ష్యాగ్ర స్తులకు మర్యాదామర్యాద వివేచన జ్ఞానము సహితము నుండదుకా బోలు. మఱునాఁడతఁడు సకలసేనాసమన్వితుఁడై సామంతులం గూ డుకొని యలీఘరుప్రాంతమున కేగి కాళీనదియొడ్డున దండును విడియిం చి డేరాలవేయించి సుల్తాన్‌గారిరాకకై యెదురుజూచుచుండెను అంట ఢిల్లీనగరమున వేగులవారివలన బయట జరుగుచున్న సంగతులను విని చక్రవర్తి పట్టరాని యాగ్రహామూని యొకసభఁజేసి యందు దండనా

యకులు మొదలగువారలకు యుద్ధసంబంధములగు విషయములఁగొన్ని వక్కాణించుచుండెను. అత్తరి రాజపుత్రస్థానమందలి కొందఱు సామంతులును, ఘూర్జరదేశాధీశుఁడును జక్రవర్తి కడకేతెంచి యిట్లు విన్నవించుకొనిరి. "రాజేంద్రా! మనదేశముపై మహమ్మదీయులు దండెత్తి వచ్చుటయు, జయచంద్రుఁడు మొదలగువారు వారికిఁ దోడ్పడుటయు నాదిగాఁగల సకలవృత్తాంతముల నెఱిఁగియే యున్నాము. తనకుసహాయముగ రమ్మని జయచంద్రుఁడు మాకును లేఖల సంపినాఁడు. మేమతనికి సహాయముగఁ బోవుట కిచ్చగింపక యేలినవారి సామంతుల మగుటచే రణసమయమున మీకు మే మొనరింపఁ దగుదాని సలుపుటకై సర్వసిద్ధులమై వచ్చితిమి. మీయాజ్ఞానుసార మెట్లునడచుకొమ్మనిన నట్లువర్తించెదము. యుద్ధమున మీకొఱకై మాప్రాణములసహిత మర్పింప సన్నద్ధులమై యున్నా" మని పలుకఁ జక్రవర్తిమిక్కిలిమీఱిన సంతసమున "ఆహా! నేటికి నేనునిక్కముగ ధన్యుఁడనైతి. మన యార్యావర్తమునంగల నృపులెల్లరు మాతృద్రోహులును, స్వామిద్రోహులును, స్వార్థపరాయణులు నని తలఁచియుంటిగాని నేఁడాతలఁపు మారిపోయినది. మనకు జయముకాకున్నఁ బోనిండు. మన యార్యావర్తమునందు మిమ్ముఁబోలుపగోపకారపారీణులు గొందఱున్నారుకదా యని సంతోషముకలుగుచున్నది." అని వారలకందఱకుఁ బసదనంబులొసంగి వారు వెంటఁగొనివచ్చిన సేనల దన యక్షౌహిణీసేనలఁ జేర్పించెను.

ఆసమయమందే లోకులందఱు సౌందర్యమునకు మెచ్చి పెట్టిన యలంకారుఁడను పేరుగల బాలుఁడొకఁడు రోషావేశమున నెఱ్ఱబారినముఖముతో సభామధ్యమున కేతెంచి చక్రవర్తితో "మహారాజా! ముందుశత్రువులతోఁ బోరాడ నన్ననుగ్రహింపు" డని వేఁడుకొనెను. పృథివీరా జాశ్చర్యకలితుఁడై నీవిట్లడుగుటకుఁ గతమేమన నా బుడుతఁ డిట్లనియె, "రాజా! నాతండ్రిగారు తమకొఱకై పోరాడుచు మహా

బానంగరమున మృతినొందినారు. కాని తరువాత శరీరము కొఱకు వెదక నది యెచ్చోటను గన్పింపలేదు. ఇప్పుడు నాతోఁగలిసి యున్న నాస్నేహితులుగొందఱు మాతండ్రి రణమున కేగలేదనియు నతఁడందు లేనేలేడనియు వచించుచున్నారు. అందుచే మావంశీకులు యుద్ధములందు నిలువ సమర్థులని స్వాయముగఁ దెలియబఱచుటకై యిట్టులడిగితిని." అని చక్రవర్తి యతనియెడల దృఢానురాగము గల వాఁడై తనదగ్గఱకు లాగుకొని యతని దక్షిణకరమునుబట్టి పైకెత్తిన వెంటనే సభాసదులెల్లరు నిశ్శబ్దముగ గూరుచుండియుండిరి. అత్తరి చక్రవర్తి కోపమును, దుఃఖమును పొడమనిట్లనియె. "బుద్ధిహీనులగు నావంచుచు వారలందఱెక్కడ ? నాప్రక్కఁదోడై నిలిచి ప్రాణముల కాశింపక పోరాడిన సత్వవంతునిచరిత మాలకింప వారినందఱి నిటకుఁ గొనిరండు. మహోబాయందు జరిగిన ఘోరసంగ్రామమున నితని తండ్రియు నేనునుగాఢమగు గాయములు దగిలి పడిపోయితిమి. మొదట నాకుస్మృతియే లేదు. మరల నా కించుక తెలివి కలుగునప్పటికి రణముపరిపూర్తియయినది. జయము మాకే కలిగినది. ఆసమయమున శక్తిహీనుఁడనై నెత్తురువరదలు కారుచుండ బడియుండ నేనుచచ్చితి ననుతలఁపున డేగలు మొదలగు పీనుఁగుల దినుపక్షులు బలహీనములై వ్రేలాడుచున్న నానరముల పీకుకొనుటకై తటతట రెక్కలల్లార్చు కొనుచు నాపై వ్రాలవచ్చుచుండెను. అట్టియెడ నే నేమని వచింపుదు. పాపమీ చిన్నవానిజనకుఁడు నాకుఁ గొంచెము దూరములోఁ బడి యుండి మోకాళ్లవఱకునఱుకబడి యుండుటచేఁ బొరలియాడుచున్నైన నాదగ్గఱకురాలేక సగము తునిగిన మొండికత్తితోఁ దనశరీరమందలి మాంసపుఁగండలఁ బెఱికి నాపైకి వ్రాలవచ్చుపక్షులకు వైచుచు నన్నంటకుండఁజేసి తనఋణము దీర్చుకొన్నాఁడు. తరువాత నాకుమరల స్మృతితప్పిపోయినది. అంత నేమి జరిగినదియు నాకుఁదెలియదు.

తిరుగ నాకుఁ దెలివివచ్చునప్పటికి నా సేనాధిపతుల నడుమ నుంటిని. అతనికొఱకు వెదకించితిగాని యెచటను గాన్పింపలేదు. బుద్ధిహీనులారా! అట్టి యుత్తమసాహసికునా రణముంమఁ లేడని యూరువచించుట? అట్టి పరాక్రమశాలి ధవళకీర్తికా! మీరు కళంకము గల్పించుట? ఇఁక ముందెన్నటికి నిట్టి దుడుకుతనపు మాటలాడక గౌరవమున నతని స్మరించుచుండుఁడు. సమ్యమరాయఁ డెప్పుడును వెన్నిచ్చువాడు కాఁడు. రణమునఁ బృథివీరాజు కతఁడు సోదరుఁడై మెలఁగినాఁడు." అని యా కుట్టువాని వంకకుఁ దిరిగి బుజ్జగించు వాక్యములతో "నాయనా! నీవింకను పసిపూవవు. రణమున కేతెంచుట యుక్తముకాదు. సద్విద్యలం దారి తేరి నీ జనకునిబలె శాశ్వతకీర్తినంద బ్రయత్నింపు" మని యతనిబంపివేసి తాను రాణివాసమున కఱిగెను. అంతఃపురద్వారముల సమీపించినవెంటనే మంజరీసంయుక్త లేతెంచి ప్రణమిల్లి యతని లోనికిఁ గొనిపోయిరి. చక్రవర్తి లోపలికేగినపిదప మంజరీ క్షేమసమాచారమడిగి కొంతతడవునకు "మంజరీ! నీ నెచ్చెలినాతోఁ గూడ సంగరమునకు వచ్చెదనని యడుగుచున్నది. మే మిట లేనితరి పురమును రక్షించుభారము నిదే" యన సంయుక్తచే నదివఱకే యొప్పింపఁబడియున్నది. గావున నట్లేయని యామె సమ్మతించెను. అనంతర మెల్లరు మరల వేగులవా రేమివర్తమానము గొనివత్తురోయని కాచుకొనియుండిరి. కొన్నిదినములు కడచిన వెన్కనిట నలీఘురువద్దనున్న జయచంద్రుడు సుల్తానుగారు సేనాసమేతముగఁ జనుదెంచి కలిసికొనిరి. నాఁటినుండియు మహమ్మదీయులు నార్యులు ననుభేదము లేకుండ నుండవలయునని యొప్పందము చేసికొనిరి. అటు పిమ్మట సుల్తాను జయచంద్రు లిరువురుగలసి తమసేనల గొన్నిభాగములుగ విభజించి కోసలాధిపుని యాధిపత్యమున నొకభాగమును చోలాపురి ముట్టడించుటకును, వంగదేశపతినాయకత్వమున

నింకొక భాగమును ఫరుక్కనగరమును స్వాధీనము చేసికొనుటకును, బురిహార రాజకులునివశమున మఱియొక భాగమును గైజియా పట్టణము నాక్రమించుకొనుటకును బంపిరి. చారు లరుదెంచి బయటజరుగుచున్న వార్తల నిటుఁ జక్రవర్తి కెఱుకపఱుపగా నతఁడు నప్పుడే యక్షౌహిణీపతులు మొదలగువారి రావించి ఘూర్జరపతిని కోసలు నెదురించుటకు, రాజపుత్రస్థానము నుండి వచ్చినవారిలో నచలమహాబుద్ధులను నిరువుర మందూరువంగపతుల నెదురించుటకునుదగిన సేనలనిచ్చి పంపి యూఫగిర్ స్థానమునుండి మరల సైన్యములు రాకుండ నాదారుల నన్నింటియందు గాచుకొని యుండవలసినదని లాహోరుననున్న సామర్సికి వార్తనంపి, పురరక్షణకు మంజరినిలిపి సంయుక్తాసమేతుఁడై యక్షౌహిణీపతులు సేనాపరివృతులై ముందునడున నలీఘురువద్దనున్న సుల్తాన్ జయచంద్రుల నెదురింపఁ బయనమై వచ్చుచుండెను.



# ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

జయచంద్రుఁ డట్లు చక్రవర్తిపురగుల మూఁడింటి ముట్టడింప సేనలనంపి వారు పోయిన మూఁడవనాటి ప్రాతఃకాలమున దానున్న శిబిరమునువిడచి యొంటరిగఁ గాళీనదిలోని కేగి యందొకవైపునఁ జల్లగనున్న స్వచ్ఛసికతాతలమున నాసీనుఁడై నెమ్మదిగఁ బారుచున్న నది నవలోకించుచుఁ దానుగావింపుచున్న కార్యములన్నియుఁ దలఁపునకు రానేమేమో యాలోచించుకొనుచుండెను. అట్టితరుణమున నాకస్మికముగ సంయుక్తయే తెంచి నమస్కరింప నతఁడు విభ్రాంతుఁడై చూచుచు నేమియుబల్కరింప కూరకుండెను. అప్పుడు సంయుక్త మెల్లన "తండ్రీ! నీపరివారమును విడచివచ్చి యొంటరిగ నీవిట నేమి యాలోచించుచున్నావు. నీమాతృభూమియగు నార్యావర్తముపైఁగల నభిమానమునంతయుఁ ద్యజించితివా? కడుగారాబమునఁ బెంచిన నాపైఁగల మక్కువను సహితము వదలితివా ? కట్టా! కన్నకూఁతుల నిట్లుగారియలం బెట్టు తండ్రులెందైనఁ గలరా? ఇదివఱకు మహమ్మద్‌గజనీ దాడివెడలివచ్చి మనదేశము నెట్లునాశనముఁ జేసిపోయినది నీవెఱుఁగవా? అయ్యో! బిడ్డలవంటినీప్రజలనందఱ మ్లేచ్ఛుల కేల నమర్పించెదవు. గోహంతకులగు నీకూర్మిరుల జేరనీసి నాప్రాణకాంతునిపై సేలకత్తిగట్టనెంచెదవు? వీరి నమ్మికొనిన నీకావంతయు లాభనులేదు. నాప్రార్థన మాలకించి యిప్పుడైన నీసేనల మరలించుకొని వెడలి పొమ్ము. నన్నుఁ గటాక్షింపు" మని కడుదీనముగ వేఁడుకొనుచున్న పుత్రికను గన్నులెఱ్ఱచేసి చూచుచు "ఓసీ! దుర్మార్గురాలా! హీనాభిసారికభంగి నాయిష్టములేని యెవనినో చేపట్టి సిగ్గులేక తగునని నాకు బుద్ధులు గఱపనే తెంచితివా? చాలు. నాయెదుటనుండి వెడలి పొమ్మని కసరుకొన మరల నామె వినయపూర్వకముగ "నాయనా! నాపై

నింత కోపమేటికి ? హీనాభిసారికవలె నే నేనీచునైన వరించితినా? ఆర్యావర్తమున కంతయు సార్వభౌముఁడై, దీనదయాపరుఁడై, ధీశాలియై మన్ననలకెక్కిన మూర్ధన్యశిరోరత్నమును నే వరించి పరిణయమైనది. అయ్యో! చక్రవర్తి యంతటివాఁ డల్లుఁడయ్యెనని సంత సించుటకుమారుగ నతనికిఁ గీడుగా వింపఁదలఁచు టెంత వెఱ్ఱిదనము. చక్రవర్తి జామాతయయ్యెననిన నీకుఁ గలుగుప్రఖ్యాతికి మేరకలదా? తండ్రీ! మనమందఱముగలసి ప్రసన్నహృదయులమై యొకచోట నివా సముఁ జేయుటమాని యిట్లు పోరాడుకొనుచుండు టెందైనఁగలదా? ఈర్ష్యావేశుఁడవై యేల యీలీల నకార్యములఁ గావింప నొడిగట్టె దవు? ఋషిజనసేవ్యమానమై యలరారు మనపుణ్యదేశమును గిరాతు లపాల నేలపడవైచెదవు. పతివ్రతాతిలకములని ప్రసిద్ధివడయుచు నుత్త మవిద్యావంతురాండ్రై స్వచ్ఛందసంచారంబుల జీవనములఁ గడపు నీసోదరీమతల్లుల కందఱకు మానభంగమగురీతి నేలసల్పెదవు? సౌంద ర్యవతులకెల్ల బందీగృహవాసము ప్రాప్తమగుభంగి నేలకలుగఁజేసె దవు? తండ్రీ! నీవు పూనియున్న యసూయను ద్యజించినచో నింతదా రుణములు గలుగ నేరవుగదా? పక్షపాతరహితుఁడవై మంచిచెడ్డల నా లోచించి చూచుకొనుము. ప్రస్తుతము నీసహాయ మవసరమగుటచే వీరందఱు గ్రుక్కినపేలవలె యూరకుండియున్నారుకాని లేకున్న బట్ట బగ్గము లుండెడివా? ఈదుష్టులొనరించు భీభత్సములవినియు, గనియు మగల నిల్లల యజ్ఞానంబున మునిఁగెదవు? మఱియు నిత్తరి మనదేశం బున జరుగుచున్న సంఘసంస్కారము లన్నియు నీకార్యముల మూలము ననేకదా? నాయనా! నీసోదరీజనంబులకుఁగల స్వాతంత్ర్యములన్నియు నడఁగి దాసీలకన్న నీచముగుబ్రతుకు చేకూరుపనులఁ జేయబూనుట నీకెనైన మానుము. ఇంతకుమును పేమియోకాని యిప్పుడు నిన్ను నిందింపనివాఁడు మందునకైనఁ గానరాఁడు. జయచంద్రా ! నీమూలము

నంగదా నేఁటికి మా కిట్టియిక్కట్టులు సంప్రాప్తములైనవని రోదనము లొనర్చుచు నెందఱో పుణ్యాంగనలు తమప్రాణములఁ గోల్పోవుచున్నా రఁట. వెండియు మనదేశమున నిదివఱకే ప్రబలియున్న వామమార్గుల వలన సాధువులగు పశువు లనేకములు నాశనమైపోవుచున్నవి. ఇఁక వీరు ను వారికిఁ దోడ్పడినచో నాపశువులకు బ్రతుకుదెరు వెక్కడిది! అయ్యో! నీకుఁగల భూతదయ యంతయు నేగంగలో గలసిపోయినది? తండ్రీ! ఏకరణి విచారించినను నార్యావర్తమునంతయు ధ్వంసము కావించినవాఁడ వగుదువుగాని వేరొండు కాదు. ఇప్పటివారిమాట యటులుండ ముందుజన్మించువారెల్లరు నిన్నాడిపోసికొనక మానరు. ఇఁకనైన నసుల్తానుతోఁగల మైత్రివదలుకొనుము. నీవు నా నాథునకు సహాయ మొనరింపకున్న మానె మ్లేచ్ఛులకు సహాయము సేయకున్నఁ జాలు. నానమస్కృతులంగైకొని కరుణింపు"మని యభివాదన మొనర్ప నొక్కతన్నుఁదన్ని "ఓసీ! కన్నకూఁతురవని యేమియు సేయక చూచుచు నూరకున్న కొలఁది నోటికివచ్చినట్లెల్ల వదరసాగితివా? నీకీకంఠశోషణ మెందులకు? నాయిష్టమువచ్చినట్లు కావించెద. నన్నాజ్ఞాపించుటకు నీ వెవ తెవు? నాదృష్టిపథమునుండి తొలఁగిపొ"మ్మని మరల నామె కడసారి చెప్పి చూచెదంగాకని "నాయనా! ఏటికిట్టి బెట్టిదంపువాక్యము లాడెదవు? నే మిమ్ము వేడుకొనుచుంటిఁ గాని యాజ్ఞాపించుచుంటినా? తండ్రీ! కృతఘ్నులగు నీమ్లేచ్ఛులు దమయవసరము తీరిన వెనుక నిన్నును నాశనముఁ జేయుదురుగాని మన్నింపఁజూతురా? అయ్యో! నీవు వీరలకుఁ దోడ్పడుట కాలాహికిఁ బాలుపోసి పెంచుటే. ఈ క్రూరుల దరిజేర్చుట శార్దూలములదగ్గఱఁ జేర్చుటే. వీరలకే నిక్కముగ జయము కలిగెనా నీ వేకొండలకైనఁ బాఱిపోవలసినదే గాని యిక్కడ నుండు వనుట కల్ల. నీవు నాయెడల నింతకాఠిన్యము వహించియున్నను నిన్ను గాంచిన నాకపరిమితమగు జాలి కలుగుచున్నది. కట్టా! ఈ నీచులు

ని న్నట్టిబాధలఁ బెట్టుదురోగదా? నీ కీయజ్ఞాన మెక్కడ కలిగినది? చిన్నదాననైనను తండ్రివగుటచే నీమేలుఁగోరి యింతగ వచించుచున్న దానను. మఱియు మన తాతలనాఁటి నుండివచ్చుచున్న నుత్తములగు వినయశీల దేవశర్మల వెడలఁగొట్టించితివని వినుటకు నాకెంతయో సంతాపకరముగ నున్నది. ఇంతవఱకైనది కానిమ్ము. ఇప్పుడైనఁ దెలివి కలిగి జాగ్రత్తపడుటకుఁ దగినంత సమయమున్నది." అని వినయవినమితోత్తమాంగయై పలుకుచున్న కూతుంగాంచి పట్టరాని కోపమున "ఓసి దౌర్భాగ్యురాలా! నీ కీయధికప్రసంగ మేటికి? నీ వీతక్షణమున నాయెదుటనుండి లేచిపోయెదవా లేదా" యని యతఁడుహుంకరించి పల్కిన నింతగ వేఁడుకొన్నను గార్యము లేకపోయెనని యామె యత్యుగ్రము నంది "కుత్సితుఁడా! నీవు నాతండ్రివైన నగుదువుగాక. నీవు నాజనకుఁడ వనుకొనుట కెంతయు సిగ్గగుచున్నది. ఏపాపముననో నీకుఁ బుత్రికనై జన్మించితిఁ గాని వేరొండుకాదు. స్వోదర పరాయణులును, కుమార్గగాములు నగు భట్టుమొదలగువారి వాక్యములే యమృతప్రాయములై నీతల కెక్కెనా? పవిత్రవంతమగు ఠోరూవంశపారావారంబున హాలాహలముఁబోలి జన్మించితివికదా? తరతరంబులనుండి ప్రఖ్యాతికెక్కి వచ్చుచున్న నీకన్యాకుబ్జరాజ్యమును ధ్వంసముఁ జేయ నీ వెక్కడనుండి దాపరించితివి? దుర్మార్గుడా! నీవు నాతండ్రి వేటికైతివి? లేకున్న నీవంటి నీచుని నీ నాఖడ్గమున నొక్క వ్రేటున నేల కర్పించియుందునే. నీవొక్కరుఁడవే యిట్టి యకార్యముల సలుపుటగాక తక్కుంగల సామంతులఁగూడ పురికొల్పి దెచ్చితివా? ఆహా! ఆర్యావర్తమునం గల యైకమత్యము నంతయు ధ్వంసము గావించి విడచితివి కదా? ఛీ! ఇఁక నీముఖము వీక్షించినఁ బాతకమగు" నని యగ్గలంపు కోపమున నాచోటువదలి పోయెను. జయచంద్రుఁడును నిరాఘాటముగ నెదురించి పల్కు పుత్రిక యెదుట నోరుమెదల్పనోడి వెడలిపోయిన వెంటనే తన శిబిరమున కేతెంచి సుల్తాను వలనఁ జక్రవర్తివచ్చినాఁడన్న వార్తవిని

తన సేనానాయకులకు రణము గావింప నుత్తరు వొసంగెను. మఱియు నత్తఱిఁ గొందఱుచారు లరుదెంచి కోసలపతి యోడి పారిపోయినాఁ డనియు, మందూరువంగపతులు మఱికొంత సేన నంపవలసినదని కోరినారని వచింప నట్లే వారికడకు మఱికొంత సేన నంపెను. అలీఘురువద్ద నిరువాగులవారును హోరాహోరిగఁ బోరాడఁగడఁగిరి. ప్రాణముల కాశింపక తమతమనాయకులచే హెచ్చరింపఁబడు దినముల కొలఁది సంగర మొనరించుచుండిరి. ఇటులిక్కడ ఘోరమగురణము జరుగుచుండ మఱికొంత సేన నంపవలసినదని యచలునికడనుండి చక్రవర్తికి లేఖవచ్చెను. సేనానాయకులందఱు రణమున మునిఁగియుండ నెవని బంపుదునా యని చక్రవర్తి యోచించుచుండ వేఱొకవైపున సైనికులఁ బ్రోత్సాహపఱచుచున్న సంయుక్త కావార్త తెలిసి వెంటనే భర్తకడ కేతెంచి "నాథా! మీ రేటికిట్లు యోచించెదరు? అచలునికిఁ దోడ్పడఁబోవుట కేనుసిద్ధముగ నున్నదానను. నన్నుఁ బంపుటకు మీ రెంతమాత్రము సందేహింపఁబని లేదు. వేవేగ సెలవొసఁగు" డని వెనుదీయక పలుకుచున్న తనప్రాణప్రియను వదల నిష్టము లేనివాఁడయ్యు నేమియు సేయఁజాలక యటులే పొమ్మని సమ్మతించెను. అంత నామె కొంత సైన్యమును బ్రయాణమునకు సిద్ధపఱిచి బయలువెడలి పోవుటకు ముందు చక్రవర్తికడ కేతెంచి యతని గాఢాలింగన మొనర్చుకొని "ప్రాణనాథా! యుద్ధమున జయాపజయంబులు దైవాధీనములుగదా? నాకచట నొకవేళ నేదైన నపాయము సంభవించినచో మీరు ధైర్యమువదలక మీ కార్యముల నప్రమత్తులరై యొనరించుకొన బ్రార్థించుచున్నదాన" నన నతఁ డత్యంతవిచారమున "సతీ! నిన్నొంటరిగఁ బంప మనసొప్పకున్నను విధిలేక పంపుచున్నాను. జాగ్రత్తతోడ రణభూమిని సంచరింపుము. మరల మనమిరువురము గలిసికొను భాగ్యమున్న నెట్లును గలసికొనఁగలము. పోయిర" మ్మని బిగియార గౌగిలించుకొని దీవించిపంప నామెయు నతనికిఁ బ్రణమిల్లి లేచి బయలుదేరి సేననంతయు నతినిపుణముగ నడిపించుకొని గైజియాపురమున కేగుచుండెను.

# ముప్పదియవ ప్రకరణము.



అట్లు సంయుక్త తన మనోకాంతుని చరణంబుల స్మరించుకొనుచు సేనల నతిప్రావీణ్యముతో నడిపించుకొని గౌజియాపురమున కతిగెను. ఆమె యచటి కేగునప్పటికి నచలునిసేన విస్తారము హతమైయుండెను. రాజకులుం డత్యంతపరాక్రమవమైన స్వాయముగ యుద్ధమునకు దిగి సైనికులకుఁ బ్రోత్సాహము కలుగఁ జేయుచుండెను. సంయుక్త తానువెంటఁగొనివచ్చిన సేనల నచలునిసేనలంగలిపి యతనివార లించుకధైర్యము చెడి యుంటఁగని పెట్టి "సైనికవర్గములారా! మిమ్ముఁజూడ నిరుత్సాహులైనట్లు గాన్పించుచున్నారు. ఇదివఱ కెన్నఁడు లేని పిఱికితనము నేఁడేల పూనెదరు? మీమీశౌర్యముల వెల్లడిపఱచుకొనఁదగు నిట్టిసమయము మఱియొకప్పు డెప్పుడైన దొరకునా? మనమందఱ మేనాటికైన మృతినొంద వలసిన వారమేకదా? ఎక్కడనో నీచమగు చావు చచ్చుటకన్న శత్రువులతో నెదురించిపోరాడి మరణంబునొందుటయే మేలు. ఈ తుచ్ఛశరీరంబులపై నావంతైన నభిమానముఁ బెట్టుకొనకుఁడు. ఇంతకాలముమిమ్ముఁ బోషించునవారియెడలను, మీ మాతృదేశము నెడలను సంపూర్ణాభిమానము గలిగియుండుఁడు. పొండు. మీ కార్యముల నప్రమత్తులరై యొనర్చుకొనుఁ" డని నందఱు రోషావేశులై విజృంభించి రణమున కేగి యొక్కుమ్మడి వైరిసంహారముగావింపనారంభించిరి. అఁట ఫరుక్నగరమున మహాబుద్ధి తన సేనలఁజక్కదిర్చి యుద్ధము సేయించుచు వంగపతిని భీతిల్లఁ జేయుచుండెను. కోసలపతి నెదురింపఁబోయిన ఘూర్జరనాయకుఁడవలీల సంపూర్ణజయముంగొని మరలశత్రువులెవరైన నేతెంతు రేమోయని కొన్ని దినంబులవఱకు జోలంపురియందేయుండి వేగులవారివలన జయచంద్రుఁడు తన్న

గరపుముట్టడిని మానుకున్నాఁడని విని తనకడనున్న సేనయందు కొంత భాగము నట కావలిగనుంచి మిగతదానింగూడుకొని మహాబుద్ధికిఁ దోడ్పడ నేతెంచెను. ఇట్లా ర్యావర్తమునఁ బ్రఖ్యాతిగాంచిన వానిలోని నగునగరములు రణసంకులములై యుండ నాలుగైదువారములు గడచి పోయెను. అప్పటి కలీఘురుదగ్గఱనున్న జయచంద్రుని సేన విస్తారభాగము నాశనమయ్యెను. లక్షలకొలఁదిగనున్న తమసేనయంతయు నష్టము గుచున్నందులకు సుల్తాన్ జయచంద్రు లిరువురు నిరుత్సాహులై విచారపడసాగిరి. అంట రైజియాపురమందలి సైనికులు బాహుపరాక్రమము లుల్లసిల్ల ధైర్యసాహసములతోఁ బోరాడుచుండ వారిధాటి కోరువలేక రాజకులుఁడానగరమును ముట్టడించుట మానుకొని పరువెత్తిపోయి జయచంద్రుని దగ్గఱ కేగుట లజ్జాకరమని వంగపతికిఁదోడ్పఁడఁబోయెను. సంయుక్త యావార్త తెలిసినవెంటనే యచలు నక్కడనే నిలిపి తాను మహాబుద్ధికి సహాయపడఁబోయెను. ఫరుక్నగరముననున్న సార్వభౌమసేనాధిపతు లీమెంగాంచినవెంటనే మన్నించి గొంపోయి యామె రణకౌశలముగని విని యున్నందున సర్వ సేనాధిపత్య మామెకే యొసంగి తాముపసేనాధిపతులై రణముఁజేయఁ దొడఁగిరి. సంయుక్త రణరంగమున బ్రవేశించినదాది మందూరువంగ పతు లామె నెటులైనజంప ననేక ప్రయత్నములు చేయుచుండిరి. ఆమె తనయుపసేనాను లిరువురు వేరొండుదిక్కుల రణముఁజేయుచుండ రెండుచేతుల రెండుకత్తులఁబూని సేనామధ్యమునకుఁజికి లెక్కలేని భటులఁ జంపుచు వంగపతిని సమీపించి యతని గడదేర్చెను. వేరొక ప్రక్క యుద్ధముఁజేయుచున్న రాజకులున కీవార్త తెలిసినవెంటనే భయమంది యెదుటఁబడి పోరాడిన శాత్రవులఁ గెల్వఁజాలమని రహస్యమార్గమున నామెం జంప నిశ్చయించుకొని యుపసేనానులున్న స్థలమును వదలకుండునట్లు యుద్ధము చేయుచుండవలసినదని తనక్రింది

వారల కాజ్ఞాపించి యతఁడు మహాబుద్ధి వేషమూని యామెకడ కేతెం చుచుండెను. సంయుక్తయు నాఁకలిగొన్న యాఁడుసింగములీల విజృంభించి రణము సేయుచు దూరమున వచ్చుచున్న రాజకుమారునిగాంచి మహాబుద్ధి యనుతలంపునఁ దానుగావించు పనియందే మునిఁగియుండెఁ గాని యతని విషయమై జాగ్రత్తపడదయ్యెను. అట్టితరుణమున మెల్లన రాజకుమారుండు వెనుకప్రక్కగ నామెను సమీపించి దీర్ఘమగు కరవాల మూఁగొని కంఠమునకు గురిఁజూచి కొట్టెను. వెంటనే యామె భయంకరలీల సింహనాదముఁ జేయుచుఁ దుపాకిదెబ్బ తగుల దెబ్బ వెంటనే యెగిరి వేటకానిపైఁబడు సింగములీల రాజకుమారునిపైఁబడి యొక్క నిమిషమున నతని పొడిచి చంపెను. కాని వెంటనే యామెయు దన గుఱ్ఱముపై వ్రాలెను. రాజకుమారుండు విసరిన దెబ్బ కంఠమునకు దప్పి భుజముకడదగిలి మొడవరకును దిగెను. నెత్తురు వెల్లువమై పారుచుండెను. సైనికులెల్లరు తనరాణికి సంభవించిన పాటునకు దత్తరమందుచు నామెచుట్టుఁ జేరి శత్రువులదరిఁ జేరకుండ దూరము చేయుచుండిరి. ఆవలివైపున యుద్ధము సేయుచున్న యుపసేనానులిరువురీ వార్త విన్న వెంటనే యొక్కపరుగున సంయుక్తదగ్గఱ కేతెంచి మూఁగుఁబారిన చంద్రునిఁబలె గుఱ్ఱముపైఁ బడియున్న యామెఁగాంచి ప్రబలార్తిమగ్నులై యాక్షణమందే యచటి కొకమైలు దూరముననున్న రాజవైద్యశాల కనిచి మితిమీరిన రోషంబున హతశేషులగు జయచంద్రుని సైనికులనెల్ల దునుమాడి పారఁదోలి సంపూర్ణజయోపేతులై వారును వైద్యశాలకడ కేగిరి. వీరు వైద్యశాలఁజేరునప్పటికి సంయుక్త మరణవేదన ననుభవించుచుండెను. లెక్కలేని దాసీలు చుట్టుఁజేరి యనేకగతుల నుపచారముల సలుపుచుండిరి. భుజముపైనుండి మెడవఱకు లోపలగల రక్తనాళములన్నియుఁ దెగియుండుటచే శరీరమునంగల నెత్తురంతయుఁ బోయి యతిశీతలత్వ మందియుండుటచే ధీవిశారదుఁడగు

వైద్యుఁ డత్యుష్ణముఁబుట్టించు నౌషధముల వాడుచు తెగిననాళముల దగ్గఱఁజేర్చి రక్తము బయట రాకుండఁ బ్రయత్నములఁ జేయుచుండెఁ గాని గాయ మతని కలవి గాకుండెను. సంయుక్త యప్పటి యవస్థం గాంచి సేనాను లిరువురును ధైర్యహీనులయి దుఃఖింప మొదలిడ నామె కొంచెము స్మృతిగల్గి చెంతనున్న వారి గుఱించి మిక్కుటమగు నాయాసమున హీనస్వరముతో " సేనాపతులారా! మీరిట్లు విలపించిన ప్రయోజనం బేమైనఁ గలదా? నాకుఁ గాలమాసన్నమైనది గానఁ బోవుచున్నాను. మరణమునొందుటకు నా కేమియుఁ జింత లేదుకాని కడసారి నామనోహరు వదనారవిందముఁగాంచు భాగ్యము లేకపోయెగదా యనువిచారము నన్ను బాధించుచున్నది" అని యొక లేఖవ్రాసి మహాబుద్ధిచేతి కొసఁగి "అయ్యా! నామరణానంతరము దీని నాప్రియున కందఁజేయుము. నేఁడు నాప్రాణములు నిలుచునట్లు లేదు. అత్యంతమగు నాయాసము పొడముచున్నది. కన్నులు దృష్టివిహీనము లగుచున్నవి. మీరు వచించువాక్యములును దిన్నగవినరావు. మీరందఱు నాకొఱకై చింతింపకుఁడు. నేపోయిన పిదప నీలేఖ నాప్రియునకొసఁగి యందులకతఁ డేమైన నకార్యములు గడంగసమకట్టినచో నాటంకపఱిచి యోదార్పుఁడు. అతని చరణారవిందములకు నాలింగనపూర్వకమగు వేనవేలు నమస్కారము లొనర్చితి నని విన్నవింపుఁడు. వెండియు నేరణమున కేతెంచుచుండ నామనోహరుఁడు నన్నుఁజూచి"సతీ! సంగరతలంబునఁగడు నప్రమత్తురాలవై సంచరింపు" మని వచించెను. నాయజాగ్రత్తచే నిటులయ్యె నని తలఁచునేమో? విధివశంబున నిట్టి పాటుకలిగినదని నుడువుఁడు మఱియు నా తోనీడయగు మంజరికడ కేగి నావచనములుగా నిట్లని తెలియఁజెప్పుఁడు."చెలీ! మంజరీ! చిన్ననాఁటనుండియు మనమిద్దఱ మొకటిగాఁ బెరిగి కలిసియుంటిమి. నేఁడు నీవు నాకు దూరస్థురాలవైయుంటచే నాకుగల్గిన పరితాప

మింతింతని వచింప నలవి గాదు. నీవు నాచావునకై బెంగపెట్టుకొనక చక్రవర్తివచ్చువఱకు నగరము నతిజాగరూకతఁగాపాడి యుతినిమన్ననలందుము. ఒకవేళ నానాఘనకేయుపజయము గలిగినచో మ్లేచ్ఛులవాతఁబడకుండఁబురకాంతలనందఱ రక్షించు భారము నీదేసుమీ' అని" వెండియు "సేనానీ! ఇంకొకటిగలదు. ఎవనిమూలమున నాయజ్ఞానాంధకారము మాసిపోజ్ఞానసూర్యుఁడు వెలుఁగఁగల్గెనో, యెవని కారణమున నామదింగల పిరికితనముపోయి శౌర్యమంకురించెనో, యెవనివల్ల న స్త్రశస్త్రాద్యనేకాయుధ ప్రయోగముల గుర్తెఱింగి సంగరరంగమందు సంచరింపఁదగుదాన నైతినో, యెవనిమూలమున నామనోరథము లెల్ల నెరవేర్చుకొనుచుందునో, యెవనియుపాయమున నీశ్వరభట్టు మొదలగువారి మాయావాగురులఁ జిక్కి ప్రాణములఁ గోల్పోవక బ్రతికితినో యట్టిసుగుణసమేతుఁడు, దీనదయాపరుండు, పరోపకారపారీణుండగు నా ప్రియోపాధ్యాయ దేవశర్మం గాంచఁగల్గితి రేని నాసంగతినంతయు విన్నవించినా నమస్కృతు లందఁ జేయుఁడు. మీరూరడిల్లియుండుఁ" డన నెల్లరును భరింపనోప కత్యంతముగ విలపింపసాగిరి. అత్తరిమరల సంయుక్త 'అయ్యా ఈప్రాణి కెప్పటికైన నిర్యాణమున్న దేగదా? ఇందులకై మీరింతగ వగవ నేటికి? అనవరతంబు సన్మార్గవర్తనులై, సత్యవంతులై, స్వార్థపరిత్యాగులై, మిమ్ముఁ బాలించువారియెడల భక్తిగలిగి మెలఁగుచుండుడు. అందువలన మీ కెనలేని సౌఖ్యంబులు చేకూరు" నని వెండియు "మీలో నెవరైన నాజనకుని దగ్గఱకేగి యిట్లువచింపుఁడు. "తండ్రీ! సపంతియువివేకుండవై కాపంపఁగడగిన యకార్యముల మూలమునఁగదా నాకట్టిదురవస్థ వాటిల్లినది. ఇందులకు నీపై నాకావంతైన గోపము లేదు. నే మరణించుసమ్మటనైన యించుక మంచిచెడ్డల విచారించుకొని సన్మార్గమున నడువుము. పరలోకంబున కేగుచును నీప్రియతనూజ సంయుక్తసమర్పించు వందనముల నను గ్రహింపు" మనిపల్కెను. అంతకొంత

తడవునకు మఱింత యాయాసము గలుగసాగెను. మాటలాడ దలంపు గలిగియు శక్తిలేమి కనులుమూసికొని పరుండియుండెను. దాసీలుమున్న గువారు దగ్గఱంజేరి పిలువఁ గనులువిచ్చి చూడసాగెను. కొంతసేపటి కదియు నడఁగిపోయెను. దండనాయకులు, దాసీలు, వైద్యులు మొద లగువారు చుట్టుఁజేరి విలపించుచుండఁ గొంతవడికి నాధీరసాధ్వి తనప్రా ణమువదలెను. అతులితధైర్యసాహసపరాక్రమవంతురాలై, యొక్క యార్యావర్తమువారిచేఁ గాక సకలవిదేశీయులచేఁ బొగడ్తలఁగాంచి, నిజయశోమరీచుల దిక్కుడ్యభాగంబుల వెలుఁగఁజేసిన మహారాణియగు సంయుక్తయట్లు జీవములవదల నక్కడనున్న వారందఱు మహాసంక్షో భమున మునిఁగిపోయిరి. అందఱామెచుట్టుఁజేరి " హా! లోకజననీ! హా! దివ్యమంగళవిగ్రహా! హా! మహారాణీ! సంయుక్తాదేవీ! అనాథ లమగు మమ్మందఱ నిట్లుదయమాలి నీవొంటరిగ నెచ్చటకేగితివి? తల్లీ! కన్నబిడ్డల కన్న నెక్కుడగు ప్రేమంబున మమ్ముఁ జూచుచుందువే! ఎ వరింక మమ్మిట్లాదరించి కన్గొనువారు? ని యీవృత్తాంతము మేమెట్లు నినాథునకుఁ దెలియఁబఱచఁగలము. అతఁడవార్తవిన్నపిదపఁ ప్రాణ ములభరించి యుండుననని తోఁచదు. నీవులేని మాజన్మమేటికి? హా! ఢిల్లీనగరరాజ్యలక్ష్మి! పోయితివా" యని యేడ్చుచు చేయునదిలేక రాజోపచారంబుల నామెశరీరము దహనముగావించి మఱపోయినవా రలై యందఱు నలీఘురుపద్దకురాఁ బయలుదేరిరి.

అఁట నలీఘురుదగ్గఱ ఘోరమగురణము జరుగుచుండ జక్రవర్తి శిబిరమునఁ గూరుచుండి తనప్రాణకాంతకడనుండి రెండు దినములైనను వార్తరానందుల కాలోచించుచుండెను. అత్తరి మహాబుద్ధి మొదలగు వారు దీనవదనులై శిబిరముఁ బ్రవేశించి యతనికి నమస్కృతులఁజేసి నిలువ "సంయుక్తయెక్కడ" నని యతఁడడిగెను. అందుల కొక్కరు ప్రత్యుత్తరమీయక తలలువంచుకొని నిలువఁబడియుండిరి. వీరిస్థితింగాం

చి చక్రవర్తి యనుమానోపేతుఁడై "మీ రంద తేలమాటలాడరు? నిక్కముగ నా ప్రాణకాంత కేమైనదో వచింపుఁడు. నామనస్సునేల నిట్లు కలఁతఁబెట్టెదరు; వచింపుఁ" డన నొక్కఁడును మాటలాడక విలపింపసాగిరి. అంత నతఁడు ధైర్యము చెడి "హా! ప్రాణనాయకీ" యనిమూర్ఛిల్లెను. వెంటనే దగ్గఱనున్న వారు సేదదేర్చ లేచి దుఃఖపరీతచిత్తుఁడై హా! నామోహంపు మొలక, నా ప్రియభామిని, నా ప్రాణము, నా సంయుక్త యెక్కడ నని యడుగ మీరేల ప్రత్యుత్తర మీయరు? నాహృదయమున నిటికిట్లు వ్యధగలుగఁజేసెదరు? చెప్పు" డన మహాబుద్ధి ధైర్యము దెచ్చుకొని సంయుక్త వ్రాసియిచ్చిన లేఖ నతనిచేతి కొసఁగెను. చక్రవర్తియు లేఖనందుకొని చదువుకొననోపక చెంతనున్న మఱియొకనిచేతి కియ్య నతడిట్లు చదువ నారంభించెను.

ప్రాణేశ్వరా!

తమచరణదాసినగు నే కాలంబుతీరి పరలోకమున కేగుచు విన్నవించుకొను దీనాలాపంబుల కొంచె మాలింపుఁడు. మీ చే నట్లను జాతిసైన్యై జయాపురముఁ జేరి రాజకులుని నోడించి పాఱఁదోల నతఁడు పోయి వంగపతితోఁ జేరుకొనెను. వెంటనే నేనును మహాబుద్ధికిఁ దోడ్పడనెగితి. రణమున బ్రవేశించినదాది మందూరు వంగపతులు నన్నుజంప నెన్ని యుపాయములో సల్పిరికాని వారికి సాధ్యము కాలేదు. తుదకు నేవంగపతిం జంపి యుద్ధము నేయుచుండ రాజకులుఁడు మహాబుద్ధివేషమునఁ జనుదెంచి నన్నుఁ బొడిచినాఁడు. తోడనే వానిఁ జంపితి కాని యతనిప్రేటు గురితప్పి భుజముపైనదగిలి మెడ పఱకు దిగినది. వెంటనే మహాబుద్ధిమొదలగు వారలేతెంచి నన్ని రాజవైద్యశాల కనుపఁ బాపమీ వైద్యుఁడును సంపూర్ణాదరమున నాకుఁ దగినచికిత్సలఁ జేయుచున్నాఁడుగాని నేబ్రతుకుటమాత్రము దుర్ఘటము. రక్తనాళములన్నియు భిన్నభిన్నములైనవి. శరీరమునంగల

రక్తమంతయుఁ బోయినది. నాథా! నిర్భాగ్యురాలనగుటనాకు భవ దీయదర్శనంబు మరల గలుగుభాగ్యము లేకపోయె. నాయంతమునకు మీరు బెంగపెట్టుకొనక ధైర్యమూని మీకార్యముల నప్రమత్తులరై యొనర్చుకొనఁ బ్రార్థించుచున్న దానను.

ఇట్లు విన్నవించుకొను మీప్రియురాలు

"సంయుక్త"

అని చదివినంతోడనే కనులవెంట నుక్కుమ్మడి బాష్పములుఁ జాల్గొన మూర్ఛిల్లి లేచి "హా! పరిహాసితపూర్ణిమాశశాంకవదనా? హా! రణరంగచరణకళావిశారదా! హా! వినీలకుంతలాచ్ఛాదితార్ధేందు నిటలా! హా! శౌరూవంశకలశార్ణవలక్ష్మీ! హా! మదీయమనోమోద సంధాయినీ! హా! ప్రియసఖీ! హా! సంయుక్తా"! యని విలపిం చుచు మరల మూర్ఛిల్లెను. దగ్గఱనున్నవారు శోకపరీతచిత్తులై యావల నట్లు దారుణమగురణము జరుగుచుండ నిక్కడ నిట్లగుటకు వెతనందుచు ననేక గతుల నోదార్ప లేచి చక్రవర్తి తనకాంతవ్రాసిన లేఖంగొని కనుల కద్దుకొనుచు "హా! మదీయకులకమలినీరాజహంసి నీ! నీకింతటిలోనే నూరేండ్లునిండెనా? నన్నిట్టిదుఃఖభాజనుగఁజేసి నీ వెచటికేగితివి? తన్వీ! నీసుందరవదనారవిందముగాంచి సంతసించు భాగ్యము నాకుఁ దీరిపోయెనా? నీవులేని యీరాజ్యభోగంబులు నాకేల? కట్టా! నీవంటియుత్తమ కులాంగనలకెల్లసంపూర్ణాయువు నొసంగని యావిధాత నేమన నగును. ముద్దులొలుకఁబలుకు నీవచ నామృత పూరంబులఁ గ్రోలుభాగ్యమే నిర్భాగ్యుండనగుట దప్పిపోయె. తరుణీ! ముందు జన్మింపఁగల నీతోడికాంతలకెల్ల గురుభూతవైతివి. పుట్టినింటికి మెట్టినింటికి యశంబుదెచ్చితివి. నీకు మాతృదేశముపైఁగల యభిమానమును వెల్లడిపఱచుకొంటివి. అయ్యో! భుజముదగ్గఱనుండి

మెడవలకు తెగినంతమాత్రముననే ప్రాణంబుల నిలుపుకొనఁజాలక పరలోకమున కేగితివికదా ? అర్ధాంగివగు నీవుపో యినపిదప నర్ధశరీరుఁడనై నే నెట్లు మనియుండఁగలను? నేనును నీవెంటనే చనుదెంచెద"నని ఖడ్గమునకై వెతకికొనఁబోవఁ దటాలున విజ్ఞానశీలుం డు లేచి యతనిహస్తమును బట్టుకొని "రాజేంద్రా' కాలముతీరుటచే నాసాధ్విపోయినది. ధీవిశారదుఁడవగు నీవే యిట్లు సేయఁబూనిన నీరణ సంరంభ మంతయు నేటికి? నీవిట్లు చేయుచున్నాడవని తెలిపిన జయ చంద్రుఁ డాదిగాఁగలవారల కెంతయుల్లాసమగునో తలపోయుము. నీవుపోయినపిదప మేముమాత్ర మెందుకు? మున్ముందు మముగడ దేర్చి యావల నియిష్టమువచ్చినట్లు కావించుకొను" మన నతఁడు మారు పల్కనోడి తనప్రియకాంతం గడసారి చూచివచ్చెదనని వేడుకొనెను. మహాబుద్ధి మొదలగువారు జరిగినసంగతుల సవిస్తరముగ నెఱుఁగఁజేసి చిరి. అంతఁ జక్రవర్తి మనస్సు రాయిచేసికొని జయచంద్రునివలన నింత చేటుగల్గినదిగదా యని త్వరలో నతనిజంప శపథమువట్టి దండనా యకులఁ బురికొల్పి తానుస్వయముగ రణమునకుఁదిగెను.



# ముప్పదియొకటవ ప్రకరణము

అట్లు చక్రవర్తి రణమునకుఁ దిగి రోషభీషణాకారుండై శత్రు సంహారముఁగావింప మొదలిడ నొకవార మగునప్పటికి జయచంద్రుని సేన పూర్తిగ నాశనమయ్యెను. అనేక వేల మ్లేచ్ఛులును హతులైరి. అంత నిఁక నాలస్య మొనరించిన మోసమగునని సుల్తాను తన సైన్యమును వెనుకకు మఱలించెను. సుల్తాను యాజ్ఞప్రకారము సేనలు●బరుగెత్తిపో వుచుండ స్వసైన్యము లేమి ముందుఁబోయిన యెటువచ్చునోయని జయ చంద్రుఁ డొకరాత్రివేళ నెవరికి దెలియకుండ నీశ్వరభట్టును వెంటఁ గొని వెండియు యుద్ధమారంభమైనది మొదలు దనకు బార్శ్వవర్తులుగ నుండి మిక్కిలి నమ్మకముతో మెలఁగుచువచ్చిన జలీమ్‌సేన్, షైదా ఖాన్, మిర్జాఖాన్ అనుముగ్వురుసేవకులఁగూడ గైకొని వేరొకమా ర్గమున వెడలిపోయెను చక్రవర్తి పరువెత్తుచున్నవారి నేలచంపవల యునని యూహించి వారిమ్లేచ్ఛదేశము వఱకుఁ దఱుమఁ దనవారల కాజ్ఞయిచ్చెను. ఇట్లుమ్లేచ్ఛులుముందు నార్యులువెన్కయై రెండుసేనలు మరల స్థానేశ్వరము దగ్గఱకుఁ జేరెను.

సుల్తాను తనకపజయము కలిగినందున ననారతము చక్రవర్తి నెట్లు చంపుదునా యని యుపాయముల వెదకుచున్నవాఁడుగానఁ దుట్ట తుదకు మోసముఁజేసి యార్యులఁ బరిమార్చఁగోరి స్థానేశ్వరము చేరిన పిదపఁ దా నార్యావర్తమువదలి మార్గమునం దేవిధమైన యల్లరులు చేయకుండ నాఫ్గన్‌స్థానమున కేగునట్లును తనదేశముఁ జేరువఱకుఁ గొంత చక్రవర్తిసేనను వెంటనుంచుకొని దానికగుఖర్చులు తానేభరిం చునట్లును, యిఁక ముందెన్నటికిఁ జక్రవర్తియనుమతిలేక యార్యావ ర్తమునకు రాకుండునట్లును, సార్వభౌమునితో సంధిగావించుకొని యెను. అట్లు సంధిఁజేసికొనుటవలనఁ జక్రవర్తి హృదయమునఁగల

రోష మంతరింప మరల దుఃఖ మంకురింపసాగెను. సంధి గావించు కొన్ని పిదప మ్లేచ్ఛు లెట్లుండిరో చూచిరండని చక్రవర్తి మొదలగు వారు కొందఱు వేగులవారినంప వారు తిరిగివచ్చి మహమ్మదీయులు శస్త్రాస్త్రముల నుజ్జగించి నెమ్మదిగ నున్నారని వచించిరి. అంత నా దినము ప్రొద్దుగ్రుంకినవెంటనే హాయిగ భుజియించి సార్వభౌమసైనికు లెల్లరు సకలలోకానందకరముగఁ గాయుచున్న నిండువెన్నెలలో కొంత సేపటివఱకు నిష్టమువచ్చిన ప్రసంగములాడుకొని తరువాత నెక్కడి వారక్కడ నిదురించిరి. చక్రవర్తియు ప్రత్యేకముగఁ దనకొఱకు నిర్మింపఁబడిన శిబిరముఁ జేరి మంత్రులు దండనాయకులు మొదలగు వారు చుట్టు నిదురించి యుండ దా సంయుక్తం దలఁచుకొని విలపిం చుచుఁ గొంతసేపటికల్లే నిదురగూర్కెను. అటు లార్యసైనికులెల్లరు మైమఱచి గాఢనిద్రాపరవశులై యుండ రాత్రి నొంటిగంటవేళ మ్లేచ్ఛు లందఱును సుల్తాన్ యాజ్ఞప్రకారము ఖడ్గపాణులై వారిమధ్యఁజొచ్చి యొక్కొక్కని దీర్ఘనిద్రబుచ్చసాగిరి. సుల్తాన్ బలశాలులగు నిరువది మంది భటులఁగూడుకొని చక్రవర్తియున్న శిబిరముఁ బ్రవేశించి నలు ప్రక్కల బరుండియున్నవారల వధించి చక్రవర్తి గొంతుఁ గోయఁ బోవుతరుణమున నతఁ డుల్కిపడిచేచి మ్లేచ్ఛులఁగాంచి విభ్రాంతుఁడై తనఖడ్గమును జేఁబూని వారిపైఁ దిరుగఁబడెను. ఈలోపలనే రెండు మూఁడు ఖడ్గప్రహారములు వెన్నునఁదగిలెఁగాని వానికి వెనుకదీయక పోరాడ మొదలిడి సుల్తాన్ వెంటవచ్చిన వారిలో నొకని దక్కువగ నందఱఁ గడదేర్చెను. అత్తరి సుల్తాన్ చక్రవర్తి మీదికి రానతనిక్రింద పడతన్ని నరుకబోవ మ్లేచ్ఛభటుఁడు వెనుకనుండివచ్చి చక్రవర్తి కంఠ ముపై బలమగుదెబ్బ కొట్టెను. ఆదెబ్బతో నతఁడు నేలగూల సుల్తాన్ పరువెత్తిపోయెను.

తెల్లవారు లోపల మిగిలిన యార్యులఁ జంపి మ్లేచ్ఛులందఱు

సుల్తాను కావార్త నెఱిఁగింపఁ గృతకృత్యుఁడై యతఁడు కన్యాకుబ్జము నాక్రమించుకొన కొంతసేనతో గుతుబుద్దీనును బంపి తాను మిగత సైన్యముం గూడుకొని డిల్లీకేగఁ బయనమై పోయెను. అంత నిక్కడ ప్రబలమగు నార్యసేనయంతయు దుర్దశంబడియుండఁ, దెల్లవారిన పిదప శత్రువుల కంటఁబడక మిగిలినకొందఱు చిన్న చిన్న కాలువలుగట్టి పారు చున్న రక్తమునందడిసి లేచి సంభ్రాంతమనస్కులై మహమ్మదీయులు గావించిన మోసమని తెలసికొని యీవార్త నెఱిగింప వారును డిల్లీ కేగిరి. సుల్తానుకుఁగాని మఱి యితరులకుగాని తెలియకుండఁ బారిపో యిన జయచంద్రుఁడు తనరాజధాని కేగఁబయనమై పోవుచుండెను.

మార్గమధ్యమున సిద్ధేశ్వరభట్టునకుఁ గలిగిన దురూహలకు మితి లేదు. కన్యాకుబ్జముఁ జేరులోపల జయచంద్రునిఁజంపి తానుపోయి యారాజ్యము నాక్రమించుకొనఁ గోరి పార్శ్వవర్తులు మువ్వు రత్యంత జాగరూకులై యుంటచే యనేక పర్యాయములతనిఁజంప గడఁగియు మానుచు నిఁక వారి కెఱుకలేకుండ తనకార్యము నెరవేర్చుకొనుట దుర్ఘటమని తలంచి యొకనాఁడు రాజావలకు జనియుండ వారితో రహ స్యముగ "మిత్రులారా! మీరు నాకత్యంత స్నేహితు లగుటచే నిప్పుడు నేనొక రహస్యము జెప్పుచున్నాను. దుర్ఘటమని యెంచకుఁడు. పాప మని తలపోయకుఁడు. మన మీరాజుగారి నెన్ని దినములనుండియో కొలుచుచున్నాముగదా!మన క్షేమైన సౌఖ్య మనిపించుచున్నదా?ఇత్తరి నేనొక యుపాయముఁ జెప్పెదను. నలుగురము నేరి యీరాజుం గడదే ర్చితిమా నిక్కముగ మనకుఁ గన్యాకుబ్జరాజ్యము లభించును. పట్ట ణముఁ జేరినపిదప నక్కడివిషయములు చక్కపఱచు భారము నాది. ఇట్లుచేయుటవలన మనకీ కష్టములన్నియు నణగి రాజభోగములు ప్రాప్త ములుగాఁగలవు. నామాట కాదనక యిందున కొడంబడుఁడు. మీ రతనికిఁ దోడ్పడకుండిన జాలు. నే స్వయముగ నతనిఁ గడముట్టించెద.

మీరిందులకు సమ్మతింపనిచో మనము పడవలసినబాధలకు మితియుం డదు. కాన నాలోచించుకొనుఁడు” అన వారుమువ్వురు మొగములు చూచుకొనుచు ‘ నారా ! ఏమి దుశ్చింత’ యని తలపోయఁ గడఁగిరి. అంత మరల భట్టు “ మీ రూరక మొగములు చూచుకొనుటవలన నేమి ప్రయోజనము ? మనమిప్పుడు కొంచె మించుమించుగఁ గన్యాకుబ్జముఁ జేర వచ్చినాము. ఆపట్టణ మిచ్చటకు నైదారామడలకంటె యెక్కువ లేదు. పురముఁ జేరినపిదపనతనిజంపుటమనతరముకాదు. ఆకార్యమిటువం టిస్థలమందే జరిగిన యెడలఁ బులి యెత్తుకొని పోయినదనిగాని రణమున నే మృతినొందినాఁడని గాని చెప్పి పౌరుల నెమ్మదిపఱచగలము. కావున నేదోయొకటి స్థిరారణ జేసికొని నాతో వచింపుఁ” డన వారుమువ్వురు రేపాలోచించి చెప్పెదమనిరి. తరువాత జయచంద్రుఁడు వచ్చుటచే నాఁటికాప్రసంగమాపివేసిరి.

ఆ మఱునాఁడు భట్టు స్నానమొనరింప నక్కడికిఁ గొంచెము దూరమున నున్న నొక సెలయేటికిఁ బోయియుండ మ్లేచ్ఛసేవకులు రాజుదగ్గఱ కేతెంచి “రాజేంద్రా! మీరింతకాలము మీభట్టు నెట్లు నమ్మి యుంచుకొంటిరో యూహింపఁజాలకున్నాము. వీఁడు మిమ్ముఁ గడతేర్చి కన్యాకుబ్జము నేలఁ దలఁపుఁ గలిగియున్నాఁడు. నిన్న మీరా వల కేగియున్న సమయమున నతఁడు మావద్దకు వచ్చి మిమ్ముఁ జావ మమ్ముంగూడ సహాయపడవలసినదని కోరినాఁడు. అన జయచంద్రుఁడు వారివాక్యముల విశ్వసింపక “మీరు చెప్పునదంతయు నాకాశ్చర్యముగ నున్నది” అనెను. అత్తరి వారు ముగ్వురు “ రాజా మీకతని యెడఁగల చిరపరిచయమున నిట్లనెదరుకాని కావలయునన్న నిప్పు డతఁడు వచ్చు లోపల నాపొదరింట దాగి యుండుఁడు. మాకందఱకు జరుగు సంభాషణ విందురుగాక ” యనిరి. అందుల కతఁడును సమ్మ తించిపోయి పొదరింట దాగియుండెను. అంత గొంతసేపటికి భట్టు

చనుదెంచి జయచంద్రుఁ డెక్కడ నని యడుగ నవతలకు వెళ్లిరని వారు చెప్పిరి. అత్తరిమరల "నే నిన్న మీతోముచ్చటించిన దానిఁ గూర్చి యేమిచేసితి."రన నామువ్వురు "అయ్యా! రాజ్యమువచ్చున న్న సంతోషము మాకునుగలదు కాని మమ్ముఁబోషించువారి యెడ నట్టిద్రోహంబుఁ గావింప మామనంబులు జంకుచున్నవి. మఱియు నావిషయమై తలఁచుకొన్నపుడెల్ల మితిలేనిభయము గలుగుచున్న" దని వచించిరి. అందుల కతఁడు "మీరు వట్టి తెలివితక్కువవారుగఁ గన్పించుచున్నారు. మనలఁ బోషించువారని యభిమానము పెట్టుకున్నచో మన మొక్కనాఁటికి నెగ్గఁజాలము. అయినంతవఱకు మనకు సౌఖ్యము కలుగు మార్గము చూచుకొనవలయుఁగాని రాజనితలఁచి యూరకున్నచో మన మేనాఁటికి బాగుపడఁజాలము. నేను మొదటినుండి యింతవఱకుఁ గావించుచున్న వానివిన్నచో మీరెంతైన నాశ్చర్యపడుదురు. నాకు బుద్ధివచ్చినప్పటినుండి రాజ్యము సంపాదింపవలెనన్న కోరికను మనస్సునఁ బెట్టుకొని సాధ్యమైనన్ని కుట్రలఁ బన్నుచున్నాఁడఁగాని యింతవఱ కాకోరిక సఫలము గాలేదు. ఇప్పుడు మంచి తరుణము దొఱికినది. ఈసమయమును జెడఁగొట్టుకొంటిమా యిఁకమనకు వేరొండు తెరువులేదు. కావున మీ 'రట్లే' యన్నఁజాలు. ఒక్కక్షణమున నే నతనిఁ గడతేర్చెదను. మనము నల్వురముగలిసినట్లైన జయచంద్రుని రహస్యముగఁ జంపనవసరముండదు. బహిరంగముగ నెదిరించి పోరాడి చంపవచ్చును. నేనింతకుమునుపు గోరీమూలమున నా కార్యము నెరవేర్చుకొనఁ దలఁచియుంటిఁగాని యతనికే యపజయము కల్గినది. కాన నిప్పు డింత ప్రయత్నము చేయవలసివచ్చినది. మీ రేమాత్రము భయమందవలసిన కారణములేదు. నేను చిన్నతనంబు నుండియుఁ జేసినవానిఁ జెప్పఁబూనినచో నొక పెద్దగ్రంథమగును. కాన కొంచెముఁగ దెల్పెదను. డిల్లీయందున్న కాలమున నొక మహా

మ్మదీయునితోఁ గలిసి చక్రవర్తిపై ననేకములగు కుట్రలఁ బన్నితి. కన్యాకుబ్జముఁ జేరినదాది నితని భరతముఁ బట్టింపఁ బ్రయత్నములఁ జేయుచున్నాఁడను ” అనుమాటలు భట్టునోటివెంట వెడలుటయే తడవుగ నంతవఱకును బెరుగుచున్న కోపము నాపుకొని లోపలనున్న జయచంద్రుఁ డిక నాపుకొనఁజాలక 'యోరా' యనుచుఁ దటాలునఁ బాదవెడలివచ్చెను. భట్టతనిగాంచిన వెంటనే నిశ్చేష్టితుఁడై యొక్క క్షణమాత్రము నిలచి తరువాత చప్పునఁ బారిపోవఁ దలఁచి కొన్ని యడుఁగులువైన చివాలునపైదాఖా బరువెత్తి తనచేతికత్తితో నతనిపాదముల తెగఁగొట్టెను. భట్టు కెవ్వునఁ గేకవైచి నేలకొరిగి ప్రాణముల నదలెను. దూరముననుండి చూచుచున్న జయచంద్రుఁ డాదుర్మార్గునకుఁ దగినశిక్షయైనదని తలఁచుకొనుచు సేవకులఁగూడిమరలఁ బయనమై పోవుచుండెను. నాఁటినుండియు జయచంద్రుని మనసంతయు మారిపోయెను.

అంతవఱకు దానుకావించిన యవివేకపుఁ గార్యములకుఁ బశ్చాత్తాప మందఁజొచ్చెను.అన్యాయముగ నీశ్వరభట్టును నమ్మి మోసపోయితిగదా యని తలంపసాగెను. అట్లు పశ్చాత్తాపతప్తుఁడై తననగరమున కేగుచు మార్గమధ్యమున నొక వృక్షముక్రింద విడిసియుండ రాత్రి రెండుజాములవేళ గొందఱు బాటసారు లాచెట్టుక్రిందికే వచ్చి మరియొక వైపునవిడిసి నిట్టూర్పులు విడచుచు “ హా! జయచంద్రా ! మమ్మందఱ నరణ్యములపాలు కావించి పోయితివిగదా” యని తనపేరు నుచ్చరించుచు దుఃఖించుచుండ వారిసమాచారమరయుటకై తనీ ముగ్గురు సేవకులతో నెదుటకేగి నిలువ వారుభీతిల్లి “అయ్యో! మన కిక్కడగూడ మ్లేచ్ఛులదర్శన మయ్యెనే” యని యఱచుచుఁ బరుగిడఁ జొచ్చిరికాని జయచంద్రుఁడు వారలనాపి “అయ్యా! మీరెవరు? ఏటికిట్లు మమ్ముఁగాంచి భయంపడెదరు? మేము మీ కేవిధమైన యపకారము

చేయుటకు రాలేదు. సావకాశముగ మీ వృత్తాంతముఁ దెలియఁజేయుఁ" డన "అయ్యా! నిన్నుఁ గాంచిన మాకేవిధమైన భయము లేదు కాని యీముష్కరుఁ జూడ మాగుండెలు కొట్టుకొనుచున్నవి. మే మీదినము సాయంతనమువఱకు నిట్టివేషములవారి చేతులలో జిక్కుఁబడి చావు దప్పి కన్నులుఁగొట్టిపోయి తప్పించుకొనివచ్చి యిటఁ జేరినాము. ఇక్కడఁ జేరిన వెంటనే మరల వీరిదర్శనమయ్యెఁగదా యని భయము కలిగినది. ఇత్తరి నీ వభయహస్తము నిచ్చియున్నావు కాన భయమువదలి మావృత్తాంతముఁ జెప్పెదము వినుము. మేమందఱముఁ గన్యాకుబ్జనగ వాసులము. మా రాజగు జయచంద్రుఁడు సద్గుణవంతుఁడే కాని యీశ్వరభట్టను నొకదుర్మార్గునిఁ జేరదీసి యతనికుట్రపుమాటలవిని మంచి చెడ్డ లాలోచింపక చక్రవర్తితో వైరముఁ బెట్టుకొని మాకెన్న రాని కష్టముల గలిగించినాఁడు. రాజ్యకార్యధురంధరులును, సద్గుణశీలురును, మంత్రిపురోహితులు నగువినయశీలదేవశర్మ లెంత చెప్పినను వినక వారల వెడలఁగొట్టి మారాజు వివేకహీనుఁడై భట్టు సలహాప్రకారము మ్లేచ్ఛులఁ దోడు చేసికొని చక్రవర్తిమీదికి దండెత్తిపోయినాఁడు. నేఁటికి వారమురోజులక్రిందట జయచంద్రుఁ డెక్కడికో పారిపోయినాఁడనియు, చక్రవర్తియు సంయుక్తయు మరణంబునొందిరనియు దెలిసినది. ప్రజలందఱియెడ సమానభావము గలిగి సకలసద్గుణసమన్వితయై బరగిన సంయుక్త మరణమునకును, నతులితప్రతాపశాలియగు చక్రవర్తి గతించుటకును జయచంద్రుఁడే కారకుఁడుగదా యని పౌరులెల్ల రతని ననేకగతుల దూషింపసాగిరి. ఎట్లైనను రాజు కావున నతనిపోకకు నొకవైపున జింతింపసాగిరి. ఇటులుండ పురిసినపుండుమీద కారముజల్లినట్లు కుతుబుద్దీను మహమ్మదీయుఁడొకఁడు సేనాపరివృతుఁడై వచ్చి మానదుర్గమును స్వాధీనముఁ జేసికొని పౌరులనెల్ల ననేకగతుల బాధింప మొదలిడ వానికోర్వఁజాలక మావలెనే యనేకు లిదివఱకే

యడవులపాలైరి. నగరమందలి గొప్పవారందఱొకటియై వాని దగ్గఱకేగి ' మహారాజుగారు లేని తఱి మీరిట్లువచ్చి యాక్రమించుకొను టుచితమగునా! కావున న్యాయ మాలోచించి మీరువెళ్లు' డన నవ్వుచు నతఁడు ' మీరాజుగా రప్పుడే పరలోకగతులైనారు. బ్రతికివచ్చినను నతనికి మేము రాజ్యమియ్యము. చక్రవర్తి నోడించినపిదప జయచంద్రునిగూడఁ జంపి యీరాజ్యము నీశ్వరభట్టున కిచ్చునట్లు లతఁడు మేము నొప్పందముఁ జేసికొనియుంటిమి. కాన మీదారిని మీరుపొండన వారు మఱలివచ్చిరి. అంతఃపురవాసులెల్లరు నెక్కడనైనఁ దలఁదాచుకొన రాత్రివేళల ననేకమార్గములఁ బోఁగడఁగిరి. మేము నిట్లు చనుదెంచితి" మని వచింప జయచంద్రుఁ డత్యంతలజ్జాక్రాంతుఁడై విచారమున మునిఁగి "అయ్యా! మీకేఁక నేవిధమైన భయము లేదు. మేమును మీవలెనే బాటసారులము. మఱియు మీరు నిద్రించుతఱి నే మేల్కాంచి కావలియుండెదను. తెల్లవారినపిదప మన మందఱ మెక్కడకైనఁ బోవుదము. శయనింపు" డన వారు నట్లే పరుండి నిద్దురపోయిరి.

జయచంద్రుఁ డారాత్రి నంతయుఁ గావలికాచి ప్రభాతమగు సమయంబున నావల కేగి కాల్యకరణీయములఁ దీర్చుకొనివచ్చి కూరుచుండి యుండెను. అంత బాగుగ దెల్లవారినపిదపఁ బౌరులెల్లరు మేల్కాంచి ఖడ్గపాణియై తమకు గావలిగఁగూరుచుండియున్న రాజుం గాంచి శోకముప్పొంగ హా! జయచంద్రా యని యొక్క పర్యాయముగ నతని పాదములపై వ్రాలిరి. అత్తఱి రాజును దుఃఖమున శిరము వంచుకొని "పౌరులారా! లెండు, మిమ్మి ట్లడవులపాలుగావించిన క్రూరుఁడగు నీ జయచంద్రుని పదములపై నేల బడెదరు? అయ్యో! మీకు నిలువ నీడయైనను నాపురంబున లేకపోయెగా" యని వారి నోదార్చ లేచి వారందఱు "అహో! నేఁడు మే మెంతధన్యులమైతిమి?

ఎన్నాళ్లకు భవదీయదర్శనం బబ్బెను ! రాజచంద్రా ! మీకును గహనవాసమే చేకూరెనా ? మాగతి యెట్లులైనం గానిమ్ము. అయ్యో ! పుట్టుభోగంబులగాంచిన రాకుమారుఁడవే ! సామ్రాజ్యపాలకుఁడవే ! ఎట్లీయరణ్యంబుల వేగించెదవు. హా ! దైవమా ! నీవెంతనిర్దయుఁడవు? మాకును మారాజునకును గాననమే గతిచేసితివా " యని విలపించుచుండ " అయ్యో ! నాకు రాజ్యముపోయినదనుచింత యెంతమాత్రము లేదుకాని యవినీతుఁడనై వెడలఁగొట్టిన నామంత్రిపురోహితు లేమైరో యనిదుఃఖము గలుగుచున్నది. కట్టా! నిష్కారణముగ నిండుసభ వారి నవమానపఱిచి వెడలఁగొట్టితి. నాహితము గోరువారిని తలఁపనైతి. క్రూరుఁడగుభట్టునే నమ్మితి. అయ్యో ! ఆమహాత్ములిప్పుడు నాకంటఁబడిన నే నెంతయైన ధన్యాత్ముఁడ నగుదు " నని చింతించుచుఁ గూరుచున్న తరుణమున మ్లేచ్ఛసేవకులు ముప్వురు ముందర కేతెంచి " రాజేంద్రా ! నీమంత్రి పురోహితులింతవఱకు సౌఖ్యముగ నున్నారు. నీవు వివేకహీనుఁడవై పారఁదోలినను వారు నీసహాజగుణము నెఱిఁగియున్నారు కాన భట్టుమూలమున నట్లుకావించితి వనుకొనుచు మరల నీవు సన్మార్గమునకు రాఁబరమేశ్వరు బ్రార్థించుచు నొకవేళ నీకేమైన నపాయముగ లిగినదోడ్పడ నీవెను వెంట నే మెలంగుచున్నారు. వారే యీవేషము " లని తమమ్లేచ్ఛవేషములఁ దీసివైచి వినయశీలదేవశర్మ కంచుకులై యెదుట నిలిచిరి.

అత్తరి జయచంద్రునకు గల్గినసంభ్రమము వచింప నలవికాదు. మిక్కుటంబుగ విచారమును సంతోషము నుప్పతిల్ల నోటిమాటలేక యొక్కక్షణకాలము వారివంక నే దృష్టినిగుడించుచుఁ గూరుచుండి యుండి వెంటనేలేచి వారిపాదములపై వ్రాలెను. ఆసమయమున వారనురాగ పూరితులై యతని లేవనెత్తి "రాజా! భృత్యులమగు మా

పాదములపైఁ బడుట నీ కుచితముగాదు. నీవు మరల సన్మార్గమునఁ బడినందులకు మాకు మితిలేని సంతసము కలుగుచున్నది. గతించిన దానికి వగచిన నేమిప్రయోజనము. పోయినరాజ్యము మనకు మరల రానేరదు; దుర్మార్గుఁడగు నీశ్వరభట్టు మనలకిట్టిగతి గలుగఁజేసినాఁడు కాని" మ్మని పౌరులవంకకుఁ దిరిగి "అయ్యా! మీరిప్పుడెక్కడికేగ బయనమైతి" రని యడుగ "ధీమంతులారా! మే మీయరణ్యములందే వసింప వచ్చినాము. ఏపురముఁ జేరబోయినను మహమ్మదీయులపాలే గదా! అట్లుకాని యెడల మీరెట్లుచెప్పిననట్లు నడుచుకొనఁ గలవార" మని పౌరులు వచించిరి. అత్తరి వారితో దేవశర్మ "పౌరులారా! మన మందఱము నడవులయందే వసింపవలసినవారమైనను వేరువేరు కాన లందుఁ బ్రత్యేకముగ నుండఁదగినవారమేకాని యొకటిగఁ గలిసియుండు టకు మాత్రము వలనుపడదు. అనేకు లొక్కచోటఁ గూడియుండు నప్పుడు వేర్వేరు పనులమీఁదఁ బలుప్రదేశములకుఁ బోవలసివచ్చును. మన మెంతరహస్యప్రదేశమున వాసముచేయుచున్నను గ్రహచారము చాలక మనలో నొక్కఁడు శాత్రవులకంటఁ బడుట సంభవించెనేని వారెన్ని కష్టములనైనఁబడి గుట్టుకనిపెట్టి మనల నందఱ వధింతురు. కావున మేము నల్వుర మెక్కడకైనఁ బోయెదము. మీరు మఱియొక త్రోవనుబొం"డన సమ్మతించి జయచంద్రుఁడు మొదలగువారలకు నమ స్కృతు లొనరించి పౌరులు తమదారింబోయిరి. అనంతరము వారు నల్వురక్కడకుఁ గొంతదూరమందున్న నొకకొండదరికేగి యచ్చోట నొకరహస్యమగు ప్రదేశమున బర్ణశాలను నిర్మించుకొని యందు నివా సముసేయఁ దొడఁగిరి.

అనుదినమును జయచంద్రుఁడుపడు పరితాపమునకుఁ బరిమితి లేకుండెను. దేవశర్మాదుల కతనినోదార్చుట దుర్ఘటముగఁదోఁచుచుం

డెను. ఇట్లుండ నొకనాఁడు మంత్రి పురోహితభృత్యులు మువ్వురుఁ బ్రభాతకాలమున లేచి వాడుకప్రకారము నిత్యకృత్యముల నెరవేర్చుకొనుటకుఁ గొండదిగువనున్న సెలయేటివద్దకు వెళ్ళిరి. అంతఁగొంతసేపునకు జయచంద్రుఁడు మేల్కాంచి యొంటరిగనున్నందునఁ దలంపులన్నియు మనస్సునకురా "హా! నేనెంతక్రూరకర్ముఁడను? నా కాయీశ్వరభట్టెక్కడదాపరించె? అయ్యో! నిక్కమైనమిత్రుఁడనినమ్మితిఁగాని నాకింత ద్రోహము గావించువాఁడని కలనైనఁ దలఁచితినా? సర్పమునకుఁ బాలుపోసి పెంచునట్లు వానిఁ బోషించితి. దైవమా! నాప్రజలకందఱకు నిలువ నీడలేకచేసి యడవులపాలు కావించితివా? ఇఁక నేను జీవించి యేమిప్రయోజనము? రాజ్యమాపోయె. బంధువులానశించిరి. ప్రియతనూజయా మరణించె.నాకు గష్టములుకల్గినయెడఁ దోడ్పడి రక్షింపఁగలవాఁడని తలఁపక నిష్కారణముగ నతిధీమంతుఁడగు జామాతతో వైరముబెట్టుకొంటి.తుదకతఁడును నాశనమయ్యె. హా! ప్రియకుమారీ! సంయుక్తా! నీవచనంబు లెంతయాదరణీయములే! అమ్మా! తండ్రినని దయదలంపకనన్నప్పుడే చంపియుండిన నింతకానేరదుగదా! సుగుణగణసమేతవగు నిన్నుఁ దిరస్కారము గావించి యింత దెచ్చుకొంటి. తల్లీ! అప్పటికి నీవచనసుధాధారలు విషతుల్యములై యాక్రూరునివిషవాక్యములే యమృతోపమానములయ్యె. అయ్యో! నీవెంతపరితపించి యుంటివోగదా? నేను నిన్నంతనీచముగ నొవ్వనాడినను నాపైఁ గిన్కఁబూనక నీమరణకాలంబున నాతోఁ జెప్పఁబంపిన వాక్యము లెంతశ్లాఘాపాత్రములు! అమ్మా! నీవన్నట్లు నాకు గహనసంవాసమే ప్రాప్తమైనది. హా! జామాతా! చక్రవర్తీ! నీవు నన్ను కన్యాకుబ్జనగరవుముట్టడియప్పుడే యేల చంపవైతివి? అయ్యో!తలఁచుకొన్నకొలఁది నా కడుపు తఱుగుకొనిపోవుచున్నది. ఛీ! జయచంద్ర

పాతకా! మాతృదేశఘాతకుడవగు నీవింకను బ్రతికియుండదలంచెదవా? పోయియిప్పుడే యెక్కడనైన మృతినొందరాదా' యని తన్ను దాన దూషించుకొనుచు మిక్కుటమైన శోకమునఁ దనఖడ్గముగైకొని కొండ యావలిప్రక్కకుదిగెను. అక్కడఁ గొందఱు పుణ్యాంగనలు "హా జయచంద్రా! మావంటి మానవతులకెల్ల భరింపశక్యముగాని యవాచికములగు నిక్కట్టులఁ గలుగఁజేసి పోయితివిగదా' యని రోదనములు చేయుచుఁ గాష్ఠముల బేర్చుకొని వానికి నిప్పంటించుకొని పైఁబడుండి చచ్చుచుండిరి. జయచంద్రుఁడాదారుణకృత్యముల నవలోకించి విభిన్నచేతస్కుఁడై 'ఓ సాధ్వీమతల్లులారా! పూజనీయంబగు పరలోకంబున కేగుచు బాపాత్ముఁడఁగు జయచంద్రుని పేరేల యుచ్చరించెదరు? అయ్యయ్యో! మీకిట్టిపాటుగల్గఁజేసిన యీదురాత్ముఁడుగూడఁ జావఁబోవుచున్నాఁడు. మీకందఱకు స్వస్థతచేకూరుఁగాక" యని ఖడ్గముతోఁ బొడుచుకొని తనమిత్రులదలఁచుకొనుచుఁ బ్రాణముల వదలెను.

అంత నట స్నానములొనరింపబోయినవారు తిరిగివచ్చిపర్ణశాలయందు రాజులేకుండుటచే ననుమానగ్రస్తులై యతనివెదకుటకు ముగ్వురు మూఁడుత్రోవలబోయిరి. అందు దేవశర్మరాజుపడియున్నవైపున కేగి తగులఁబడుచున్న కాష్ఠములఁగాంచి విస్మితుఁడై కొంచెమనతలికిబోయి చేతిఖడ్గము కంఠమున గ్రుచ్చుకొనియుండ విగతజీవుఁడై పడియున్న యతనిగాంచి హా యని మతిదప్పిపోయినవాఁడై కళేబరముమీఁదబడి "హా! సార్వభౌమా! హా!జయచంద్రా! మమ్మందఱ మోసము గావించిపోయితివా! ఓ! ఆర్యావర్తమా! నీకుఁ బ్రేమాస్పదులగు రాజులెల్లరు నశించిరికదా ? ఇక నీగతియేమగు" నని విలపించుచు నాఖడ్గము లాగుకొని దానితోనే పొడుచుకొని తానును మరణంబునొందెను. అంత కొంతతడవునకు వినయశీలుఁ

డేతెంచి రెంటుకళేబరములఁజూచి శోకమున “ హా! ఇదియేమి నేను
నిక్కముగ నావారికళేబరములఁ జూచుచున్నానా? లేక నాకేమైన భ్ర
మ చేకూరినదా ! హా ! జయచంద్రా ! నీకీదుర్మరణంబేలకల్గె! హా!
నెచ్చెలీ ! దేవశర్మా! ఇప్పుడేకదా మిమ్మంటుబంపి నీ విటువచ్చితివి?
ఇంతలో నింత ఘోరమా ! హా ! నీవు యమునంబడిన నాటఁగోలె
నేటివఱకు గావించిన కృత్యములఁదెల్పి యవి మనజయచంద్రునకుఁ
దెల్ప నేతెంచితివిగదా?కట్టా!నీసాహసకృత్యములఁ బరలోకమందైన న
ఱేఁగించెదఁగాక యని పోయితివా? నేనుమాత్ర మేలవినకుండవలయు.
ఇదిగో నేనును వచ్చుచున్నాఁడ” నని తనదగ్గఱనున్నకత్తితో బొడుచు
కొని ప్రాణములవదలెను. కొంతతడవునకుఁ గంచుకి చనుదెంచి మూఁడు
శవముల వీక్షించి భయోపేతుఁడై రోదనసేయుచు నఁట మందుచున్న
యొక కాష్టముపైకురికి మృతుఁడయ్యెను. అఁట డిల్లీ నగరమందున్న
మంజరి జరిగిన వార్తలన్నియు విన్న వెంటనే దుర్గమందున్న సేనను గో
రీని నెదురింపఁ బంపి యనంతరము పురమునంగల యంగనలనెల్ల రావిం
చి వారితో “సాధ్వీమతల్లులారా ! కన్నబిడ్డలంబలె మనలఁ బోషించు
చువచ్చిన రాజదంపతు లిరువురు మృతినొందినపిదప మనముజీవించి
యున్న ప్రయోజనంబేమి ? మఱియు గోరీ మనపురంబున కేతెంచుచు
న్నాఁడఁట. మ్లేచ్ఛులచేఁ జిత్రహింసపడుటకన్న వేరుమార్గముల మృతి
నొందుటమేలు? అదియుంగాక నాప్రియసఖియగు సంయుక్తతాను మర
ణించు తరుణమున ‘చెలీ ! మంజరీ! ఒకవేళ నానాథున కపజయంబై
న డిల్లీపురకాంతలమానభంగముగాకుండ రక్షించుభారము నీదేసుమీ
యని సందేశమంపియున్నది. ఇత్తరి మిమ్మట్లు రక్షింప నాకు వేరొం
డువెరవుగన్పించుటలేదు. గోరీ వచ్చులోపలఁ జితులం బేర్చుకొని య
గ్నినిడుకొని వానిపైఁ బడి మృతినొంది మామర్యాదలఁ గాపాడుకొ

షుఁ" దన నందఱు శోకాక్రాంతలై యాక్రందనముల జేయుచు మంజ
రి దారిఁజూప దాముసు బ్రాణముల బాసి స్వస్థతనొందిరి. సుల్తాన్
మహమ్మద్ గోరీయు దన్నెదురింపవచ్చిన సేనల నవలీలనుక్కడించి రాజ
ధానిం జేరి దుర్గపుఁదలుపులు తెరువఁబడియుంటచే నేయాటంకములు లేక
లోపలఁ బ్రవేశించి పురమున నెక్కడఁజూచినను భస్మరాశులుంట కా
శ్చర్యకలితుఁడై యార్యకాంతల సాహసమునకు మెచ్చుకొనుచు నన్నిక
డల బాగుసేయించి మహమ్మదీయ రాజ్యము స్థాపించెను.

సంపూర్ణము.



విక్రయమునకు సిద్ధము! విక్రయమునకు సిద్ధము!!

ఓం

# పురుషార్థప్రకాశము

రాణీసంయుక్తయను నవల గ్రంథకర్తగారగు

శ్రీ వేలాల సుబ్బారావుగారిచే తెనుగున వ్రాయఁబడినది.

అన్ని విధములయిన సంఘసంస్కరణోద్యమములకు తోడుపడుట యందు ఇంతటియుపయోగకరమైన గ్రంథము ఇంతవఱకు తెనుగులో లేదు.

ఇందు రెండుప్రకరణములు కలవు. మొదటిదగు బ్రహ్మచర్య ప్రకరణమందు మనుజులు విద్యాభ్యాసము నిమిత్తము ఎంతకాలము వఱకు ఏయేవిధుల ననుసరించి యెట్లునడచికొనవలసినదియు వ్రాయబడియున్నది. వేదాదిశాస్త్రముల వినుటకునైన నర్హులుకారని పాతాళము నకు అణగద్రొక్కబడిన స్త్రీ శూద్రాది సమస్తమానవ మాత్రులకు ఉపనయనాధికారము, వేదాధ్యయనాధికారము నుండినటుల అనేక స్మృతులనుండి ప్రమాణము లిందు చేర్కొనబడినవి. రెండవదియగు గృహస్థాశ్రమ ప్రకరణమందు వివాహానంతరము దంపతులు పాలింప వలసిన అత్యుత్తమములైన విధులంగూర్చి విపులముగ వ్రాయబడి యున్నది. 450 పుటలుండును. ఖరీదు రు 1—4—0

వలయువారు:—

వి. వి. కె. లక్ష్మాజీరావు,

గుంటూరు.

అందరుచదువుచున్నారు! మీ రేలచదవరు?

# ప్రొద్దుపొడుపుఁబువ్వులు

అనగానేమి?

నిడుదవ్రోలునుండి ప్రతివారమున కొకటి చొ॥ మూడుమాసములకుఁ బండ్రెండు చిన్నగ్రంథము లిట్టివే (1) నవల (2) గీతము (3) చరిత్రము (4) కథలు మొదలగునవి ప్రకటింపఁబడుచుండును. ఈ అణాగ్రంథమాల పుష్పములకే "ప్రొద్దుపొడుపుఁబువ్వులని పేరు"

ఇందు

| | | | |
|---|---|---|---|
| 1 జగన్నాథమూర్తి (విచిత్రకథ) | 0 | 1 | 0 |
| 2 సుభాషిణి (బంకించంద్రుని నవల) | 0 | 1 | 0 |
| 3 మాళవిక (చమత్కార రచనము) | 0 | 1 | 0 |
| 4 యతిక్రిబతి (రబీంద్రుని నవల) | 0 | 1 | 0 |
| 5 మంజువాణి (చక్కని చిన్నినవల) | 0 | 1 | 0 |
| 6 ఇందిర (ఉన్నతపారితోషికమునొందిన కరుణారసపూరితమగు నవల) | 0 | 1 | 0 |
| 7 జలజమాలిక (ప్రభాతకుసుమము) | 0 | 1 | 0 |
| 8 బసివిరెడ్డి (ఆంధ్రవర్తకశేఖరునిచరిత్ర) | 0 | 1 | 0 |
| 9 పారిజాతము (పార్వతీశ్వరప్రసాదము) | 0 | 1 | 0 |
| 10 చంద్రవదన (సాంఘికనవల) | 0 | 1 | 0 |
| 11 భానుమతి (శాంతరస సమంజసమగు సంస్కృత నాటక కథాసారము) | 0 | 1 | 0 |
| 12 తిరుమల (చరిత్రవిషయకమగు నవల) | 0 | 1 | 0 |

అను మొదటి 12 గ్రంథములు సిద్ధముగానున్నవి.

మాదిరి పుస్తకముగోరువారు రెండణాలబిళ్లలనుపంపవలెను.

ఈప్రొద్దుపొడుపుఁ బువ్వులకు శాశ్వతచందాదారులుగ నుండ గోరువారికి మూడునెలలకొకసారి పండ్రెండుగ్రంథములుగల సంపుటమును, వి. పి. ఖర్చులు మేమేభరించి 0-12-0 లకు మాత్రమే పంపెదము.

వలయువారు:— సాహిత్యసమితి
నిడదవోలు,
కృష్ణాజిల్లా